*

కవి రాజ హంస, కవికులాలంకార

శ్రీ వేంకట పార్వతీశ్వరులకు

షష్టిపూర్తి మహోత్సవమున

సమర్పితము

*

# విన్నపము

శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల షష్టిపూర్తి మహోత్సవము నాటికి "మహోదయము" సమగ్రముగా ముద్రించి వారి కరకమలములందుంచ నెంచితిమి. అప్పటికి కొన్ని పుటలు మాత్రమే ముద్రణము అయ్యెను. అనివార్యములైన కారణములచే గ్రంథపూర్తి కాలేదు. నేటికి "మహోదయము" ఆంధ్రలోకమునకు అందజేయ గలిగినాము.

తమ రచనలు మహోదయములో చేర్చి ప్రకటించుట కవకాశ మొసగిన కవులకును, కవయిత్రులకును మా మనఃపూర్వక వందనములు. మా కోరికపై ఈరచనల నన్నిటిని సంకలనము చేసి, మా అనురోధముచే తమ రచనలనుకూడ ఇందు చేర్చిన శ్రీ శివ శంకర శాస్త్రి గారికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఈ సముచ్చయములో కొందరి రచనలు మాత్రమే చేర్చగలిగినాము. కొందరివి చేర్చుటకు అవకాశము లేకపోయినది.

ఈ గ్రంథముద్రణమున మాకు తోడ్పడిన శ్రీ సుజనరంజని ముద్రాశాలాధిపతు లగు శ్రీ పోతాప్రగడ సూర్యనారాయణగారికి మా ధన్యవాదములు.

బాలాంత్రపు సత్యనారాయణ రావు
మేనేజింగ్ డైరెక్టరు

# అ ను క్ర మ ణి క

# ప్రవేశిక

## ౧

వివిధకుసుమాల పరిమళాలు ఆఘ్రాణించవలెనంటే ఆరామములలోకి వెళ్ళవలెను; నానాసూనవితాన సంకలితమైన గొప్ప గుచ్ఛమునైనా మూచూడవలెను. అట్లాగా వివిధకవుల రచనా మాధుర్యము చవిచూడవలెనంటే కావ్యసందోహాన్ని ఆస్వాదించవలెను; కాదా సంకలిత కావ్యసముచ్చయాన్నైనా రుచిచూడవలెను. ప్రథమపక్షము బహుకాలపరిశ్రమతో కూడినది. ద్వితీయపక్షము దానికంటె చాలా తేలిక.

ప్రాచీనకాలమునుంచీ ప్రముఖభాష లన్నిటిలోనూ పద్యసందోహాలు కనబడతవి. వైదిక వాఙ్మయము సంగతి విడిచిపెట్టితే, పాలిభాషలో థేర గాథలూ, థేరీ గాథలూ ఉన్నవి. ప్రాకృత భాషలో హాలుడు సంతరించిన గాథా సప్తశతి సుప్రసిద్ధము. ఆయేడువందల గాథలూ ఏకకవి కృతములు కావు; నానాముఖాల కవులూ కవయిత్రులూ సందర్భానుసారముగా చెప్పినవి. లౌకిక సంస్కృతభాషలో సుభాషితకోశాలు అనేకములు. ఉదాహరణార్థము: క్రీ. శ. ౧౦ శతాబ్దిలోని కవీంద్రవచనసముచ్చయము, ప్రసన్నసాహిత్యరత్నాకరము. నందనుడు సంతరించిన రత్నాకరములో ౧౦౦౦ శ్లోకా లున్నవి క్రీ. శ. ౧౧౮ ప్రాంతము

లలో అమితగతి సుభాషిత రత్నసందోహమునూ, ౧౨౦౫లో శ్రీధరదాసు సదుక్తికర్ణామృతమునూ, ౧౨౫౭లో జల్హణుని సూక్తిముక్తావళినీ సంతరించినారు. ౧౩౬౩ లోని శార్ఙ్గధరపద్ధతిలో ౪౬౮౯ శ్లోకాలూ, ౧౪౧౪–౬౭ ప్రాంతాలలో వల్లభదేవుని సుభాషితావళిలో ౩౫౨౭ శ్లోకాలూ కనబడతవి. ౧౪౭౭లో శ్రీవరుడు తన సుభాషితావళిలో ౪౦౦ మంది కవుల పద్యాలు ఉదాహరించినాడు. ౧౭ శతాబ్ది ఉత్తరార్ధములో హరికవి సంకలితమైన సుభాషితహారావళి ప్రసిద్ధము. ఆధునిక కాలములో సుభాషితరత్నభాండాగారము జగద్విదితమే.

౨

ప్రాచీనాంధ్ర సాహిత్య సందర్భములో భారతరత్నములు, భాగవత రత్నములు, ఇంకా ఇతరపద్య సంగ్రహములూ చాలా ఉన్నవి. అవి అన్నీ విద్యార్థులకు పఠనీయముగా ఉద్దేశించినవే కాని సామాన్య పాఠకులకోసము కాదు.

ఆధునికాంధ్ర వాఙ్మయములో కొన్ని సంకలనములు ఇదివరలోనే బయలువెడలినవి. ౧౯౨౩ ప్రాంతాలలో మదరాసు నుంచి ఉపేంద్ర ప్రచురణాలయమువారు ఒకటి ప్రకటించినారు. ౧౯౩౫లో జ్వాలా ప్రకటనాలయమువారు శ్రీ ముద్దుకృష్ణ సంకలితమైన వైతాళికులు, అనే పద్య సముచ్చయము ప్రకటించింది. వైతాళికులు ప్రసిద్ధిలోకి వచ్చింది. ౧౯౪౦లో శ్రీ నోరి

నృసింహశాస్త్రిగారి సంపాదకత్వాన 'నవనీతము' నవ్యసాహిత్య సంపుటి ప్రచురించింది. ౧౯౪౮లో తెనాలిలో కవిమిత్రులు 'నవ్యాలోకము' ప్రకటించారు. ఈవిధముగా పాఠకసామాన్యానికి ప్రమోదము కూర్చడానికి కొన్ని ప్రచురణలు అయినవి.

శ్రీ వేంకట పార్వతీశ్వరకవుల షష్టిపూర్తి మహోత్సవము నాటికి ౭౦ మంది కవుల కవయిత్రుల రచనలు వెలువరించవలెనని ఆంధ్రప్రచారిణీవారు ౧౯౫౩లో సంకల్పించి, ఆ కార్యము నిర్వహించవలసినదని నన్ను కోరినారు. గత ౩౦ సంవత్సరాలలో ప్రవర్తిల్లిన ఆధునికాంధ్ర కవితావాహిని స్వరూప స్వభావాలు గోచరమయ్యేటట్లు పద్యసముచ్చయము ప్రకటన కావలెనని వారి ఆశయము.

ఉత్సవము సమీపములో ఉండడముచేత కొంత త్వరితముగా ఈపని చేయవలసి వచ్చింది. కారణాంతరాలచేత గ్రంథముద్రణము కొంతకాలము ఆగిపోయినప్పుడు మరికొందరి రచనలను నేను సమకూర్చి ఇందులో చేర్చగలిగినాను. కవులందరూ నాకు మిత్రులు కావడముచేత, కవయిత్రులకు ఆదరము ఉండడమువల్లనూ ఈసంకలనము సులభముగానే చేయడము సంభవించినది.

స్థలాభావమువల్ల నేను చేయగలిగినదంతా చేయడానికి అవకాశము కలుగలేదు. ఆధునికాంధ్ర కవిత్వ స్వరూపము సమగ్రముగా ప్రదర్శించవలెనంటే ఇంకా ఇంచుమించు ౪౦ మంది

రచనలు చేర్చవలెను. కాని ఈసంపుటిలో దానికి అవకాశము లేకపోయినది.

3

పద్యసందోహము బహువిధాల కూర్చవచ్చును. సంకలన కర్త అభిరుచిని బట్టి కేవలము ఆయనకే ఇష్టమైన పద్యసంగ్రహము సమకూర్చవచ్చును. ఆయన వ్యుత్పన్నుడు, రసికుడు, సహృదయుడూ అయితే ఆసముచ్చయము చాలా హృద్యముగా ఉంటుంది. ఆ సంకలనకర్త ఎటువంటివాడో, ఆయన ఆశయములు ఎటువంటివో అభిరుచి ఎటువంటిదో వ్యక్తమవుతవి. రసవంతమైన ఉత్తమ రచనలు ఒకచోట చేర్చడము సంభవిస్తుంది. అయితే కావ్యవాహిని రూపము సంపూర్ణముగా గోచరము కాకపోవచ్చును.

మరొకవిధ మున్నది. ఒక్కొక్క కవిని గాని కవయిత్రిని గాని తమదృష్ట్యా ఉత్తమ మనుకొన్న రచనలే కోరి సమీకరించవచ్చును. దానివల్ల ఆస్రష్టకు ప్రీతిపాత్ర మయినపద్యాలు మాత్రమే ఏకత్ర చేర్చడ మవుతుంది.

తల్లిదండ్రులకు తరుచుగా తమ దుర్బలసంతానముమీదనే అనుకోని అనురాగము ఉండడము సహజము. అలాగే రచయితలకూ.

ఇంకొక విధానము: వ్యాప్తిలోకి వచ్చి ప్రసిద్ధము లైన పద్యాలు, పాటలనే సమీకరించడము. అందులోనూ కొన్ని బాధ లున్నవి. సభారంజక కవిత్వానికి అగ్రస్థానము వస్తుంది. ఆడంబర మున్న రచనలకు ఆదరము కలుగుతుంది. ఆలోచనా విశేషముగా లేని విచిత్రగతులకు గణ్యత ఏర్పడుతుంది. తాత్కాలిక ప్రదేశానికి తావు హెచ్చుతుంది. ఈ విధముగా అందులో కొన్ని లోపము లుంటవి.

వ్యాఖ్యాతలు, విమర్శకులు, విద్వాంసులు ఎంత సమ్యగ్దర్శనముతో సాహిత్యమును సమీక్షించి స్వారస్యమును నిర్ణయిస్తే అంత సమీచీన మవుతుంది. అట్టివారు సమితిగా ఏర్పడి పద్య పదసముచ్చయము సంకలనము చేయడము ప్రశస్తము.

౪

సంకలనవిధానము చాలా విధములు. కేవల వస్తుస్వరూపమును బట్టి తత్సంబంధ మైనరచనలే ఒక ఘట్టములో వేయవచ్చును. దీనిలో పరిస్ఫుటవ్యక్తి ద్యోతక మవుతుంది. కాని ఒక్కొక్కప్పుడు విసుగు కలగడానికి వీ లున్నది.

ఇక కాలక్రమానుసారముగా రచనలను సమీకరించడము సామాన్యపద్ధతి. ఇందులోనూ కొన్ని చిక్కు లున్నవి. కవి రచించినరోజు ముఖ్యమా, ప్రకటించిన వాసరము ముఖ్యమా? కొందరి మతములో రచనే ప్రధానము కాని ప్రకటన ప్రధా

నము కాదు. కాబట్టి రచనాకాలమునే ఆధారముగా స్వీకరించవలెను. మరికొందరు బహిరంగమైనదే పదుగురికీ తెలుస్తుంది, అదే ముఖ్యమని వాదిస్తారు. ఒకానొక ఆంగ్లేయ పద్యసంచ్చయకర్త చిత్రమైన సిద్ధాంతము చేసినాడు. కవి జీవితములో చాలా సంవత్సరములు చిన్నతనము, వార్ధకముగా కింద వృథాగా గడిచిపోతవి. కాబట్టి మధ్యవయస్సు ప్రధానముగా పరిగణించవలెను. ఈ వాదము సమంజసము కాదు,

అకారాదిక్రమముగా కొందరు కవినామముల పట్టిక సిద్ధము చేస్తారు. అది అనుక్రమణికగా మాత్రము అనుకూలిస్తుంది.

సామాన్యముగా కవి జన్మించిన సంవత్సరమే గణనలోకి వస్తుంది. అనేక సంకలనకర్తలు అవలంబించిన విధానమే నేనూ అవలంబించినాను. దీనివల్ల ఆధిక్యతలూ, తారతమ్యములూ శ్రేణీ విభాగము, మొదలయిన చిక్కులు ఉండవు. ఈ "మహోదయము" నా ఒకని అభిరుచినీ, సమ్మతినీ మాత్రమే సూచించదు.

౫

ఆధునిక కవిత్వము ఎప్పుడు ప్రారంభించినదని కొందరు పూర్వమే అడగడమూ సమాధానములు చెప్పడమూ జరిగింది. కవిత్వ ప్రాదుర్భావమూ, సర్వాంగీణస్ఫూర్తి శ్రీ రాయప్రోలు సుబ్బారాయ కవీంద్రుని వల్లనే అని సరస జనసమ్మతము. ఆయన రచనలు చేయకపోతే ఆధునిక కావ్యగమనము ఏమైపోయేదో!

కవుల చరిత్ర, ఆధునిక కవిత్వ స్వరూప స్వభావములూ, స్థలాభావముచేత ఇక్కడ నేను వివరించడానికి వీలు లేదు. శ్రీ కురుగంటి సీతారామ భట్టాచార్యులవారి 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' విశేషరూపముగా వివరించింది. శ్రీ పిల్లలమర్రి హనుమంత రాయుని 'సాహిత్యసమాలోచనము' వల్ల సాహిత్యోద్యానములో వివిధశాఖల విధానమూ, తత్త్వమూ గోచర మవుతవి. ఉదాత్త కవిత్వ తత్త్వము సిద్ధాంతరూపముగా శ్రీ రాయప్రోలు సుబ్బారాయ భట్టాచార్యులవారి 'రమ్యాలోకము' 'మాధురీ దర్శనము' మనోహరముగా చిత్రించినవి. శ్రీ నోరి నరసింహ శాస్త్రి ప్రభృతుల వ్యాసములవల్ల కవిత్వములో వివిధ గతులు విశద మవుతవి.

ఇతి శివమ్!

శివ శంకర శాస్త్రి

సాహితీ సమితి

[illegible]న్ గారడ



# శ్రీ వేంకట పార్వతీశ్వరులు

## ఉత్కంఠ.

వేణుగానరవంబు వినవచ్చె నేమొ
యమునలో నప్పుడే యమృత ముప్పొంగ;
ప్రియసఖీ, చెప్పవే ప్రేపల్లెనుండి
బయలుదేరె నటమ్మ, బాలకృష్ణుండు?

శిఖిపింఛకాంతులు చెలరేగ నేమొ
తరుపత్త్రములలోన తళతళల్ పుట్టె;
ప్రేయసీ, యప్పుడే బృందావనమున
కొలువుదీర్చె నటమ్మ, గోపాలమూర్తి?

గిరిమల్లికలతావి గిరికొన్న దేమొ
యాభీరమండలం బరశమై పోయె;
కల్యాణి, చూడవే కన్నుల గప్పి
మోసగించునో యేమొ మోహనమూర్తి!

## శరత్కుమారి.

వెన్నెలచీర గట్టి నెరవిచ్చిన కల్లుతురాయి బెట్టి మే
లెన్నిన సన్నజాజిపువు బెత్తుల గ్రొమ్ముడి చుట్టి, యేటివాల్
తిన్నెల నెచ్చెలుల్ వెదకి తీయగ వెన్నెలవత్తు లాడుచున్
పున్నమరేయి దాచు విరిబోణి విహంగిని యెట్టు లయ్యెనో!

కాంతుల విచ్చు చెంగలువకోవల వెన్నెలతేట నించి, చు
క్కల్ల [illegible] రంగరించి తమకంబున [illegible], [illegible]

బుల నోడి జేర్చి యుగ్గు లిడి పువ్వులతొట్టెల నుంచి యంచలో
య్యాలలను నూప బంపుజవరాలికి నేలొకో పక్షపాతముల్.

* *

ఘనతరు లెల్ల రిచ్చపడి కన్గొన కంచెల నున్న కేతకీ
వనములసౌమనస్యమును వర్ధిల జేయుచునుండి బీట లె
త్తినవడగట్లు బంగరుపుతీగల గూర్చి, ఘనుల్ భ్రమింప, బ
ల్మి నిటు పెరుంగుతీగ లెదలించుట యొప్పునె మోహనాంగికిన్!

తేటవన్నియమోము లేరవంకకన్నుల
గలనిస్వనములతో బలుకరించి,
పలుకవారిన పాలపండ్లగుత్తులు గూర్చి
చిలుకబోదలకు విందుల నమర్చి,
ననదేనె గొల్లలాడిన గండుదేంట్లను
చెందమ్మిలోగిండ్ల చెరలు వెట్టి,
చెదరి తారాడుచు చెట్లనీడల జేరు
చీకటికంటిలో జిచ్చువెట్టి,
ప్రకృతి లాలించి పాలించుబాల వయ్యా
జగతి రక్షించి శిక్షించు శక్తి గాంచి
విశ్వవిస్మయలీల నివ్వాలది యెట్లు
పరమపురుషప్రభావంబు బడసినదియొ?

అర్థప్రధాన మోహనసస్యలక్ష్మికి
గాల దలంచని తలకోత వెట్టి,
కామానురూపవిభ్రమరాజ్యలక్ష్మికి
నందగూర్పని కలగుండు వెట్టి,
అఖిలైహికార్థ భవ్యత్వమాలక్ష్మికి
బా పెడుంగని గుండెబీట వెట్టి,

పరమార్థవిభవ శోభనవిశ్వలక్ష్మికి
దగులు-నూవని వెల్లమొగము వెట్టి,
ఇట్టె వచ్చి వర్షాలక్ష్మి కెసట వెట్టి
విజయలక్ష్మి ప్రసంగంబు వీథి బెట్టి
రచ్చ కెక్కించినట్టి శరత్కుమారి
శారదేందిర యని యెట్లు పేరు గనెనో!

## కలువకన్నె

కిలకిలను నవ్వి న న్నాలకింప జేసి
సొంపుపెంపున నను దమకింప జేసి
కేలి గిలిగింత నను బులకింప జేసి
చక్కబోయెద విది యేమి చందమామ!

మోము నెత్తితి నీముద్దుమోము జూడ
కనుల దెరచితి నీచక్కదనము జూడ
మనసు విచ్చితి నీచల్లదనము నీడ
క్షణము నిల్పిన ద ప్పేమి చందమామ!

తావలపుజూపు తనకంట నాకెనేమొ
చుక్క నీకంటనే నన్ను జూచి నవ్వె;
చెంతచెలి మెచ్చి నన్నిట్లు చిన్నబుచ్చి
చనుటయే నీకు న్యాయమా చందమామ!

కమ్మదేనె సోక గలదు మైకమటంచు
వలపుగాలి మరులు గొలుపు ననుచు
కలువకన్నె బ్రతుకు గారడిగా జేసి
చనుట తగునె నీకు చందమామ!

మంతనంబు లయ్యె మాటలు లేకుండ
మోహముద్ర లయ్యె ముట్టకుండ
కలల గాంచుటయ్యె కనుమోడ్పు లేకుండ:
నిండ లేల నాకు చందమామ!

## ఏకాంతసేవ

సర్వలోకేశ, యీ సాలభంజికను
నీకేళిగృహమందు నిలువగా నిమ్ము.
భువనసంత్రాణ, యీ పుష్పవల్లికను
నీపూలతోటలో నిలువగా నిమ్ము.
భక్తమందార, యీ బాలశారికను
నీపంజరంబులో నిలువగా నిమ్ము.
కల్యాణధామ, యీ కనకపీఠికను
నీపాదములపొంత నిలువగా నిమ్ము.

అణువులు మొదలు బ్రహ్మాండంబు దాక
సర్వజీవుల కీవు సముడవు కాన
నీదర్శనము చేయ నే గోరికొంటి
నీపూజ చేయంగ నే గోరికొంటి
నీమాట లాలింప నే గోరికొంటి
నీసేవ చేయంగ నే గోరికొంటి
దయతోడ దిలకించి దాస్యం బొసంగి
నన్నేలుకొను మయ్యా, నాజీవితేశ

## భావ సంకీర్తనము

ఇది పదాడంబరమే లేని సుగమన, ఇది సుబుద్ధి
గ్రహించి యేలికొనుము;
ఇది యలంకారవిస్తృతి గోరని
శుభాంగి; ఇది స్వభావ
గ్రహించి యేలికొనుము;
ఇది చిత్రవృత్తంబు లెరుగనిసౌశీల్య; ఇది సుజాతి
గ్రహించి యేలికొనుము;
ఇది భావశైథిల్య మొదవనినిర్మల, ఇది సుభద్ర
గ్రహించి యేలికొనుము;
ఇది పవిత్ర, యయోనిజ,
ఇది యనంతభక్తిభావసంకీర్తనాభ్యాస
రాగయోగసంజాత,
ఇది మదీయాత్మజాత,
ఎలమి నర్ధాంగిగ గ్రహించి యేలుము ప్రభూ!

## శ్రీ చింతా దీక్షితులు

### ఉదయలక్ష్మి

సొంపుగా తూర్పున సుముహూర్తమందు
పుట్టుచుండె ప్రభాతపూర్ణబింబాస్య
స్వాగత మనుచుండె సర్వలోకమ్ము
కను డదె ప్రాగ్దిశ గనులపండువుగ.

పసపుతో నింటిపై బాగుగా నలికి
కుంకుమతో నమకూర్చిరి ముగ్గు
పూలు రేకులు విప్పి పుష్పాళ్ళతోడ
ఉదయలక్ష్మిని గొల్వ నూహించుచుండె.
గూండ్లలో పక్షులు కువకువ మనుచు
కలరవంబులతోడ గానంబు సేయ
కంఠాల సవరింప గడగుచునుండె
ఉదయలక్ష్మిని గొల్వ నూహించుచుండె.

చన్నీట వాయువు జలకంబు లాడి
పుష్పాడి మెయినిండ బూసికొన్నాడు
ఉదయలక్ష్మిని గొల్వ నొప్పియున్నాడు.

వనలక్ష్మి గొప్పయాహ్వానంబు సేయ
సర్వవిధంబుల సలిపె యత్నములు.
ముత్యాలసేసలు ముదముతో జల్ల
పత్రాగ్రములమీద పదిలంబు చేసె
మంచిమంచిరకాల మంచుబిందువులు
ధరణిపై బరచె రత్నంపు కంబళులు
తోరణాల్ చివురులతోడుత కట్టె
మింటిపై నొక్కచో మేఘకన్యకలు
చేరిరి హారతి చేత బట్టుకొని.

# గోదావరీ మాత

గోదావరీమాత గొనియాడ రమ్మ!
రా రమ్మ, రా రమ్మ, రమణు లందరును!
అల్లదె అదె కాంచు డదిగొ నాతల్లి
ముంగొంగు బంగారుముల్లె నాతల్లి
పట్టింటి వరలక్ష్మి నాకన్నతల్లి
నాకు నోగిర మిడు నాకన్నతల్లి
నాకు నీరము పట్టు నాకన్నతల్లి
పట్టిన దంతయు బంగారుముద్ద
ముట్టిన దంతయు ముత్యాలమూట
ఆయమపలుకులు అతికోమలములు
ఆయమపలుకులు అమృతతుల్యములు
ఆయమనడకలు అతికోమలాలు
ఆయమ సొగసుల కొలవాలంబు
ఆయమ గుణముల కొటపట్టమ్మ!
పూలతో పత్రితో పూజింపరమ్మ!
రా రమ్మ, రా రమ్మ, రమణు లందరును!
బంగారుభక్తి నీరాజనం బీయ
రా రమ్మ, రా రమ్మ, రమణు లందరును
మురిపెంపువదముల ముద్దిడరమ్మ!
ప్రణయవర్షం బామె వర్షించు నమ్మ!
మన కిలవేల్పామె మనపట్టుగొమ్మ
మనకల్పభూజంబు మనవేల్పుటావు
మము గాంచి మము పెంచి మన్నించుమాత

కరములు నొసటిపై ఘటియింపు డమ్మ
మనసులు సామిపై మరలింపు డమ్మ
గోదావరీమాత గొనియాడ రమ్మ
రా రమ్మ, రా రమ్మ, రమణు లందరును!

## చంద్రార్పణము

కలువ జిలుకుచు కులుకుచు వెలుగువెనుక
వచ్చుచున్నాడు తూరుపుపర్వతంబు
నెక్కనున్నాడు వేవేగ మ్రొక్క రండు
చేతులను జాపి కలువపూచేడెలార!

రజనిసామ్రాజ్య మేలంగ రాజు వచ్చె
స్వేచ్ఛతనువిలాసంబులు ప్రబలె దిశల
ప్రసవకామినులార, సౌరభము లూని
రండు వే రండు—ఇందు నీరాజనమ్ము!

లెమ్ము వాసంతికాకాంత, లెమ్ము, రమ్ము.
లేచి రావమ్మ, వారిధివీచికాంబ!
మెలకువను గాంచిసా వమ్మ, కలువకాంత!
లేవవే మారుతకిశోర లేడిపిల్ల!

కోరికా, బాగు, చాలు ముస్తాబుసేత,
గొంతు సవరించు కొంటివే కోకిలాంబ!
జీను వేయించుకొన్నావె జింకపిల్ల!
వెన్నెలపులుంగ, గజ్జెలు వేగ కట్టు.

చంద్రభగవాను గూరిచి నర్తనమున
ఆడుదము పాడుదము రండు—ఆంధ్రరమణుల!
రావోయి, నానాథ, రావోయి చంద్ర!
రావోయి, నాపుణ్యరాశి, నాచంద్ర!
రావోయి, లోకసంరక్షక, చంద్ర!
వచ్చియున్నా మయ్యా, భవదీయదివ్య
నామామృతమ్ము పానమ్ము సేయంగ
గానలోలుడ వంచు కంఠంబు లెత్తి
పాడుచున్నా మయ్యా, పాలించుమయ్యా!
నృత్యంబు సేయుచు, నినుగూర్చి పాడి
హృదయాల నర్పింప నెంచియున్నాము.
భక్తితో మత్తిల్లి పాదాలవద్ద
వాలిపోయెద మయ్యా, పాలించ వయ్యా!
నీవె మాదిక్కయ్యా, నీవె నాథుడవు
నీవు లేనిది జన్మ నిష్ఫల మయ్యా!
రావోయి, చల్లనిరాజ రావోయి!
లాలించి పాలించి అందుకో వయ్యా,
ఈభక్త లర్పించు హృదయాలు దేవ!

# వే ణు నా ద ము

౧

రంగురంగులతోడ రాణించి మించు
నిగనిగలాడెడి నెమిలిపింఛంబు
ఒకటి వేణిపై కుదురుగా నిల్పి
మొలకనవ్వులు ముద్దుమొగముపై నాడ

కాళ్ళగజ్జెలు ఘల్లు ఘలుఘల్లు మనగ
అఖిలజగన్మోహనంబైన దేహంబు
తొలుకారుమేఘమ్ముతో దులదూగ
వెలదులు పదునారువేలు మెచ్చంగ
వేణునాదము చేయు శ్రీకృష్ణుని వేణు
నాదం బొసంగును నాకు సంపదలు!

౨

చెలువల చెలువంపు చిన్ని మాటలను
ముద్దుబిడ్డలు పల్కు ముద్దుపల్కులను
చిన్నారి పొన్నారి చిఱునవ్వులను
కోకిల తీయని కూజితంబులను
బొట్లుగా రాలెడి పూవుదేనెలను
తల దన్ని వస గాంచు తద్దివ్యవేణు
నాదం బొసంగును నాకు సంపదలు!

౩

తొలుదొల్త దుఃఖాలు దూరమ్ము చేసి
నిండుమానసమును నిర్మలపరచి
ఆనందబీజాల నంతట నాటి
అంతయు దనలోన ఐక్య మొందంగ
చేయుచు వ్యాపించు చిన్మయవేణు
నాదం బొసంగును నాకు సంపదలు!

౪

వనలక్ష్మిసౌందర్య వైభవం బిచ్చు
జనము చేష్టలు దక్క సంతోష మొంద

ప్రకృతిగాయకు లెల్ల ప్రమదంబు చెంది
తల లూచి భళి యందు దండమ్ము పెట్ట
మూడులోకాలును మోహించు వేణు
నాదం బొసంగును నాకు సంపదలు!

౨

భక్తులహృదయాల భాసిల్లునట్టి
మునిమనస్సులు మారుమ్రోపెడునట్టి
కష్టాలు గంగలో గలపగలట్టి
సుఖమార్గ మంతలో జూపగలట్టి
దివ్య మహామోహనదేవునివేణు
నాదం బొసంగును నాకు సంపదలు!

## శ్రీ రాయప్రోలు సుబ్బారావు

## తెనుగు తల్లి

శ్రీకాకుళస్వామి సిగపై సువాసించె
తెల్లని ఆంధ్రుల మల్లెపూలు,
ఒడ్డిరాజుల జీరగడ్డ గ్రక్కుదలంగ
పోరాడె మత్తాంధ్ర కుంజరములు,
చీకటిమన్నెముల్ ఛేదించి నవధాన్య
ములు నెత్తె ఆంధ్రుల పోవుటెద్దు,
చిలుకసరస్సులో శృంగారనౌకల
నడపె ఆంధ్రుల ఇంటిపడుచు జతలు

ఉత్కలాశానితంబమ్ము లొత్తి హత్తె
ఆంధ్రుల యశోదుకూల సితాంచలములు,
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?
నాగార్జునాది కంఠముల గండూషించె
బలుభాష్యబంధమై తెలుగుకీర్తి,
ప్రాకృతాశ్రమ వాటికాకులమ్ముల నాటె
తీయమామిడియుంట్లు తెనుగుకవిత,
బౌద్ధధర్మరహస్య భావముల్ పరమ తా
త్త్వికదృష్టి విడదీసె తెనుగుప్రతిభ,
కొండలోయలలోన కోమలలావణ్య
మలరార చిత్రించె తెలుగుకుంచె,
గంగతలనుండి కావేరికాళ్ళదాక
వెలిగె దిఙ్మోహనమ్ముగా తెలుగుతీవి,
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?
పంజాబునుండి కప్రపు మొక్కలను దెచ్చి
పెరటితోటలలోన పెంచినారు,
పచ్చిజవ్వాజి గోవానుండి రప్పించి
దంతపుజాడీల దాచినారు,
కొండవీటి గులాబిగుత్తుల అత్తర్లు
కీలుతిత్తులలో బిగించినారు,
అసలైన పారసీకాశ్వాల నలవార్చి
విజయయాత్రల స్వారి వెడలినారు,
సాంగజీవిత కళ్యాణశాఖక్రింద
నిలిచి ఆనందగేయము లాలపించినారు,

తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?
మోటుపల్లీతీరమున లంగ రేసి ఓ
డలు సుంక మర్పింప నిలుచునాడు,
రాయలసీమ రారాయబార్లు వసించి
చిత్రచరిత్రల్ రచించునాడు,
పాకాల చెరువుచెంపల పండుధాన్యముల్
అన్యదేశాధిపు లడుగునాడు,
అద్దంకికోడలా అబోతులకు నయి
దూరాగతులు కొని త్రోలునాడు,
ఖండఖండాంతరముల బ్రకాశ మయ్యె
తెలుగుతల్లిలాలాటికా తిలకదీప్తి
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?

నందనోద్యాన సౌందర్యమ్ము నెగబోయు
గోదావరిముఖాన కోనసీమ,
సుఫలసంపత్సస్యసురభియై మెరయు కృ
ష్ణారఘశ్యామ గుంటూరుసీమ,
ధవుని పోరి కదల్చి కవిని నేరిమి గెల్చి
మీరినజాణ నెల్లూరిసీమ,
ఆంధ్రదిగ్జయ పతాకాలంకృత మైనన
రత్నాలయంగడి రాయసీమ,
నేల నాలుగుచెరగుల నిగ్గు దేరి
రాణ సూయాణమై తెలంగాణరేఖ
తమ్ముడా! మాయనిత్తువే తల్లివన్నె?
చెల్లెలా! చిన్నబుత్తువే తల్లిచిన్నె?

# మేఘము

ఆకాశంబున జీరువాఱఁగ సొగసై యాషాఢయోషా వితం
బాకీర్ణాలకజాలకంబు లన పాయల్ పాయలై మేఘముల్;
రాకాచంద్రవిలాసముల్ మసుగు వారన్ నైల్యమాల్యంబులై
ప్రాకెన్ జీకటిచెట్ల సోయగపుపూరంగుల్ దిశాంతమ్ములన్.

చినుకు చినుకునకు జీలిన చిన్నిరేకుల
తోడ పద్మంబు లల్లాడఁదొడఁగె;
ధార ధారకు మూపు తగిలినచిగురుల
తోడ కొమ్మలు సొంపు లోడఁగడఁగె;
జల్లు జల్లునకు దృష్ణలు పఱ్ఱు తీయమ్ము
తోడ చాతకము ఆఱ్ఱాడ సాగె;
ఉరుము ఉరుమునకు నంకురమైన మొలకల
తోడ వేణువులు తూగాడనయ్యె;
ఖేదమును మోద మవనికి గీలుకొలిపి
ప్రౌఢ వయి నటియింతు వాషాఢలక్ష్మి,
పల్కలేక ప్రాల్మాలు నాసాల్క గూడ
క్రొత్త చక్కిలిగింతల గుస్తరింప.

ఎండినబీళ్ళయందు నుదయించిన పచ్చిక కండ్లపండువై
యుండగ జూడియాలు తల లూపుచు బోరెడి, క్రొత్తనీటిచే
నిండె దటాకగర్భములు, నిమ్నకటముల్ కడు శ్యామలంబులై
మెండుకొనెన్ వనిన్, మొగిలు మేసె ప్రభాతములందు గొండలన్.

నీడల్ గట్టగ భూమియందు, జడలన్ ప్రేలాడు కాదంబినీ
చూడాకృష్ణకలాపగుచ్ఛములపై జూడ్కుల్ కటాక్షించి, లీ

లా డోలాసుఖలాలనీయరతి సోలిసి సాగె నృత్యోత్సవ
క్రీడోన్మాదములై మయూరములు సాగెన్ పింఛము ల్విప్పుచున్.
కదళీమూలలనుండి పిక్కటిలి లేచి
బొబ్బరిల్లుచు మబ్బులు పోవసాగె,
తొలకరి వయఃపయస్సుపొంగుల విధాన;
గుబ్బెతల విప్రలంభవాగురుల చిక్కె.

## పాటలు

౧

ఆనీలనగరిలో అందాలవాడ
అందాలవాడలో అతితెల్లమేడ
ఆమేడదాపున అమృతంపుసరసి
సరసిలో చక్కగా విరిసినపూలు
పూలలో ఉప్పొంగు పాలధారలను
నీపెండిగిన్నెలో నింపి నెమ్మదిగ
మాచిన్నిపాపకు మాపురేపులును
చల్లగా తెచ్చియ్యి చందమామయ్య!

౨

తెల్లకుచ్చులపాగ అల్లల్ల నసియాడ
చిన్నిగొర్రెల మేపు చిన్నారిగొల్లాడ!
చరుగత్తి పారయ్యేవు పడిపోయిన ట్లేమొ
చెరు గన్నె బోరాం నీపెండ్లాము, లే దింటి;

నీవెడిపో తెల్ల త్రాకెనె యింతలో?,
నిలుచుండె కాసంత పలుకున్నదో మామ!
మునిగిపోలేదు నీముత్యాలభవనంబు,
పారిపోలేదు నీపాడిగొర్రెలమంద.

3

నిదురబో మాతండ్రి నిదుర బోవోయి!
నిదురబోయె జగంబు నిఖిలప్రాణులతో!
సిరిసిరి జాబిల్లి చెరిపేటిపాము
పూసినపువ్వుపై మూసెరా తండ్రి!
మల్లెగుత్తులు పారజల్లు చెక్కిళ్ళ
పిల్లరావి చిగుళ్ళను వ్రాయె తండ్రి!
పాలు పొంగేటి నీబంగారు కండ్ల
వాలారు నీలాలు రాలెరా తండ్రి!

## పాలబాన

అత్యంతసుకుమారి వైనట్లు కనుపింతు
వేలాగు నడిచితో 'యీదూరపథ మెల్ల?
ఏలీల గడచితో ఈముండ్లపొద లెల్ల?
ఆకుపల్చనినిగ్గు లసియాడు నీమేన

ఏభంగి మోసితో ఈపాలభాండంబు?
ఏచాయ మూసితో ఈబాలభాగ్యంబు?
పూర్ప్పండు పెంక్కంత చేర్పుకల చెమటార
[illegible] సురపొన్నపూవుట్లు

వ్రాలేవు లేకున్న పసితమల్పాకట్లు.
గులకరాబాటలఁ బలుకపూదోటలా
లేచాయ మార్చితో ఈమెత్తనిపదాలు?
ఏతల్లి నేర్పెనో ఈయింద్రజాలమ్ము?
ఎవరియింటివి ఆలు? ఎవరు పిండిరిపాలు?
చిన్నారిలేగలఁ కన్నెతీగల గట్టి
కన్నారికడ కిట్లు మున్నె వచ్చిరి యెట్లు?
పాలూరు నీవల్కు బాలెంతపసి చిల్కు
పాలీయవచ్చి తీపడరానిపాట్లోర్చి
పాలమ్మ్రతమంత భాగవతోక్తంబా!

## శ్రీముఖ

ఋతువున కొక్కరూపు సవరించి, యహర్నిశలన్ తెరల్ యథో
చితముగ లేచి వ్రాలఁగ, కుశీలవులై నటియింప ప్రాణినం
హాతి సుఖదుఃఖరంగముల, నాదియు నంతము లేక సాగునీ
స్తుతిమ దదృష్టకాలనయచోదన కంజలి నిత్తు నర్మిలిన్.

చిన్నితెలిదుక్కు లద్దిన వన్నెసోగ
తొగయ తీగల, సుగంధసమృద్ధి నఖిల
దిశలు తలదిమ్మ వోవ నేతెంచె నింబ
వృంతసుమతోరణములతో శ్రీముఖంబు.

నవకము బుక్కిలించెను వనస్థలు లెల్లడ, బుక్కరించె బ
ల్లవకుల రాగరంజన మెలర్పగ గొమ్మలు, కన్నెతీగ లు
త్సవరతి నవ్వినట్లు వనధాతువులన్ గుసుమించె గుల్కుచున్
కవితె గిలార్చుచున్ వయసుకావరమే ప్రకృతిన్ సమస్తమున్.

ప్రసవించిన యొలతీవెల
పసిపాపలపొత్తు లారబరచిన పగిదిఁ
మిసమిసల చిగురుటాకులు
పసుపారెడు నెరుపు మెరయ వటవృక్షములన్.

పదినెల లాయె బందె బడి వాకిలి మూసి రసాలవాటికన్
మెదలక యున్నకోయిల సమీరుని చక్కిలిగింతగుంఫనల్
కదపగ మేలు కాంచి కలకంఠముతో నవనీతగోస్తని
మృదుమధురంబుగా గళవరించు మధూదయపర్యుషస్సులన్.

## రమ్యాలోకము

మామిడికొమ్మమీద కలమంత్రపరాయణు డైనకోకిల
స్వామికి మ్రొక్కి ఈయభినవధ్వనిధారణ కుద్యమించితిన్
కోమలగోస్తనీరుచులకున్ కదళీఫలపాకసిద్ధికిన్
లేములుదీర్చు మా తెనుగులేతముదుళ్ళ వెలార్చువేడుకన్.

పూర్వలక్షణములు దిద్దుబుద్ధి లేదు,
అతినవీనముల్ శాసించునహము కాదు,
నవ్యకావ్యదృష్టిని చూపినాడ నంతె:
కలదు కాదె అనుక్తంబు గ్రథనమందు,

* *

క్రౌంచమిథునానురాగ దారణమువలని
శోకమే శ్లోకమయి, వేదమృదూకృతాత్మ
ముఖవియత్పథమున గంగబోలె వెడలె
అవచస్వి ప్రాచేతసు నాత్మదలతు.

సకలకల్యాణవసతి యాప్రకృతిలోన
భావభాషాభినయు లైన ప్రజలయందు
హ్లాదరామణీయకముల పాదు నెఱిగి
కావ్యరతు లైనఘను నెంతు కాళిదాసు!

* *

కావ్యమును, గీతియును, చిత్రకళయు, వరుస
కబ్బిన యుదాత్తదివ్యాంశ లవనిమీద:
పశుదశావరణంబు నావలకు దాట,
తన్మయానంద మంద సాధనలు కావె!
దారులోహశిలాకల్పితంబు లైన
విగ్రహాదుల సౌందర్య విభవమందు,
వివిధలావణ్య, కారుణ్యవిభ్రమములు
హత్తక అపూర్త మగు శిల్పవృత్తి సిద్ధి.
విన కనగలేని బధిరాంధజనుల కకట
సుస్వర ప్రతిమాదులు శూన్యము లగు.
ఏతదభివర్ణనాపూర్ణకృతుల నెలమి
చదువ గల డొక, డాలింప జాలు నొకడు.
పూలకడుపులలో తేనె పోసె నెవడో,
దాని దీయు నేరుపు తుమ్మెదకు లభించె;
భాషలోని మాధుర్యలావణ్యభావ
సాధుభోగము కవిముఖసాధ్య మయ్యె.
సృష్టియందె ఈశ్వరుని అర్చింత్రు కవులు,
శ్రుతికి మూలం బగును మాతృసుస్వరంబు,
కావ్యగీతులు ప్రియసాధకములు ప్రాణి
కములకానంద కొంకడె లక్ష్యంబు యగును.

కలవు రసరామణీయకములు కృతులను
మాధురీ సౌరభమ్ములు మధువునబలె;
రసము అంతఃకరణరోగరంజనములు,
రామణీయక మాకర్ష రమ్యరచన.

స్వాదు మృదుపదసహవాస వాక్యరీతి,
గణనమాసంజిత మనోజ్ఞగతుల కలిమి
నందు చెలువమ్మె రామణీయకము కృతుల;
శ్రావ్య మగుచు నాకర్షించు ప్రాణితతిని.

ఖేద మోదప్రసక్తులన్ ఖిన్నకుశల
దశలకు వశంవద మగుచు, తన్మయ మయి
తన్మయు మొనర్చు సహృదయాంతఃకరణ ము
ఖోపభోగ్యమె, రస మన నొప్పు కృతుల.

రసరతం బైనహృది, మకరందపాన
పరవశం బనుమధుకరావస్థ నందు,
తన్మహత్తర కైవల్యధారణాప్తి
కావ్యమందు అనందంబుగా స్మరింతు.

## శ్రీ కవికొండల వేంకట రావు

## ఎందుచే? ఎందుచే?

కొరియాకు నొక్క చెంగు, సయాము కొక చెంగు
వచ్చన్ని పారాణి బలి, సుమాత్రాలపై
పరిభవింపగ, నాట్య మాడింది తల్లి!

తొల్లి పాట పాడింది!
ఎందుచే? ఎందుచే?
స్వేచ్ఛచే, స్వేచ్ఛచే.
గాలివా దూరకే కాసంత విసరితే
కదలియాడేవి మనతల్లి పెన్నెరులు,
అల టిబెట్ దేశాన కాపైకి నాపైకి!
ఎందుచే? ఎందుచే?
స్వేచ్ఛచే, స్వేచ్ఛచే.
బుద్ధు డొక డుదయించి సుద్దు లాడిన యంత
సిద్ధి బడసినవంటు ముజ్జగములే జనము
లెందుచే? ఎందుచే?
స్వేచ్ఛచే, స్వేచ్ఛచే.
చా పెత్తి మనయొద్దు సెలవు నడిగిరి మన్న
రూపించి దిబ్మండలారోహణములోన
అగపించెనట మున్ను ఈ చైత్రశవపు గళలు
ఎందుచే? ఎందుచే?
స్వేచ్ఛచే, స్వేచ్ఛచే.

## రంగు – చెంగు

రంగంటే రంగే కాదు, చెంగంటే చెంగే కాదు;
రంగద్ది నట్టిచెంగు రామకొన్నాది.
తొంగుండే సందెవిడత తోచకున్నాది రం.
నిద రోదా మంటె దాం యెదుటు చూపులు గుదులు
గుదులుగా నాదుకంట మెదలుతున్నాయి
వదలింపుకొందా మంటె వదలకున్నాయి రం.

పదం పాడుకుంటు బుద్ధి చెదరింతా మంటె, అబ్బ!
పదం ఎల్ల దానివల్కె పలుకుతుంటాది
కధముందు దానికులుక్కె లెదురుకుంటాయి!
మొన్న వచ్చినవేళ నిన్న వచ్చినదాలా,
నిన్నంటే నిన్నే కాదు, మొన్నంటె మొన్నే కాదు:
పున్నమి పుచ్చపూల వెన్నెల గాయురేల

## దాక్కొని వుంటాయి!

దాక్కొని వుంటాయి!— దారంట గడ్డిని
రుక్కొని వుంటాయి!
తలపగ రానిపూలు,
పిలువగ బోనిపూలు,
విలుపగ లేనిపూలు,
దాక్కొని వుంటాయి! దారంట గడ్డిని
రుక్కొని వుంటాయి,
గుక్కెడు వాననీళ్ళకు
పక్కన నవ్వుతాయి;
ఒక్కగ కాసంతుంటే
త్రొక్కట పడతాయి— దాక్కొని వుంటాయి!—
లెక్కకు రావోంతే,
చిక్కువు మాలను గుచ్చ
ఇక్కడ నక్కడ బచ్చ
జక్కన పూస్తాయి!
దాక్కొని చూస్తాయి! దారంట గడ్డిని
రుక్కొని చూస్తాయి!—

ఒక్కడ నడుస్తూ వుంటే,
చుక్కలు పొడుస్తూ వుంటే,
మక్కువ గూర్చో మంటాయి
ఎక్కడో ఎందుకో చెప్పవు
దాక్కొని వుంటాయి దారంట గడ్డి ని
రుక్కొని వుంటాయి.
మంచుబిందువు పడిన,
ఎంచి బొమ్మము విడిన,
అంచుల గాస్తాయి;
వంచక మోస్తాయి
దాక్కొని వుంటాయి దారంట గడ్డి ని
రుక్కొని వుంటాయి.

## రా గో ద ం త ము

౧

ఈప్రపంచమునంతను స్వైరనిజగి
పూని పూరించి తనలేతపొద్దుపొడుపు
సొగసు చూపింపవలె నన్న, సూర్యుడును
తనదుబింబంబు సర్వస్వమును చిగిర్చి
తలయగా వలె; లేకున్న కలియదు జిగి.
సాధుసర్వంసహాచక్ర చైత్రశోభ
రాగ మొలికింప సమకట్టి, రాగ మెత్తు
కవియు నంతేను: అతగాని ప్రవిమలహృది
సర్వ మనురాగభరిత నిసర్గమూర్తి

నిండిపోవలె మునుముందు: నెగడు పిదప
జగము తనయంత వశమూర్తి చక్రనికెరి.

౨

"ఏటి కోచెలి! నీటిపై చెత్తి కొట్టి
వలయములు గూర్చుదానవు? పట్టిబిందె
మట్టు నలగు! శరత్కాలమాన మిపుడు;
ఏల పాడునేతువు సంజవేళ జిగిం?
పసిమిబిందె ముట్టెను నీమపయుటచెరగు
విసరి ననసన్నగా జుట్టే వెల్లువ యిది."
"ముదుర బెట్టినగోరింట వదలిపోవ
గడగినారము తెలవారగట్ల ఇచట
కాలునేతులు; పోద్రోయు కల్మష మది
నటన చేసెదు నా డగు కుటిలబింబ
మలలనే, పట్టి కడబోయు కలుషము యది.
తప్పు వీరెందు మాకు నిద్దపు శరత్తు
సాధురాగోపపత్తిని సాగుచున్న.

౩

ఇద్దరునుగూడ నన్ను జయించినారు,
ఒకతె రాణి, రెండవది దాసిక; రహస్య
హార్మ్యతూలికా తల్పమ్మునందు బండి
యర్ధరాత్రి మూగెదు, పాలయలుక రాణి;
ఆమె నిదురించువెనుక, నే నామెకలను
గానుపించెద నంట! నే గలకల మని

తెల్లవారెడువేళ నగ్గ దెలిసి తాను
ప్రేముడిని కౌగిలించెదు, ప్రియుడ, యందు
కలను మరవంగలే నంచు గదిసి కదిసి
అల్ల రెండోది పగలు మధ్యాహ్నదీప్తి
ధూళిగప్పెడు తెన్నునే దోసి లొగ్గి
పాదములు ముట్టి మోపెదు ప్రణయభరను;
లేవ నెత్తుదు: మూర్ధంబు మోవి నిట్టి
ముద్దుగొని గారవించుదు 'మోహనుండ!
అర్ధరాత్రికాలాన స్వప్నంబునైన
నిజముపోలిక దలపోతు ని' న్నటంచు
ఇక 'మరవ మరవ' నని దాసిక గరంబు.

# శ్రీ మాధవపెద్ది

## సంబోధనము

అవసానంబున హంస చేయురుతితో హంసాభిధుం డైనయా
రవి సాయమ్మున నస్తమించురుచితో రక్తాంశువుల్ రాల్చుచున్
కవిహంసా; అలనాడు దైవశముపై గాగ న్నిషాదత్వ మం
త విషాదాంత మొనర్తువే కవన గాంధర్వంబు నంతిశ్రుతిన్!

వాకను వాకనుక్ జ్వలితవహ్నివిధాన కిరాతుగూర్చి వా
ల్మీకిముఖమ్మునుండి వెడలె న్మృదు శ్లోకము కాని శోకమే
యాకృతి నొంది నీయెడల అంతరతన్ జత బాయుపక్షిగాం
తో కవి, నేనుగూడను ఇవ్వాకవు పంచు ధ్వనించు మాహృదిన్.

అజానివిలాపముం గడచునట్టిది నీమువిషాద మొక్కటే
నిజముగ అప్పుడప్పుడు జనించువియోగముకన్న నెప్పుడో

స్వజనము బాసిపోదు మను సంగతిరయే సహింపరాని దీ
ప్రజ కది యెంతదుర్భరమొ పాపము, నీయటువంటివేత్తకున్.
అవునా నెచ్చటినిన్నొ యిచ్చటికి త్రోయుట న్యాయమా? సర్వమా
నవసంఘంబును నీదుపక్షమున నుండన్ సిద్ధ మిమ్మాట కిం
కేరలో వేరుగ సాక్ష్యమీవలెను, నీ కిష్టంబు కౌనట్టులన్
కవు మంచుం బడి నేలపై యపు డటుల్ గీపెట్టుచే చాలదే!
ఈవడియున్న నిన్నిచటనేనియు నుండగనీక యెంతచూ
పోపనివాడొ యింక నెటకో తరలింపగ నున్నవా డెవం
డో పొడగానరానియొకధూర్తు డతం డవెు యీశ్వరుండు పో
దూ, వసివట్టుచే పరమదుర్ఘట మేటికి తద్విచారణల్.
ఈపువుబోడి నిన్విడువ డెన్నటికేని నిరర్థకంపుదై
న్యోపహతిం గురించి వగ నొందకు, నీప్రియతోడుత న్నినున్
గోపల బెట్టుకో గలదు, లోకు లెరుంగగలారు వాసనా
రూపక నిన్ను నన్ను మిది రూఢిగ నాయుమరూ, జగద్గురూ!



మల్లీ, యిప్పుడె వత్తుమమ్మ తిరుగన్, మందారమా, అక్కలుం
జెల్లెండ్రే మనకొందరమ్మ, ఒక యింటే నిల్చుచో? మాలతీ
ఒకసౌంగంధము చేసితమ్మ యిటు లీ. పూరింపగా సాగినన్
శాఖ్యే సాగవు గాలి నీవయిన నేగా అమ్మ, పున్నాగమా!
ఎగువన్ చల్లగ పాడునట్టిసెలయేటి కే నిల్వ్యటద్దమ్మగా
పొగడా, నీడలు చూడుకోనె సరిపోవున్ బ్రొద్దుప్రొద్దుల్ల నీ
కిగ మమ్మొక్కడ చూడ తీరుబడియా! ఎంతెంతగా వేదనే
డగనో రాల్లు వొకొక్కళ్ళూ వయిన వాడన్ వాడ వాసించుతే!

ముట్టగా రాము లే మమ్ము, మొగలి, నిన్ను
బాకులుంగూడనా రేకురేకనందు
ఒరసికొనిపోద ఒక లేఁగదో భుజంగి?
అవు నెవనిపోయి వానికే యావగతంబు.

నవయుచునుండ నొక్కపువు నవ్వుచునుండెఁ మరొక్కపూవు కొ
ల వళతజేసి చూడు మబలా, యిచటన్ మరువంపుమొలక నం
భవ మయినట్లె వేరొకట 'మన్మథుమొలకయు' రాలిపోవు నీ
భువి పరికింప నెంత మది పొంగునొ అంతకు నంత క్రుంగడిన్.

పోకలు పూచుచున్నపుడె పోకల తమ్ములపాకుతీవియల్
ప్రాకుచు ప్రాకుచున్నపుడె పైవయి వచ్చి లవంగవాయువుల్
సోకుచు సోకుచున్నపుడె సుందరి, యీలవలీనికుంజమం
దేకత ముండి నేడు సుఖియింతము రేపటిమాట కేమిలే!

పూచుగులాబి యిట్టులనె పూయుచు నుండదు సర్వకాలమున్
నాచెలి, నేడు దాచినధనంబటు వచ్చెను, చూడు మెట్టులన్
లేచెడినో వసంతనవవీథులు నోచిననోమువంటలై
ఊచెడి రాగమూర్ఛనల నుండుద మెందొకయందు నిందులన్.

ఎండోటంబలె నవ్వుచుం బ్రదుకుమా, యెల్లప్పు డానందమున్
చెలయేరై ప్రవహింపుమీ, మృతికిఁబై నీ వేమి యౌ దందు లో
దలతో అయ్యది యిప్పుడే యయితి నన్ తత్త్వంబు గైకొమ్మి యీ
యిల నీ కప్పుడు హాయి నీగలదు సుమ్మీ తూగుటుయ్యేలలై!

హాయిగ నుండి యేటియధరాంచలమందున యిప్పుడిప్డిక
న్మాయుచునున్న దీలవలి ముద్దులయీలతకూన నేక్రియం
జేయుదు నయ్యగా. ఇటులె జీవులకష్టసుఖంబు లెన్నకే
న్యాయవినోదమార్గమున స్వేచ్ఛగ క్రీడ యొనర్చు దైవమున్.

ప్రియజన మేఘలిక విడిచిపెట్టెనో యీమన కాన్గలమ్మె యా
శ్రయ మయి చూచితే యెటు వసంతనవోదయరాగ రంజితం
బయినదో శయ్య గూర్పుము రయమ్మున కాలము తీరిపోయి భూ!
శయనము నొందె యిం కెవరిశయ్యల మూదుమొ యెల్లి చెచ్చెరీ

ఇహమున కొక్కమారె ప్రవహించును జీవనధార బుద్ధియన్
గుమా వెలువడ్డ నీరమటు కోమలి! యెన్నిదినాలు చుట్టినన్
ప్రహారిని చెట్టుద్రొక్కినటు పోయెదు తద్గహనమ్ము క్రమ
ట్లహారహామున్ హరించుకొని యారుదు పోదు నెడారిగాలినై!

ఏసుఖభోగిమట్టి నుదయించెనో నుట్టినమాత్ర నెట్లు క
న్మౌసెనో చూడు మెంతసుకుమారియొ యీలవలీకుమారి! ఏ
రానుతసొంపు కెంపుటధరమ్మున జన్మము గాంచుపున్నెముం
జేసెనో యాగులాబి దరిసించి మనమ్ము ద్రవించిపోయెడిన్!



కలిగెన్ వింతవెలుంగు జీవిత కెదో కాసెక్ మనోవీథి వె
న్నెలలన్ నవ్వుచునుండు నీకమలు; వన్నెల్ వన్నెలన్ చిన్నచి
న్నెల రాచిల్కగ గూడు గట్టుకొని లోనే కాపురం బుండె నీ
కల పోముద్దులసీము, రమ్మ నడిపింప న్ననన్ను పూబాటలన్.

కలకుం బ్రాణము వచ్చినట్టు మది రెక్కల్ దెచ్చుకొన్నట్లు మ
బ్బులతో మంతన మాడియుండి మనచూపుల్ చుక్కలం గప్పి ద
వ్వుల పూజల్లులు కొట్టికొట్టి యెటనో పోరాని రేయెంచుచుం
దులలోనో విహరించుచుంటి మనిపించుం గోర్కె లూరించుచున్.

ఇం దీస్నేహాలతానుషంగమున నేనే నీవునై యుండి నీ
సౌందర్యంబును విప్పిదన్ నెమలిపింఛంబట్లు లోజూపులో
నందింతున్ హృదయమ్ముకున్ హృదయ మత్యంతంబు నర్తింతు నా
నందాశ్రుల్ పారణిల్లి కన్గొనల నీనాత్మప్రేష చల్లారగన్.

ఒకరూపంబె వహించుమేఘములమై సత్యమా! ఓఅమా
యికమా! కొండలతేలిపోవుదుమ కాదేన్ చంద్ర కాంతాలమై
ఒకమారే వికసించి వెన్నెలకు లోలో లీనమై పోవమా
ఇక క్రొంగొత్తగ నొక్కరింకొకరమై యే నీవు జన్మింతమా!
జతగా నిర్వ్యర మొక్కరూపమె వహించన్ నీవు నీవేళలో
హితమై యుండక పోయినట్లయిన పోనీ నీవు పుష్పించుమా
అలినైనన్ ప్రకృతిశ్రుతిం బ్రణయలీలాగీతికల్ పాడి నీ
ప్రతిపుష్పంబు మరందబిందువుల నాస్వాదింతు భృంగంబనై.
అదియున్ నీకు ననిష్టమైనయెడ సంధ్యాస్వర్ణవర్ణమ్ముచే
పొమవంగా బడినట్టి చంద్రకళనై పో మిమ్మవు! దివ్యోదక
హ్రదమై పోదును నేను, నాయుదకమధ్యంబందు బింబించి నే
కదలన్ గాలికి నీవునుం గదలి యూగన్వచ్చు నాలోపలన్.

## శబరి

తరుబాలలు ముద్దుంబువు
లిరుచాయల నద్దుచుండె నెంతేని మనో
హర మంబ, పొరుటాకుల
విరచిత మిది పసిడిరేకు విసనలకంబేన్.

మరకతతృణవేదిక తే
ర్పరచితి కూర్చితి ప్రవాళపర్యంకమ్ముల్
చిరపరిచితప్రదేశమె
సరిక్రొత్తం జూతు సారెసారెకి దేమో!

గ్రువ్వంగా బడునట్లుగా కను కుదురొక్కన్నట్టు లేపువ్వు కా
పువ్వే తానయి పుట్టివచ్చినటు లేపూదండ కాదండయే

అవ్వా, చిత్తము విస్మితం బగుచు నీయావేగమున్ జూడగా
ఎవ్వా రెంతటిపూజ్యపాదు లిటుగా నేతేరగా నుండిరో.
అది యేమ ట్లరుదెంచుచున్నవి మనుష్యాకారతం బూని యి
య్యుదయార్కున్యా హిరణ్మయప్రభయు విద్యుల్లేఖయున్ నీలతో
యద మాహా, యిపు డెంతలో జెదరె చూపవ్వా! యెటుల్ నిత్యస
త్య దయారాసులు లక్ష్మణానుగత సీతారాములో కేశులా!
పరతెంచుత్రోవ చక్కం
బరువంగా లక్ష్మణుండు వలుకొదుమ ని
దరియుచునున్నా రదె నీ
చిరకాలతపఃఫలములు సీతారాముల్.
ఓశబరి, వచ్చి రిరుగో ఫ
లాశను అభ్యాగతస్వయంపుష్ఠువులై
దాశరథులు నీయెడల ద .
యా శరధులు స్వగత మేల స్వాగతవేళని!
ఎదురు చని తోడుకొని తె
వదుటికి వా రంతవారె సుతెంచిన నే
మిది కన్ను లప్పగించెదు
మదియవ్వా! యర్ఘ్యపాద్యములు, కొనితేవా!

## శ్రీ వీరరాఘవ స్వామి

### క వి తాంత

తరణికిరణంబు లపుడప్డు తప్పు జేయ
కాలమేఘాళి సారెకు గప్పుచుండ

కృష్ణపక్షము లెపుడు కృశింపజేయ
విమలకమనీయ కౌముది హిమకరుండు
శారదనిశీథినుల వెదజల్ల కున్నె?

గండశైలంబు లెన్నొ మార్గమున బడిన
ఊరునికుంజంబు లెన్నొ క్రిక్కిరిసి యున్న
తీక్ష్ణకిరణము లెంత బాధించుచున్న
ఝుర మతిరయమ్ముతోడ వర్షాగమమున
ఇరుకెలంకులు తెగ ప్రవహింప కున్నె?

అనిల మామోదమును సతం బాహరింప
మార్దవము నాతపము రూపుమాపుచుండ
భృంగములు మకరందము బీల్చుచుండ
కోమలంబుగ విచ్చి పరిమళంబు
కుసుమము వసంతవేళను విసర కున్నె?

ప్రేమతో గన్నతల్లి తన్విడి చనిన
విరసకంఠాలనదుమును బెరుగుచున్న
అరిభయంబున నాకుల నడగియున్న
తరుణ మరుదెంచుచో కలస్వరముతోడ
ప్రమదభరమున కోకిల పాడ కున్నె?

సంతత మడంగి యున్నె నిసర్గగుణము?
ఎంత ప్రతికూలవృత్తిలో నిరికియున్న
ఎంత యుత్సాహజలధార లింకుచున్న
హృదయకుహరాన కవితాంశ దృఢత నుండ
ఉండునే యది యుప్పొంగకుండ నెపుడు?

## ప్రబోధము

తీయమామిడిచెట్లకై తిరిగి తిరిగి
వానిపండ్ల జివుళ్ళ నవ్వారి గాగ
పొట్టలో వేసికొనుటలో బోయె పవలు,
ఇంక సంగీతముం బాడు టెపుడు పికమ!

తీయపండ్లు రుచించును తిన్నకొలది
తృప్తి చెందదు మన సెంత తినిన; కాని
దినము తినుటయు రాత్రి నిద్రించుటయును
జరుగుచుండిన గానంబు సలుపు టెపుడు?

రాత్రి యంతయు క్షీణించె క్రమముగాను
తోచుచున్నది ధవళిమ తూర్పుదెస
పత్రములమధ్య నీవిధి బవ్వళించి
ఇంక నిద్దుర చాలింప వేల పికమ!

నిదుర మేల్కొమ్మ, విప్పుము నేత్రయుగళి!
"చంద్రు డున్నాడు, నిద్రింప సమయ మింక
కలదు లే!" యను భ్రాంతితో గదల వేమొ,
కంఠ మెత్తి కూ కూ యను - ల వయ్యో.

అరయ నీవు సుకంఠవు వగుదు గాక,
హాయి నెపుడు వనప్రియ వగుదు గాక!
సహజమధురంపు గానము సలుపకున్న
సాకుదువు బుంగు వని నిన్ను జనము లంద్రు!

జనమునకు గాకయున్న నీమనముకైన
సంతసము కల్గ గానము సలుప రాదె!
ఎపుడు నీమది పాటలో నిమిడిపోవు
నపుడె యొరులకు నానంద మబ్బగలదు.

# శ్రీ శివ శంకర శాస్త్రి

## సందర్శనము

నినుం గనినయంతనే నిఖిలలోక గంభీరతా
మనోజ్ఞమహితాభయే మదికి దోచు సీమంతినీ!
జనించు వెనువెంటనే చకితలోచనాంతోల్లస
ద్వినమ్రత ఘనమ్ముగా విమలభావసంశ్లిష్టమై!

చిరమ్ముగ మెలంగు నాస్మృతిపథమ్మునన్ సమ్మద
ప్రరోహమధురమ్ముగా భవద మోఘలావణ్యతా
పరిష్కృత శరీరమున్, పరమపాండుకౌశేయమున్,
కరేణువరయానమున్, కటకకంకణారావమున్!

ప్రభాతసరసీరుహ ప్రతిభట ప్రభావోల్లసత్
స్వభావరమణీయ మౌ వదనబింబ మిప్రొద్దునన్
శుభాంగి, యుదయింపగా సుదృఢమామకాంతర్వ్యథా
విభావరి రయమ్మునన్ వెడలె నేత్రమార్గమ్మునన్!

## వకుళమాలిక

ధవళకౌశేయమ్ము ధరియించినది యామె
కౌసుంభరాగాల కంచుకము తొడిగినది
పడుచుండ నొడలిపై పండువెన్నెలరుచుల్
దేవకన్యకవోలె తేజరిలసాగినది.

కర్ణపూరద్యుతుల్ గండయుగ్మమ్ము మీద
నాట్య మాడుచునుండ నవమోహనమ్ముగా
తపనీయహారముల్ స్తనమండలమ్ముపై
కమనీయలాస్యమ్ము గావించుచుండగా

పాటలద్యుతులతో ఫాలదేశమునందు
తిలకబిందువు సముద్దీపించుచుండగా
దుగ్ధాబ్ధిలోనుండి తోతెంచు ఇందిరా
దేవిపోలిక నామె తేజరిల్లగ సాగె.

అతివిశాలం బైన యాజాలకమునందు
ఆసీనయై యామె యారామవాటిపై
నిజవీక్షమ్ములన్ నిగిడించుచుండగా
బంగారుబొమ్మనై పరికింప సాగితివి.

నల్లకల్వలబోలు నయనాలు నాపైకి
తిప్పి యాయమ నన్ను తేరిచూచి యొకింత
చిరునవ్వు మోముపై చిందులాడుచునుండ
లాలింపసాగినది లలితగీతమ్ముతో.

వచ్చునే శారదా నా
వల్లభుం డిచటికే,
వచ్చి ప్రీతిని వేగమే, మాలికా,
గ్రుచ్చి కౌగిట జేర్చునే.

ఎంత చక్కనివాడో
హృదయాధినాథుండు
కాంచ గల్గినయంతనే, మాలికా,
కనులకరవే తీరునే.

చిరునవ్వు మలయు నా
జీవితేశుని మోము
పండువెన్నెల కాయునే, మాలికా,
నిండుపున్నమి బోలునే!

అమృతతుల్యము లైన
యతనివాక్కులు విన్న
ఆనంద ముప్పొంగునే, మాలికా,
అవశత్వమే కల్గునే.

నానాథు సన్నిధా
నమునందు నిలువంగ
అన్ని చింతలు వీడునే, మాలికా,
ఆనందమే నిండునే.

నాకోసమై యెంతో
నవయుచున్నా డతడు
ఆలసించుట కూడదే, మాలికా,
అంగీకరింపవలెనే.

ప్రాణేశ్వరునిగాఢ
పరిరంభణమ్ములో
విస్మరింపనె తనువునే, మాలికా,
విశ్వాన కలిసిపోనే!

అని లేచి వీక్షించి ఆరామవాటికన్
నానాథు డేతెంచినాడు పోదము రమ్ము
విభుడు నాకోసమై వేచియున్నా డదే
అనుచు నుపవనిలోం గరిగె సంభ్రమముతో.

ఎంత చక్కనినడక ఇందిరాసుందరిది!
ఆందోళనమ్ములో నడుగడుగునకు నామె-
పాలిండ్లపై నున్నపట్టురైకను దాకి
తేలిపోవుచునుంటి దేవతామార్గాన!

## కరస్పర్శ

తన్మయత్వాన అర్ధరాత్రమ్ము వరకు
నవవినోద కథా పఠనమ్మునందు
అలసి, కారాగృహమ్ములో నరుగుమీద
నేత్రములు మూత పడుచుండ నిద్రపోతి.

అట్టి గాఢసుషుప్తికి నంతరాయ
మొదవ నాకస్మికమ్ముగా నులికి పడితి:
అప్రయత్నముగా మదీయాక్షియుగళి
తెరవు పడ, పార్శ్వభూమిని దృష్టి వాలె.
పార్శ్వమున తద్వితర్దికాంచలమునుండి
కాశ్యపీ పఠనోన్ముఖ కాయ మల్ల
నల్లన మనోజ్ఞ శీతల హస్త మంటు
కారణమ్మన మెలకువ కలిగి యుండు.
లేచి కూర్చుండ కానరాలేదు నాకు
చేతనాకార మేదియు, శీతభాను
కరవితాన సముజ్జ్వల కక్ష్యయందు:
తాళబద్ధ మధురామయ ద్వారసీమ.
కాని భ్రంశోన్ముఖం బైనమేని కప్పడు
ఘాతము ఘటిల్ల నీయక కరుణతోడ

నాకు మెలకువ దెచ్చిన యాకరాబ్జ
మంజులాకృతి నిలిచె నామానసమున
కంకణ విభూషితం బైన కరసరోజ
మంగనా రత్న సంబంధి యగుట తోచె;
అవల రోజనలో తటిజ్జవముతోడ
పత్నికర మని జన్మించె ప్రత్యభిజ్ఞ!
అరిగె నా సాధ్వి స్థూలదేహమ్ము విడిచి
సప్తవర్షములకు మున్ను స్వర్గమునకు:
అవ్యయం బైన యాయమ దివ్య మూర్తి
నన్ను గాపాడుచున్న దీనాడు కూడ!

## లోపాముద్ర

ఏమి విపరీత మిది! ఎంతతడ వైనన్
కామ పయి క్రొత్త రొక మూర్తమును నాథా!
ఈ మెయిని మౌనము వహించి వెనుచింతన్
నామనమునం దిటులు నాట దగు నో కో?
స్వామి దయ రాదు! తమసన్నిధిని నే నీ
యామమును బుచ్చితి మహాతురతతోడన్
కామము వహించు నిజకాంత నెడ సేయక
నేమ మగునే కడునిష్ఠురము నాథా!
చేయుచును మీచరణసేవ, యొకనాడున్
హాయిక భవత్సవిధభాగము మదీయ
ప్రాయమును బుచ్చితిని- భార్య ననురక్తన్
న్యాయ మగునే యిటులు నాథ, నిరసింపన్!

సామమున భార్య నయినాను, గణియింపన్
కామితము దీరి బహుకాలము గతించెన్!
ఏ మనగ వచ్చు కలనేని నిజకాంతా
క్షేమసుఖముల్ తలపు సేయవు మహాత్మా!

భంగ మగు నిష్ఠ నిజపత్ని మృదుదేహా
లింగనము సేయుచెడ! లేశ మయినన్ స్త్రీ
యాంగనల నెందు హృదయంబులను భేదిం
పంగ ఘటియిల్ల దట పాపము మహాత్మా!

సేదు విషువం దగదె నిష్ఠురత నాపై
ఆడు దని చిన్న దనియైన కృపతోడన్?
వ్రీడ విడనాడి కడు శ్రీ దయి యెంతో
వేడుకొను కాంత గను విచ్చి కనరాదో!

యవ్వనము పూర్ణముగ జారుటకు మున్నే
యివ్విధిని మీరు త్యజియించి యిహసౌఖ్యా,
లెవ్వరియొ తపస్సు లని యెల్లపుడు నన్నున్
దవ్వులనె నిల్పితిరి: ధర్మమె మహాత్మా!

మీర లొనరించు నవి మేము గ్రహియింప
న్నేరుతుమె? మీ బుషులు నిశ్చల మనస్కుల్,
క్రూర మగుగాక తమ కోరికయె యెట్లో
తీరుచుకొనం గలుగు ధీరులు మునీంద్రా!

ఏలనో భవాదృశుల కీజగముపై న
ద్వేలము విరక్తి యని విశ్రుతము: మాకో
చాలదు గ్రహించుటకు శక్తి లవ మైనన్
వేలుపు జగమ్మనయి శ్రీ మునిచంద్రా!

ఒక్క విపరీత గుణ మున్నయది మీలో
నక్కజము గొల్పు! నిఖిలార్యులకు పుత్రుల్
పెక్కు రుదయించు నెడ ప్రీతి యధికం, బా
దిక్కునను లేదు తమ దృష్టి మునివరాళీ!
సంతసము, విప్పితిరి చక్షువులు నాథా!
స్వాంత మెటులో కరగుచాయ కనుపట్టెగా!
వింతగను నిల్పితిరి వీక్షణము పాదా
క్రాంత సతిపైన బహుకాలమున కౌహా!
మోదతే నిజవిభో ర్వదనాబ్జం
వీక్ష్య మందహాసితం కులకాంతా
ప్రాణనాథ పరిరంభణహర్షా
జ్జాయమాన పులకాంచిత దేహా!

## విస్మృత స్మృతి

క్లాంతిచే కను మూసినంతనె
కలలు కాంచుచు వివిధఘటనల
దేలియాడితి, చివర కెట్లో
తెలివి వచ్చినది.
కలలు జారగ భార మెడలిన
కన్నురెప్పలు మెల్లమెల్లన
తెరపువడుచుండంగ సుమ దీ
ధితులు చెలరేగన్.
అక్షణమ్మున ఘ్రాణతర్పణ
మయ్యె వివిధప్రసవపరిమళ

మందమందోర్మికలు నాపై
మలయుచుండంగా—
అర్ధమీలితనయనయుగ్మం
బపుడు పూర్ణోన్మక్త మగుటను
తోచినది స్త్రీమూర్తి దివ్య
ద్యుతుల నుపవనిలో.

స్వప్నలోకమునుండి యపుడే
జాగ్రదవనికి నవతరించిన
కారణమ్మున పరిత్యభిజ్ఞా
కలన లేదాయె.

నాకలోక విరాజమానము
నందనోద్యానాంతరమ్మున
పుష్యకన్యక యనెడిభావము
పొడమె తొలుదొలుతన్.

నీశుకశ్యామాంశుకచ్ఛవి
నిఖిలపత్రిలతాంతవితతిని
కలియగా వనదేవతాకృతి
కానబడెను ప్రియా!
బాలభానుపరిభావటలిని
పసిడిమిసమిసలన్ జెలింగెడి
లలితతావకమూర్తి నిష్కుట
లక్ష్మిగా దోచెన్.

చిరువగవు నీయోష్ఠసీమను
చిందులాడుచునుండ నవ్వేడ

పాడమినావు సుమీ గృహేందిర
పాలుపుతోడ ప్రియా!
సుప్రభాత మ్మనెడి మంజుల
శుభ వ్యాహారమ్ము చేరగ
వీనుదోయి సుహాస్య దేవత
విగ్రహమై తోచెన్.
ధవళ కాంతులతోడ ముక్తా
స్థగిత తాటంకములు యుష్మ
ల్లలితగండాభోగదర్పణ
లాస్య మొనరింపన్ —
తావకాకర్ణాంత నేత్ర
ద్వంద్వవాహిని శుభ్రగంగా
నీలయమునావీచికా ద్యుతి
నిలయమై యుండన్ —
మందహాసోదంచితానన
మండలోపరితలి నకాల
జ్యోత్స్నలోచనరోచనంబై
సొంపులొలుకంగా —
పలుకు వినబడె: "మి [illegible] వరించిన
ప్రథమయోషిద్రత్న మెవ?" రని
ఆంగ్లవాక్యాన: నమోవాక
మ్మాసరస్వతికి!

"౪౫"

(పంచ చత్వారింశత్-జన్మస్థానరోత్సవము నాడు)

జీవిత నగాగ్రభాగమ్ము జేరుకోర్కి
బయలు వెడలగ సోపానపాళి లేని
చిత్రమార్గము వెంట, వంచితుడనైతి
తొలుత నాకు రహస్యమ్ము తెలియకుంట!

ఎట్టులో కలరూపు గ్రహించువరకు
గడచె పదుమూడు మజిలీలు! నడచు గతులు
మరచిపోతిని, కాని నా మానసమున
వేదనారూప నీహార మేదొ నిలిచె.

ఈయహర్ముఖ శుభవేళనే మదీయ
కాంతలోచన యుగళికి సరళమార్గ
ముద్భుతావహమై తోచె నడుగులోన:
తెలిసినది క్రొత్తమలుపు నే తిరిగినట్టు!

నిమ్న దేశాలపై దృష్టి నిలుప, నిపుడు
సకలము సమానశాద్వలస్థలిగ తోచు;
ఊర్ధ్వముఖమైనయంతనే వ్యోమచషక
మరుణ కమనీయ కాంతి ప్రత్యక్షమగును!

ఏప్రదేశము కనుగొన్న నిపుడు నాకు
తోచుచున్నది మంజుల ద్యుతులతోడ,
వల్గునాదమ్ములే వినవచ్చుచున్న,
నవీనోత్సాహ మేదొ నన్నావరించె!

# శ్రీ బసవరాజు అప్పారావు

## విరహిణి

దీపకళికలు విన్నవై తెల్లవారె
పాన్పుపై నిడ్డపూవులు వాడిపోయె
పిట్టలన్నియు తమగూళ్ళు వీడిపరచు
స్వామి, నీదాసికడ కింక వచ్చుటేల?
కనులు మూతలు వడి నిద్ర గమ్ముచుండ
ఖడలికం జేసి అలకత నొడలు తూలు
పరవశత జూచి నాసిగ్గుతెరను జీల్చి
చోరువలె పట్టువడకుండ పారిపోవు
నప్పుడైనను దయ యుంచి యంతరంగ
మందు నాప్రేమ మన్నించి, మరచి పోక
తలపి, నీముద్దుమోమును జూపి వేగ
నామనోలోలతను బాపు నాథ, దేవ!

## ప్రోషిత

ఎవరు సంతోషింప నీయలంకారంబు?
ఎవరు కని మెచ్చుకొన నీసొమ్ము లెల్ల?
ప్రవిమలాత్మక దేవ, ప్రాణేశ, నీవు గాకెవరు....
నిదుర పట్టక రేల నీమనోహరరూప
మెద నిల్పి నాజీవితేశ్వరుడ వీవె యని
పదిలముగ నిన్ను నే బట్టుకొని కౌగిలిడి
మది పొంగి కను విప్పు మాయమై పోతి వింకెవరు...

బాలసూర్యుని కాంతి గేలిసేయగ జాలు
ఫాలమున తేజస్సు ప్రభవిల్లుచుండగా
లీల నొప్పెడు మూర్తి దాల్చి నాదగు మనో
లోలత్వముం బాప జాలి గాని గాదైతి వెవరు...

## తగనా?

దాసిగా నుంటకైన తగనా ప్రాణేశ దేవ!
పాదమ్ములు నొచ్చినంత పట్టుటకైనను దగనా?
తలపై నీపాదధూళి దాల్చుటకైనను దగనా?
వదనమ్మును గాంచి భక్తి బ్రణమిల్లుటకుం దగనా!
నిన్ను జూచి మదిని ప్రేమ నిల్పుటకైనను దగనా?
నానాథుడ వీవె యనుచు నమ్ముటకైనను దగనా?
ఒరు లెవ్వరు చూడకుండ నొకక్రొముద్దు గొన దగనా?
పరవశమున నీప్రేమము పాడుటకైనను దగనా?
దాసిగా నుంటకైన తగనా ప్రాణేశ, దేవ!

## దీపావళి

లోకాని కుత్తుత్త దీపావళి
నాకు మాత్రము దివ్య దీపావళి!
వేదాంతనాథుడౌ వేదాద్రి నరసింహ
దేవుడే నాయింట దీపమైనాడు...లోకాని...
వేదవృక్షములాగు వేదాద్రినీడ నా
వంశవృక్షమ్ము శాశ్వతముగా నిలవాలి...లోకాని...

## యమునా సాంత్వనము

(ఆంధ్ర రక్ష స్మృతి)

ఏలా పాడే నింక యమునా కల్యాణి, నే
లీలా మానవుడు గోపాలుడు లేడాయె! ఏలా.

బంగారుగనులలో చెంగలించే చే
పిడుగు బోలిన వార్త వినిపించినారయ్యో! ఏలా.

చెడువార్త వినగానె చెవులు గింగురుబోయె
ఎంత చించుకొన్న గొంతు పెగలదాయె! ఏలా.

వెన్నెలకు తోడు మా వేణుగోపాలుడు
కన్నులపండువుగ కనిపించకుండెనె ఏలా.

ఈనాటి యీ నేస్తమే జన్మలో తీరి
కన్నీళ్ళ కారవకె కడుపు చెరువయ్యెనె ఏలా.

## శ్రీ నండూరి సుబ్బారావు

## రవల వెలుగులు

రవల వెలుగులగంగ రమ్మందిరా యెంకి
శివమెత్తి తానాలు చేసిందిరా!
సిరులలో ముత్యాలసరుల చెల్లాటతో
సిరిసిరీ మువ్వాలా సిందులా గంతులా
రవల...

నీలలోన నీల కలిసి మొకము మొకము కలిసి
వెలుగుదేవతకు చక్కలిగింత లెట్టింది
రవల...

నీలలో మునిగింది వెలుగుతో తేలింది
మబ్బు వెందురు డల్లై మనసిలో మనసల్లై
రవల...

కానీ దేవునియెదట గనువాన నిలిచింది
తల తడుముకొని కాజె తబ్బిబ్బు లైనాను
రవల...

## సంద్రము

ఇంతే నటే సంద్ర మెంతో యనుకొంటి!
మనకు మరీదుకూ మద్దె నుందేనా?
నానీటి నాజాలి నావారి పోనాడ
మరిగి నామనను సాగర మాయె నన్నారు
ఇంతే...

నారాజె నాకానీ వేరునూపులు మూడ
కడలివలె నాగుండె కలతబడె నన్నారు
ఇంతే...

పత్తై మెరిగిన పాప పాత్రిశ్యలో దాగి
కన్నీరు మున్నీరు కరిగిస్తి నన్నారు
ఇంతే...

అంచుదరి లేదంటే అమృత ముంటాదంటే
దేముడుం టుంటాడో ఏమొ యంటున్నారు
ఇంతే...

## రాగతనం

కొమ్మలో కోకిలా కో యంటదే
రాగతనమో ఏమొ బాగు న్నా గెరుగదే!
ఎంకి దూరా నుండె ఏటిదరి న్నేనుంటి
పావాన మిం కెవరొ సంద డెవరో నంటి
కొమ్మలో...
పూ·లెరుగు నాకోత నీ వెరుగు నామోత
మనుగడం కెవరితో మనసు కలిపే దంటి
కొమ్మలో...
ఏటికడుపున దాగి తోట నిద రోయింది
అంనా నాసొదకు, పాలనా యనుకొంటి
కొమ్మలో...
తరిమి తరి మేళాను తిరిగి కో కో యంది
ఆడించె ఆటగా పాడించె పాటగా
కొమ్మలో...

## వుత్త మాటలు

వుత్తమాటలు నీవి పొ మ్మందిరా, యెంకి
కొత్తపాటలులు పాడు కొ మ్మందిరా!

పూరెల్లు నని కల్కి మారేన వేసుకొని
పసిపాలపాటొమ్ము నకిన మదు గన్నాను
వుత్తమాటలు...
యీరోజు నీరాజు పూరెల్లినా డంటి,
యేరాపులో రూప్ప మారి పోయిం దంటి
వుత్తమాటలు...
మొదల మీరీ రేయేటి మొగనై వలికా రంటి
మెరుపల్లె పాటెత్తి మారిపించి నా డంటి
వుత్తమాటలు...
కొద్దిలో వారపాల కొడుకు నెత్తే వంటి
యీనిజము తేలేక యీ నాము లిమ్మంటి
వుత్తమాటలు...

## శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

## విపర్యాసము

పూవుంజిమ్ములు తేనెవాకలు రసంప్రంబుల్గ లానందమో
హావేశమ్ములు నీవు పెట్టినగిషే రన్నా, భవద్గాన.వీ
ణా వైశద్యము సన్నగించి, గళితానందాశ్రు రేఖావ్యథా
ఖారమ్ముల్ వెలిబుచ్చు నేమిటికి నీపాటల్ వసుంషట్పదా!
తలిరు పెంత్రి చిరుందల తలత్తలలాడు
మావి క్రొంబూత నెత్తావి వలన
మధుమాసవేళా క్రమప్రాప్త యావన
మల్లెతీవియ తావిపెల్లుబలన

చిరుతకాలువల వాసించు గున్న పొదల గు
మాళించు గేదంగి జాలువలన
నవ వసంతోత్సవాంతశ్ఛటా పుష్పిత
మందారవాసనా మధువు వలన

ప్రకటితంబులు నీదు గీతికలు మున్ను
మరచి పోలేము నీగానమాధురీ వి
శేషపొందితి భ్రమర, మాచేత నింక
బాష్పము స్రవించుచునో మధువ్రత కుమార!

స్ఫుటమధుగంధలుబ్ధములు నూ మును నీచరణంబు లిట్టి ప
ర్యటనము శోకగీతి కనుయాయి ప్రగాఢితం బధామ్య శిం
చుట గని శ్లైలంకుల కిశోరమధువ్రత, బాష్పవాహిక
స్ఫుట నటనావిశేషములు చూపెదు, కారణ మేమి తెల్పుమా!

నగనిగలాడు రెక్కలు కనీనికల స్ఫురియించు మున్ను క్రొం
బాగవతి ధూళి గ్రమ్మి తొలి ముగ్ధశిఖండి శిఖండ కాంతికిన్
వగ టయిపోయె నీచరణ విద్ధము లైన లతావితానముల్,
మొగములు చిన్నవుచ్చుకొనె మోహనముగ్ధకుమార షట్పదా!

నెలవంక విదియ చందురుని తేపగను వె
చ్చని వెన్నెల కలంగె సన్నజాజి
జలదరించినది తేనవిపూవులదుమార
మొలని రేకొత్తు క్రొంగ్రొత్త మల్లె
తెలిరేకు తెల్లరొత్తిలి సన్నగాలి రొ
చిన కోలందిగ జెమర్చినది తమ్మి
తల చూసి విరియు చెంతల రేకులోని
మంచుకొన్నయది ముద్దుబంగులాబి!

తగులఁ బొరుగని చిన్నిసంపెగయు వాడి
వత్తినది పుష్పసామ్రాజ్య పట్టభద్ర!
వారివారి యి దేమి నీ విటు లైనయెడల
పూలసామ్రాజ్యమునకుఁ బ్రభుం డెవండు!

కోటంకేశ్వర, నీది నిర్జరవరూరూపంబు, శృంగార
సృష్టి లీలారస పట్టభద్రుఁడవు నన్ మేల్ యిటుల్ వంతచే
బ్రాఁతంగా గత మేమి? లో మరచితో స్వాతంత్ర్యకల్యాణగా
నాళోలా మృతగీతి కౌతుక సమామ్నాయంబు బ్రాయింపనన్!

## గిరి కుమారుని
## ప్రేమ గీతాలు

కడు పవిత్రమ యైన యీ కార్తికంపు
నవదిసాంతపు వేళ కైతవపుళింద
పూజలకు పూలబుట్ట చేబూని పోవు
దివిగో! యిది కూడ కలుపుకోనే లతాంగి!

కనుల కాటుక దిద్దితి విని మృగాక్షి!
జారుముడి వేసితివిని వచ్చు నగు పట్టు
కోక తాల్చితి రుద్రాభిషేకమునకు
పోయెదవ యేమి చెప్ప మా పూవుబోణి!

నేడు సోమవారము చంద్రనిటలభాగ!
ఇదిగో మాయమ్మ ముడిబట్టు పొందవేయు,
నేను వచ్చెద గుడిలోని నిలువు మంత
అర్ధనారీశ్వరునికయి యర్చ లొసగ.

గడుసు దానవె నవ్వెదుగాని చెప్ప
వొక్క మాటకు నీవు ప్రత్యుత్తరమ్ము
బళిర! సత్యనారాయణ వ్రతము నాడు
పిల్ల, న వ్వేటి కది చెప్పు పీటలపయి?
ఏదో కల వచ్చె నని చెప్పి యింతవరకు
ఎంత ప్రార్థించినను చెప్ప వెంతదాన!
వింతకోపమ్ము వచ్చెనయేని నాకు
తటుకు చిరునవ్వు సందుల దాగుకొందుఁ.

తెలివి యున్న నిట్టు లుండగా వలయు, చెప్ప
వద్దటే కలమాట ఎవ్వరికి నడుగ
కొంటె నవ్వులు కురియించి కేలికొనుచు
పెనగొనుచున్న జడ యేల విప్పె దిట్లు?

## అనార్కలి లో

### వసంతుడు

ఇది యుషస్సతీహాసము నదిమి కొన్న పరాగ
మిది సంజ లేగటాబోదుగు శోభారాశి
యిది పూపకన్నెలో పొదలు లేగెంవాళ
యిది రసాంభోరాశి పదును గొన్నకణంబు.

### పుష్ప కన్యకలు

ఇతడు మావిచిగుళ్ళ నొగచి కోసినవాడు
ఇతడె యందవు కోన లెల్ల ప్రముచ్చిలు రాతు
సెంరయేళ్ళ యిసుక తిన్నెల నేలురా జితడె
ఇతడె ప్రాతఃకాల సతిమేను విలసోచి.

మాధవి

చేరి రారే ప్రదక్షిణముగా స్వామికి
మీరు కేళ్కొల్వౌని ముఱికన్నియలార!
ఇన్నాళ్ళకు వచ్చె నీ దయావసరాళి
కన్నుల కత్తురై త్రాగిపోరి గదమ్మ!

మాగధి

శ్రీవసంతాలమ్మ! శ్రీవసంతాలు!
మానసాంతములందు మధువసంతాలు!
తల్లి క్రొంబొదుగువద్దకు బోవు పసిలేడి
మెల్లగా చెందు స్వామికి నాదుకొనుటకు.

కేశాలిక

కస్తూరి కొనిరండు కైవసం బయినాడు
కస్తూ పూయుదమ యీ చిత్రేశు డీనాడు.

అందరు

చిలుపవానలకు పరువులు వెట్టిన సెలల యిసుకపొరలో
మొంగలితావి వసబుగులు కొన్న పుప్పొడుల మేలి తెరలో
కలకి యాడుదము పాటలు పాడుదు మలగిపోవుదము వనిలో
జలుగుతూ తెసగువచ్చని బయలుల గలసిపోద మామనిలో.

పుష్పకన్యకలు

బాల మృణాలీ లీలకరా, మ
త్తాలి మనోహర నీలకచా, స
హ్లాదవనీ ఫుల కే కృత దేహా!

[నృత్యము]

## కవి

శ్రీఖండాంబుల గంధ సంకలితమై శేఫాలికామాలతీ
రేఖామంజుల వాసనాళిహారి పర్యన్ ప్రాతరానీత శో
భా ఖద్యోత విలాసరాగ లలిత శాంకుప్రథల్ చూత స
శాఖాఖా పల్లవరాజి కెంపెయును పరిష్వంగంబులై పొల్పెడిన్.
హేమంతయానిలంబులు వహించిన శైత్యము లెంత ధూర్తముల్
లేమలతాప మెల్ల బదిగింపుదొ సెకొ వసుగోస మూస మం
దా మలయానవైఖరుల కబ్బిన సాంధవిలాసినీ మనః
శ్రామణ కాపదంబు లుడుకున్ నడివేసగి పల్లవంబులై.
ఊరక సాహృదంతరము నూదెను గోరిక లేక రక్తపున్
నీరజ వక్రకాంతులకు నెయ్యములై తగు ఫాల్గుణాంత వే
శాగు చిరంబులై యుదయలాలిత నవ్యవనీ వసంత శో
భా రమణీయ మైన నవపల్లవ రక్తిమ మెంత క్రమమో!

## ఆసుర లక్ష్మీ సాంత్వనము

సాచేతన్ త్రిజగమ్ములు న్నిలుదు నానా జంగమ స్థావర
ప్రాచుర్యంబున కేన మూలము. జగత్ప్రారంభ సంరంభ వి
ద్యాచార్యుండను నేన, సర్వజగదాహ్లాదంబు నాహాస, మే
లా చిన్నుందన మొందు త్రైభువన లీలా శైత్యనీలాలకా!
ముల్లోకంబులు చంద్రహాసశిఖరంబుం దాకి నొక్కుల్ వడెన్,
చెల్లెన్ బో దశకంఠ పౌరుషము దీక్షా మంతనీభోగ్యమై!
కల్లల్ పలెక్కుము మొక్కు పోనిది సాఖడ్గంబు, ధూర్త ద్విష
ద్వల్లీ దుర్గమ మార్గ భీకర విచిత్ర ప్రాసమై, విత్తరీ!

కమరెఁ దానవలోక శాత్రవవధూగండంబు లుత్ఫుల్లముల్
నముచిద్వేషి మహోధంయక్షర మదాజ్ఞాబద్ధమై నాల్గు సం
ద్రములం గూడి ఘనీభవించి ద్రుతవల్గన్మ్రదధధ్వాన సం
భ్రమ దాశాకరిణీశ్రవఃకుహర సంబాధంబు గావించెడిన్.

బాలేందీవరకోరకచ్ఛవికి నింపౌ, మాకరందాపగా
వేలోపాంత చరన్మధువ్రత కులప్రేమమ్ము సాధించుటా!
బాలుం జాలు! ని దేమి టీపరితతాంచన్నాగవల్లీ ప్రభా
లీలాసుందరగల్ల మిట్లగు ట దేతే బాలికారత్నమా!

దైతేయకామినీ ధమ్మిల్ల సుమ పరా
గము గాలిచే కనుగందరాదు,
దైత్యశుద్ధాంత కాంతా కపోల పటీర
చర్చ వెన్నెలల చెమర్చరాదు,
దానవానేక ముగ్ధాలోచనాంబుజ
శ్రీలు క్రొందేటు లానించరాదు,
దివిజాంతకావరోధ వధూవిహార భూ
ములు పచ్చవిల్కాఁడు తొంగరాదు

ఇది త్రిలోకైక వీర లంకేశ పంక్తి
కంధర మహోగ్ర శాసన క్రమము, ప్రకృతి
దీనికై యధికారిణి, దివిజు లింక
నడుగడుగు వెంట కత్తిపై నడువవలయు!

## శశిదూతము నుండి

వెన్నెలపేరి దారముల వెండిపోరంగుపటంబు నల్లి మ
ధ్యన్నెరిగూడు కట్టుకొని యాపెనుదారవు చిక్కులందు నీ
పున్నమదీప్తిచే నిరులపుర్వుల పట్టి పలార్చుచున్న నీ
యున్నవవెన్నెలల్ దలువకై మరి మాకు ప్రసన్న మయ్యెడున్.

కోనల పైడితీగ చెరకుం గమి పంటపొలాల మీద వె
న్నినయట్టు లాకసము పెల్లలు నేలను మూలమూల లం
దాఁకి తెచ్చి, కఱ్ఱకొన శాకం పల్లపుచేం పంట చం
దాన తెలుంగు నీవెలుగు దారలు మాకు ప్రసన్న మయ్యెడున్.

కపురపువల్కులట్లు, కలకండ పొడింబలె, సన్న సన్న గా
లి పొరల సందుసందుల చలించి, పెసన్ మణిముక్క త్రుంచిన
ట్లు పొదలి, పైటికిఁ మెరసి లోపల లోపల చల్లచల్లనై
కృప కల నీదు లేవెలుగురేకలు మాకు ప్రసన్న మయ్యెడున్.

కలువలనిగ్గులో నొగరుగందము ఘ్రాయము నిగ్గు దోచి చ
క్కిలి గిలిగింతలోన కిలికించితమిల్ స్ఫురించి శీత చె
క్కిలి పులకింపు లోన తులకింపుల మంపులు తీర్చుకొన్న వె
న్నెలల చెలంగు నీతరపినీటులు మాకు ప్రసన్న మయ్యెడున్.

ఒలసిన పిల్ల తెమ్మెరల కూగిన లేల చివుళ్ళ తోరణం
బులు సవరించి నట్టి పొలుపో, జగదామయి యొక్కసారి పో
దులుపగ నోషధీలతలతో చనుదెంచిలో యున్న నీదు వె
న్నెలలు, వెలందులున్ చలువనిక్కలు, మాకు ప్రసన్న మయ్యెడున్.

కరకరి క్రొత్త త్రవ్వి కరకట్టగ బోసిన నింగిలోని చం
దిరు దను తూమునన్ మెఱుపు తీగల చెప్పునసుండి, దంపతి
స్ఫురదురు చేత కున్ పొలము బోదెల తెంబడి పొంగు లెత్తుచున్
విరిసిన జాలు వెన్నెలల విచ్చలు మాకు ప్రసన్న మయ్యెడున్.

అనుపున మంచుచే బులకలై యిరు లన్ కొలిపేరచేను పూ
చిన దన, క్రొత్త పిల్ల తొగ చిన్నది వాలిక సిగ్గు లొల్క జూ
చిన దన, రేజగాజిగులు చిందిన సోయగ మట్టు నిట్టు మో
చిన తన నొప్పు నీవెలుగు వెన్నలు మాకు ప్రసన్న మయ్యెడున్.

# నీల పాటలు

## (త్రిశూలము నుండి)

శివజటాజూటిలో చిందు బుడగల గంగ,
శిశిరతా మూర్తియై చెమ్మగిల్లినది
తరిమంచు కొండకూతురు మేను తాకగా
చలువ పులకల శివుడు జలదరించాడు... శివజటా...
చిన్నారి జాబిల్లి చిలుకు తేనెలవాక
శివు నొసలి కనుమంట చెమ్మ యారికినది
వెండిమల రాపీట నిడువాగుల చలువ
దండి చలువదనాలు గుండరించినవి... శివజటా...

*

అమ్మ కనుగోసలో చెమ్మగిలి చిరుగాలి
కుమ్మ బసవని మీద కోపగించినది... శివజటా...
అమ్మ తెలి పలువరుస చిమ్మ చందురు వెలుగు
కుమ్మ బసవని మీద కోపగించినది... శివజటా...
అమ్మపయ్యెద చెంగు సమ్మగా ముడుతలై
క్రమ్మ బసవనిమీద కోపగించినది... శివజటా...
బరువుచే నెగురని పైట జూచిన యమ్మ
గాలి బసవని మీద కారు పూనినది... శివజటా...

*      *

అమ్మరతనపుపైట హాస మొలుకగ జూచి
చిన్ని బసవనచేత చిత్తగించినది.
రతనాల తళతళల మతి సంతసిల్లి తల్లి
మించు బసవనిచేత మెచ్చుకొన్నాది... శివజటా

భారతగ్రంథమందు బర్వతప్రియుండు
చదువుకొన్నావు శబ్దశాసనుని యింట
బలికి వినిపించి మన్నన వడయు మమ్మ!

నళినీగంధము దోగువీచికల స్నానంబాడు సంధ్యానుర
క్తులు క్రీడించెదు నీవిశాలపులినస్తోమంబునన్ బత్రిమున్
గలముం బూని చరించువాంధ్రకవిలోకగ్రామణిన్ దమ్మిపూ
వుల నెన్నాళ్ళ పూజలు చేసికొనినావో పుణ్యగోదావరీ!

కదిరెం డేడుల చిన్నదాన వయి, యంభశ్శ్రీప్రయాణంబుతో
నుదధిం గూడగ బోవునీహొయలు నీరొయ్యారమున్ శీవియుగ
గుదుకుంకో జూచి, సమస్తతైర్థికులకో గోదావరీ దేవి! స
మ్మదముం గూర్చెదు పుష్కరంబులకు బ్రహ్మాండంబు గొండాడెడిన్.

పుట్టి గతించిపోయెదునృపుల్ ధరణీవిభవంబు గోరి, నీ
గట్టున నుగ్రసంగరముఖంబున నెందరు గ్రుంకినారొ! నీ
పొట్టకు పారి యస్థికలు భోజనమయ్యెగదమ్మ! చావులే
నట్టి సుధాశరీరమహిమాన్వితి! వందన మమ్మ! గౌతమీ!

## శబ్దశాసనుడు

మాసిపోయిన శిలాశాసనంబుమీద
దరువోజ వోలి ప్రత్యక్షమగుదు
ద్రవిడభూపతుల బాంధవ్యంబు కతమున
ధ్వని సన్నగిలి నంగిబాన వగుచు
రాటాలకడ గూనరాగాలు పచరించు
వండుటవ్వాలనోట బయలువడుదు

ఇంటింటికడ బిచ్చ మెత్తు జంగముల గు
మ్మెట పాటలో మిట్టిమిట్టి పడుచు
పొలుపు దరిగిన నిన్ను నభ్యుద్ధరింప
రాజరాజులసభ గవ్వరంబుతోడ
నందుకొన్నాడు తాంబూల మాంధ్రవాణి
శబ్దశాసన కవిలోకచక్రవర్తి!

శబ్దసాధుత్వంబు సాధింప భ్రష్టవా
ఙ్మయమహాటవి నెంత నరసినాడొ!
ప్రబల దుర్వార కథాపథకంబు గుదిరింప
దలవాయి నెన్నాళ్ళు తలచినాడొ!
గౌతమీగంగ యంగసు నంటి దీవించి
పసుప, నేరేవున మునిగినాడొ!
పసుపు రాచిన తాళపత్రంబు చే బూని
శ్రీకార మేనాడు చెక్కినాడొ!
తెలుగునుడికారమున నవృతీకరించి
భారతామ్నాయమునకు జీవముల నూది
తేజ మిడిగిన స్వీయజాతిసంరక్త
నాళములు వుల్కరింప గానంబు చేసె.

వేగిరాజుల నతీవితతికి గరువంపు
నడక నేర్పినది నన్నయ్యారచన
తెనుగుభాషా వదమ్మునకు జారవిరన్నె
బట్టించినది కవిబ్రహ్మవలుకు
కందుధక్కుల నోరు గట్టించి జయకేత
నముల నెత్తినది శ్రీసాధుజిహ్వ
[illegible]

దారి దీపిస్తది పోతనచరిత్ర
విజయనగరాధిపుల భుజాపేటికలకు
నాదలంబులు మోయుమర్యాద గరపి
తనివిగొన్నది యొన్న పెద్దనకవిత్వ
హాంధ్రభారతీ! నీతేజ మద్భుతంబు!

## తాజ్ మహల్

మరణించిన ప్రియసఖీప్రణయమూర్తి తలపోత మైనగుండె నే
యెద నిప్పు దగ్ధపర్వతము లెన్ని పెరిగిన బ్రద్దలయ్యెనో
కద! మొగలాయిరాజు తెలిగన్నుల రాల్చిన బాష్పధారలే
పొదలి, ఘనీభవించినవి, మద్దుల తాజమహాలుపోలికన్.

అది కదా దేశదేశాల యంజలిపు
లందుకొన్నట్టి శిల్పకళాపణంబు
భారతీయుల గర్వసర్వస్వమనను
మూలకంగము మొగలుబిబ్బీల సొగసు

ఒక్కొక్క రాతిలో నిమిడియున్నవి నేటికి షాజహాను భూ
భుక్కు వెడందతో నుడికిపోయిన నాడులలోని రక్తపుం
జుక్కలు, ముప్పదేండ్లటు ప్రసుక్కనో తాజమహాలు బల్లమై
ప్రక్క వసింపగా జెయిలువాలయి, పుత్రుని క్రూరచర్యలన్.

అమవసనిశీథినీ సమానమ్ముల గాలి
పాదుషా పాడినాడు దుర్భరవియోగ
భాసగీతంబులం గద్గద్గద రదన
జేరి యమున తాజమహాలు విధిసింధు గోడ,

నంద రందఱు మహనీయు లని తలంచి
యొకనమస్కార మొనరించి యూరకుంటి.

నన్నయతిక్కనాదికవినాథుల పంచమవేద మంతలో
చిన్నతనమ్ము దోప నగుపించి, ''మహాత్ముల విస్మరింతురే?
పిన్నలు, మంచి'' దందు నుడివన్, గల వాల్మికి నంత ''వారిదే
మున్నది మన్నన జూడు'' మనుచుండిరి భోజసభాకవిప్రభుల్.

పదలాలిత్య మెసగ నండి వచియింపం జొచ్చె ''సద్గ్రంథసం
పద కావ్యేందిర కంగపుష్టి గలిగె ప్రాణాలు'' నందుర్, సభా
సదులందుండి వచించె భారవి, స్వవాక్యన్యస్తకాదంబరీ
పద మేపారగ ''భుక్తశేష'' మని సంభాషించె బాణాఖ్యుడున్.

ఉపమానంబుల నిగ్గు దోప, బహుకావ్యోత్పత్తి గావించి, వా
ర్ధిపరీతాఖిలధారుణీతలమునన్ శ్రీ నందుకొన్నట్టి నే
రుపరిన్ గాంచితి కాళిదాసకవివర్యున్ జెంత నక్రూళికా
చపలాక్షిన్, జపలాసమంచిత వక్షఃసౌందర్యలీలావతిన్.

అలకాపట్టణమార్గమధ్యమున మేఘాకారతం జొచ్చి, నీ
పలు కస్మన్మదభంజనంబు నొనరింపన్ సాగె, జగ్గాగ్రదన్
విలసత్కావ్యకళావిశారద! కృపాభిక్షార్థి'' నం చొక్కదం
జలి యొగ్గెన్ జని, కాళిదాసకవి కీషత్కంఠగాద్గద్యతన్.

''పరిపూర్ణప్రతిభావిభాసి యగు విద్వాంసుం డసూయామతిన్
బరికింపండు పరాయికబ్బములు దిఙ్నాగాభిధానా! హరి
ద్విరదదంతప్రతిమానవందితమహేంద్రా! నీక్షమాదృష్టి సం
స్మరణీయం'' బని ప్రొక్కె, భూమిపతి మెచ్చన్ కాళిదాసాఖ్యుడున్.

అపలుకు లదటి గర్వ
దోషము దగులుపులమది గుదించె, నసూయా

శాపములు దీర శౌరి
భూవరుల మొగాన నమరె మునిమునివగపుల్.

# శ్రీ అడివి బాపి రాజు

## వరద గోదావరి

ఉప్పొంగి పోయింది గోదావరి తాను
తెప్పున్న ఎగిసింది గోదావరి.
కొండల్లు ఉరికింది కోనల్లు నిండింది,
ఆకాశగంగతో హస్తాలు కలిపింది— ॥ఉప్పొంగి॥
అడివిచెట్లన్నిటిని జడలలో ముడిచింది
ఊర్పు దండల గుచ్చి మెళ్ళోన తాల్చింది— ॥ఉప్పొంగి॥
నదులలో గర్వాన నడలలో సుడులలో
వరవళ్ళు తొక్కుతూ ప్రవహిస్తు వచ్చింది ॥ఉప్పొంగి॥
శంఖాలు పూరించి, కిన్నెరలు మీటించి,
శంకరాభరణ రాగాలాపకంఠయై ॥ఉప్పొంగి॥
నరమానవుని పనులు నీరమొగ్గి వణికాయి,
శరమెత్తి దీవించి కడలికే నడిచింది ॥ఉప్పొంగి॥

## సంగమేశ్వరుడు

పలికిస్తి నయ్యా, నీబంగారు వీణా
మీటిస్తివా వెలుగు మేళవించినతంత్రి!
పండువరువపువనన పరమపరిమళమూర్తి
అలికాచ్ఛరదిన శిల్పవరిసాధితరూపు ॥పలికిస్తి॥

# లేపాక్షి బసవయ్య

లేపాక్షి బసవయ్యా, లేచి రావయ్యా!
కైలాసశిఖరిలా కదలి రావయ్యా!
హుంకరించిన దెసలు ఊగి పోయేను,
ఖురముతో దువ్వితే కులగిరులె వణికేను ॥లేపాక్షి॥

ఆకాశగంగకై ఆర్తిత్తి మూస్తేను
పొంగేటి పాల్కడలి గంగడోలాడేను ॥లేపాక్షి॥

నందిపర్వతజాత నవపినాకిని జలము
నీస్నానసంపూర్ణ నిలువునా పుంకించె ॥లేపాక్షి॥

వంగోలుభూమిలో పెంగొండసీమలో
నీవంశ మీనాడు నిలిచింది గర్వాన ॥లేపాక్షి॥

## పట్టిసము
(పుణ్యతీర్థము)

గోదారిమధ్యనే కొండొకటి వెలిసింది
కొండపై జంగమయ కొలువు వేంచేశాడు.

గోదారిగంగలో కూడె తీర్థాలన్ని
కొండపై జంగమయ కోటిఅభిషేకాలు.

గోదారివరదలో కోటిపూవులు పత్రి
కొండపై జంగమయ వెండిపూవులపూజ.
గోదారికెరటాలు కొండతో గుసగుసలు
కొండపై జంగమయ కునుకు బంగరుడోల.

## తెర

ధవళ మైనదీ తలపు దాటినది
దానికి మొదలూ చివరా లేనిది
నీకు ఇవతల నాకు అవతలా
తెర ఉన్నాది బాలా, తెర ఉన్నాదే!

తెరమీద రాసిన నీడను చూస్తిని
తెరచాటున నీపాటను వింటిని
తెర చొచ్చిన నీకాంతి జోగితిని
తెర లే మన్నా తెలియలేక నే
కరిగిపోతిని,
తెర ఉన్నాది బాలా, తెర ఉన్నాదే!

కన్నుల కానని రూపం పిలిచీ
కౌగిలి కందని భావం తలచీ
తెరవైపున నా చేతులు చాచీ
అగమూతలు నా తీరని కలలే
చీల్చిన చిరుగని తెరఇవతల, నే
చేరగ రానీ నీ అవతలనే!
తెర ఉన్నాది బాలా, తెర ఉన్నాదే!

## లోకం

చంద్రలోకం తూర్పుదెసలో
సూర్యలోకం పశ్చిమంలో
చిన్నలోకం ఒకటే ఉన్నాదే — ఓహా

వెన్నెలా చిన్నారిపడుచా!
ఆలోక మోలే కన్నె రాణివీ నువ్వే నువ్వేనే!

నీడ తెరగని నిండుపున్నమి
వాడిపోని పూలతోటలు
వాడవాడల మధురగానాలే — ఓనా
వెన్నెలా చిన్నారిపడుచా,
నన్ను చేసే వన్నెలాడివి నువ్వే నువ్వేనే!

నింగినీలిమ కళ్ళ కాంతీ
పొంగుసురనది దేహకాంతీ
తొంగలించే అందాలనవ్వుల్లే — ఓనా
వెన్నెలా చిన్నారిపడుచా,
నా ప్రాణమూర్తివి, సొన్నసామివి నువ్వే నువ్వేనే!

కనులలోనే కలల నొదిగి
గళములోనే తేనె చిలికి
కాలమే నాకళతో కూర్చునే — ఓనా
వెన్నెలా చిన్నారిపడుచా,
నా ఆత్మసంధ్యవు, మిన్ను దేవివి నువ్వే నువ్వేనే!

## మరపు

మరచిపోవబోకె బాల మరచిపోవకే!
అరచి అరచి పిలవలేను
తరచి తరచి కోరలేను
మరచిపోవు కాంతలోన చిలిపిలోన, మరచిపోవకే!

పొలారు మనేక్కరటాకే
మారుమోగ నాపాటలు
జారిగిపడే రేఖలోని నుగగులోని, మరచిపోవకే!

ఒకక్షణ్ణో యిసుకబడ్డు
ఒకక్షణ్ణో నీరు దెసలు
ఒదిగిపోవు దూరాలూ
చెదిరిపోవు మేఘాలూ, మరచిపోవకే!

అదుముకొన్న నీకలపులు
చిదిమి రాల్చు నాహృదయము
ఏర లేను రేకలన్ని
ఏర లేను పుప్పొడినీ, మరచిపోవకే!

## శ్రీ దువ్వూరి రామి రెడ్డి

### కవి

వేగుజామున వికసించు విరులయందు
రేకులెడలించు సంజపూ రెమ్మలందు
కావ్యమునబోలె చదివియుందు కౌతుకమున
ప్రకృతి సామ్రాజ్యపాలన పద్ధతులను.

చటులకల్లోలరసనల సాగరంబు
పవలురేయి యాలాపించు పాటలందు
అనితర గ్రాహ్య ధర్మంబులై చెలంగు
విశ్వసృష్టి ప్రకారముల్ వినుచునుందు.

శ్యామలాకాశ ఫలకమునందు తరళ
కాంతి వెదజల్లు తారకోత్కరము లోన
విశ్వవైశాల్య బోధక విద్య నేర్చు
శర్వరీగర్భకాంతి యొజ్జగ విధింప.
గజురుతుంపర ముత్యాల కౌక్కిలించు
తరలు సెలయేటిపాటలో దాగియున్న
రాగతత్త్వంబు నామని రాత్రులందు
కూయుకోయిలకడ నేర్చికొందు వనుల.

స్వీయచరిత రహస్యంబు వ్రాయబడిన
హృదయపుస్తక పుటములు నుదయుతోడ
ప్రకృతి నామ్రోల విప్ప ప్రభాతరాగ
రంజితంబైన పూర్వతీరంబు నందు.

# ప్ర ణ యా హ్వా న ము

చెలియా, వెన్నెలబైల మంచుతడి బూచి పూవకున్నట్టి పు
వ్వుల నెత్తావులు మోసిమోసి నిడియూర్పు లొల్కు నుద్యానకో
మల మందానిలపోతముల్ మనల సమ్మానింప వాతాయనం
బుల డాయుం జని ముద్దుగౌగిలి సుఖంబుం గూర్చి సేవించెదన్

చదలు పందిట వెన్నెల జాలితీవ
చుక్కలను పూలు పూచి రోసుందరాంగి,
ప్రణయమోహన మైన యీ ప్రకృతి నెల్ల
సురభిళోచ్ఛ్వాస వీచుల సొగయు నోచు.
పరిసరోద్యానమున చూతవాటియందు
కలరవంబులు సల్పి పికద్వయంబు

నిస్తరంగసరస్సటు నెగడు రాత్రి
గర్భ నిశ్శబ్దతకును భంగంబు గొల్పు.

చంద్రికాముగ్ధ శర్వరీచ్ఛాయలందు
జీవలోకంబు సుషుప్తి జెందుచుండ
కవిమనంబును బ్రకృతియు కలయుచుండ
పోదమా కాంత, సెలయేటి పొదల దరికి!

పులుగులు గూళులం జెదరిపోయిన రెక్కల నొత్తి కొంచు గొం
తులను పరస్పరంబు బిగితో జెనగై చెదిరేళ, నప్పుడుం
దెలుపని హృద్రహస్యముల తిన్నగ వీనులవిందు సేయనా
చెలి, సెలయేటి సైకతము చేరుదమా, మనకేళియూతలన్!

జిలిబిలి కమ్మగానముల జేసెడి యా సెలయేటి యొడ్డునన్
పులకల విస్తరిల్లి నను బోడిమి జూచెదు నీదు బుగ్గలన్
దొలకెడి సిగ్గు డాలు కడదోపని ముద్దుల గ్రుమ్మరించి యి
వ్వల మధురోక్తులం గడిగి వైచెద కోమలి, రమ్ము మెల్లగన్

## ఆగంతుకి

చాలు లజ్జామధుర వినయము !
ఏల యవగుంఠనము వైచెదు
పూలదండలు గట్టియున్ పెండ
గీలు కొల్పక కేల జదిపెదు
శోభినీ, అప్సరః కామినీ!

సందెవేళల బూవురేకులు
క్రింది పరలగ గాంచి గాంచి ప

రందబిందులు కన్నుదమ్ముల
జింద బోగితెదు ప్రకృతి చేష్టకు
కామినీ, సుందర గామినీ!

పలుకరించిన బలుక కేమో
పులుకు బులుకున జూచి చూపుల
పలుకరించెదు లలిత హృదయా
వికఠోర వ్యసనభారము
ఏలనే మౌనం బేలనే!

ఎపుడు మౌనవ్రతభృతుణ్వా
నపుదినంబులు వచ్చు కోమలి,
యెపుడు విరియునో మూరి సందే
శపు నవీన రహస్యభావము!
పోలునే, చింతన చాలునే!

తేలివచ్చెడి కలవిధంబున
గాలియడుగుల సంగడించక
దేల వచ్చితి వీ వసంత వి
నీల గగన చ్ఛాయ నొంటిగ
బలుకవే, భావము దెలుపవే!

చీకటులు బల మయ్యె, చుక్కల
రాకపోకల నేల తలచెదు?
నా కుటీరము నందు వెన్నెల
సోకి తమము నశింప దీపము
పెట్టవే, నామది ముట్టవే.

## రజని

నిర్మలనీలఘనమున చుక్కలు
నిండె సజీవ వికాసములన్
మర్మవిపంచిక నీరవరజనీ
మానిని మీటెను మూర్ఛనలన్.
ప్రాంతకుటీర లతాద్రుమసౌధము
లస్ఫుట తారాకాంతిన్
వింతగ కరగడివోయిన ఛాయా
క్రాంతములై కనుపట్టెన్
నిశ్చలశాంతిని నిఖిల జగతి సుఖ
నిశ్వాసము వెదలించున్
నిశ్చల నిబిడ గభీరానందము
నిండి పొరలె లోకమునన్.
దైనిక కలకల మూర్ఛితభావము
తారా శిశిరస్పర్శన్
మానస గగనమునందు విహంగము
మాదిరి నెగిరె ప్రబుద్ధంబై.
గోరీపైని ప్రదీపిక యట్టులు
కూర్చుంటిని నే నొంటరిగన్
సారెకు జాగ్రత్స్వప్నమునందు ప్ర
సక్తుడనై మరి మేల్కాంచున్.
అహహా, నాయది విశ్వముతోడ ల
యాన్వితమై నటియించున్
అహహా విశ్వము నాహృత్పాత్రిక
నానువరసమున లయ మొందున్.

అడవులఁ బూలపొన్నపయి వాయుగ నిద్దుర వోయి, చీకటుల్
విడివడు వేళ మేలుకొని విచ్చిన మొగ్గల నన్నవాసనల్
మెడపయి జారువారఁ బలిరీల నాథిపు జూడఁబోవు సం
దడి నొకసారి యుగ్రతపనాంచలలన్ శుభగిరి పాదమా!

నిలు వొంకమూర్తి మైదానవనీల నవ్యమూర్తి నిన్ను బిల్చిన
పువ్వుల సెలయేటికేళ లవి వ్రాలి వినిపించెడి దూరగానము వే
క్షీరులను క్రొత్తసుత్య తేనెకు పగ నాతెలియ వ్వాలాడియున్
వెలుగుల రేకకీర్తనల నే జపి చెవు నన్నఁ జమ్మునన్!

కౌముదీ, సుప్రసన్న మార్గములలోన
కాంతినిబిడమ్ము లగువిపినాంతరముల
సలిపియున్న సంచారంపుసహ్మరణ తెల్ల
నడగు దల్లని నీహృదయమ్ము సందు.

పూవులు పొంగుచేసికొని, మంచుమెరుంగు గుబాళ్ళుకొనంగ బిట్టు వా
పోవుచునున్న నాహృదయమున్ సుషమ ప్రగ్గు, నీసుజీవనా
శావరణప్రసక్తి గమనార్ధము గా నొనరించి మోముపై
నీవనఅం గదల్పుము, దవీయములై పరువెత్త తాపముల్.

నయననయుగమ్ము మూసికొనినాడ నను గొనిపోయి విచ్చు పు
ల్లియల సువాసనావళుల లీను మొనర్పుము; నీతరంగ సం
చయములమీద నెత్తుకొని స్వర్గపువీధుల ద్రిప్పి రమ్ము; జా
లయి ప్రవహించు కాంతి నదులం దమగాహ మొనర్పు మింపుగన్.

ఈయుగాంతభూముల యందు నెవరి నడిగి
తెలిసికొందును నాస్వప్న దేశమునకు
వెల్గునీడలు దిశ లెల్ల వెల్లివిరియ
నతిథిగా వచ్చి నట్టివృత్తాంత మంత ?

## సా యం త న ము

రాగవతి యైన సంధ్యాపురంధ్రియాన
దాసనమ్ముల చీరెలు దాల్చి వేగ
పడమటి సముద్రతీరాల పడుచుచెలులు
చల్లుచున్నారు కుంకుమాక్షతలు నేడు.
కావిరంగులు వర్ధిల్లి తీవెసాగి
యఖిలదిక్కూలములను నిండారి విరిసె;
విశ్వరూపసందర్శన విధము దోప
సంభ్రమించితి నిటు చిత్రసంధ్య గాంచి:
"అహహ! రయేరాణికై యీయజాండ మెల్ల
పారబోసిన దివ్య జపాసుమములు!
ఏనిఖిలరసమూర్తి యాహ్వానవార్త
విని, సముద్రుడు మ్రోయించు విజయభేరి ?
అఖిల దిక్శిఖరమ్ములయందు నుండి
చారుతర మయ్యె మందారతోరణమ్ము
విశ్వసంచారశీలము విడిచి నాదు
చిత్తము ప్రశాంతి జెంది స్వాయత్త మయ్యె.
ఏనిభృత నికుంజమ్ములలోన మ్రోగు
దివ్యమంజీరరవము ప్రతిధ్వనించె

నాహృదయకుంజవీధి; ప్రాణపదమందు
మెలఁచె నుత్కంఠ యొకటి, యేపుణ్యఫలమొ!

మధురమైనసంధ్యారాగ మదిర గ్రోలి
సగము మూఁకలించె కన్ను; లస్తమయవేళ
చల్లగా సాగిపోయె; సంఫుల్లనీల
కాంతులం దోగి శర్వరీకాంత వచ్చె.



చారుకుసుమాళిచెంత నోషధులచెంత
కలవరించు నానాపరిమళములందు
నిన్ను స్మరియింపఁగా జేయునేప్పు మధుర
గంధమేజాడ నున్నదో కానరాదు.

మంజులాలాపనినదిత సింజనీమ
రవళి నీయు నానాస్వరగ్రామమందు
నీహారన్స్త్రయుసందరాంతికము జేరు
మార్గ మెరిగించు సుస్వరసర్గ మేదో?

నవనవోన్మేషమైన నానాత్వమందు
తవిలి నాహృదయంబు స్వాస్థ్యంబు గనదు,
రాగవశత సంధ్యాసంజరమున జిక్కి
మినుకు మినుకను నక్షత్రమణివిధాన.

నిఖిలలోకేశ్వరస్వామినీ! మదీయ
పూర్వపుణ్యాలతాంతమై పూయునిన్ను
నీయఖండతేజోమహనీయమూర్తి
శ్యామలము అగునాడు చేతోంచలముల.



కావేరి దేవేరి యై వచ్చె నేడు
తరు లతలార, పోదాము రా రమ్మ!
పూవులు పూయరే పూదీవెలార!
ఫలము లందీయరే ఫలతరులార!

ఆరతు లెత్తవే ఆరామదేవి!
పద్యాలు పాడవే ఉద్యానలక్ష్మి!
మొగలిపూపొదితోడ ముగ్గులు పెట్టి
జాజిమొగ్గలతోడ పూజలు సేసి
గోరింటగుత్తులు తోరణాల్ కట్టి
పొగడపూవులతోడ పాన్పులు పర్చేము
తరులతలార! పోదాము రారమ్మ!

పొలిమేరపొలములు పులకరింపంగ
దిక్కు లన్నిటిలోన దివుట దీరంగ
దేవత లందరు తేరి చూడంగ
కావేరి కరుణించి కదలి వచ్చేను
తరు లతలార, పోదాము రా రమ్మ!

పచ్చటిదారిలో వరుసగా నిల్చి
పాలవెల్లువ గట్టి పందిళ్ళు దీర్చి
పిలిచి కావేరిని పలుకరించేము
పాపకర్మము లెల్ల పారదోలేము
కావేరి దేవేరి యై వచ్చె నేడు
తరు లతలార, పోద్దాము రా రమ్మ!

శ్రీ అధికార్ల సూర్యనారాయణ రావు

## పూల హారము

సహజమధురంబు లౌ సరసభావములతో
కాంతిచంద్రికలతో కలిసికొని జానకీ
కంఠసీమను వ్రేలవే—హారమా,
కంఠసీమను వ్రేలవే!

దళము దళమున వలపు తళుకు రంగులు తేర
పూవు పూవును కూర్చి కానుకించి నన్ను
కాంత కౌగిట తేలవే—హారమా,
కాంత కౌగిట తేలవే!

నిను జూచి నీవిమ్మల పరిమళాల జూచి
మువ్వంపు వెన్నెలలు నవ్వుచుండెడి మోము
పువ్వుకన్నుల జూడవే—హారమా,
పువ్వుకన్నుల జూడవే!

వలపుపాలను పొంగు చెలియచిత్తములోని
తలపు లన్నిటికి నా జలు జల్లు మని రాలు
కలపుముద్దుల తెల్పవే—హారమా,
కలపుముద్దుల తెల్పవే!

సందెబంగరునీరు చిందులాడెడి లేత
తనువు పులకలు చెంద వనితమనసున ప్రణయము
పరిమళమ్ముల జల్లవే — హారమా,
పరిమళమ్ముల జల్లవే!

లలితమంజుల గాన కలిత రాగమాలతో
ఊచి యాలింపగా చెలిరా శోధించ నాదు
చింత లన్నియు జెప్పవే — హారమా,
చింత లన్నియు జెప్పవే!

తలపు దలంపులు విడక తలపుబొలుపులు విడక
అనుదినమ్ము పవిత్ర ప్రణయ గీతిక బాడి
మనసు మనసున గలుపవే — హారమా,
మనసు మనసున గలుపవే!

వ్రేలవే చక్కగా వ్రేలవే ముద్దుగా
వ్రేలవే వలపుటుయ్యాలలో హాయిగా
బాలతలపుల వ్రేలవే — హారమా!
బాలతలపుల వ్రేలవే!

## నలు పైన నేమి !

చక్కదానవే జానకి నీవు
నల్లనివానికే యిల్లాలివౌటం.
తలపు తల్చినవాడు నలు పైన నేమి
కలిమిచూపులవాడు నలు పైన నేమి
నామది గొనువాడు నలు పైన నేమి
నా బాలకృష్ణుండు నలు పైన నేమి!
నా కాంతు ముద్దాడ నలు పంట దమ్మ!
నా నాధు ప్రేమింప నలు పంట దమ్మ!
నా పతి సర్వాంగ నలు పంట దమ్మ!
నా బాలకృష్ణుండు నలు పైన నేమి!

వరలక్ష్మి వలచేటి వైకుంఠు డమ్మ!
సీతమ్మ చేపట్టు శ్రీరాము డమ్మ!
గోపికల్ కొలిచేటి గోపాలు డమ్మ!
నాబాలకృష్ణుండు వలు పైన నేమి!

## జానకి చూపు

చిరవియోగానలంబున చిత్త మెరియ
కనక కనక జానకి నన్ను గాంచి నపుడు
నాటుకొనిన దుఃఖముపైని నవ్యహర్ష
వీచికామాలికలు దండు వెడలు చుండ
ఎండ వానలు జతగూడి యుండునట్లు
చీకటియు వెన్నెలయు చెల్మి చేయునట్లు
కనుగొనల బాష్పకణములు కారుచుండ
తొగరుబెదవుల చిరునవ్వు తోచె సతికి.

## వలపు పాటలు

తెలియని ప్రేమమే బలమైన దంచు
పులుగు లాకాశాన లలితముగ బాడె.
కనరాని ప్రేమమే ఘనమైన దంచు
ఆకులలో గాలి హాయిగా పాడె.
పలుకని ప్రేమమే పావన మంచు
చల్లగా మదిలోన జానకి పాడె.

పువుదీవెల్ మెయినిండ జొట్టెదు, హిమాంబుల్ రాల్తు నేత్రంబులం
బవనవ్యాకృతి నుత్తరీయము తొలంగంజేసి శోషింతు, హా
హా విలోలాక్షుల నుంతు వర్ధిల్లన, నేలా యిట్టివ్యాలోలముల్ ?
జవరాలా, సుఖియింపు సాంద్ర మహాజ్యోత్స్నాస్నిగ్ధపూరంబులన్ !

## మేలుకొలుపు

నీడములు వీడి కలకల నిస్వనముల
బారుచున్నది మేతకై పక్షికులము,
కొక్కొరోకో యటంచు కుక్కుటము కూసె,
ఇంక నిద్దుర మేలుకో వేల విప్ర !

ప్రాగ్దిశానలపర్వతాగ్రమున గ్రమ్మె
ధూమసంకీర్ణపాపకోద్ధూతశిఖలు
తర్పణాదికనిరతులై తరలినారు
తోడిపారులు, శయ్యను వీడ వేల ?

చలిదిమూటలు భుజదండముల దవిల్చి
వృషభగళముల సీరముల్ వేగ వరచి
పోవుచున్నారు కృషికులు పొలములకును,
బాపడా, మోము ముసుగింక బాపరాదె !

ప్రాతరనిలతరంగ సంపదల దోగి
పారవశ్యము నొందితో బ్రాహ్మణుండ !
అరచుచున్నవి లేగలంబా యటంచు
పాలు పితికెడి వేళాయె మేలుకొనుమా.

ఖరకరుండిదె సోరణగండ్లనుండి
స్వర్ణరోచిర్మయూఖముల్ పరపదొడగె.
చిన్నమాతురు భారతి చేయి పట్టి
వేచియున్నది, నిద్దుర చాలింపుమయ్య !

# శ్రీ పెద్దిభట్ల రామచంద్ర రావు

## ముఖాంభోజము

దివ్యమోహనలలిత సందీప్తిశాలి
నీముఖాంభోజమే దృష్టి నిలుపుకతన
నిశ్చలం బయ్యె నామది నిబిడరక్తి
ప్రియునిదర్శన మబ్బిన ప్రియవిధాన!

దివ్యమోహనలలిత సందీప్తిశాలి
నీముఖాంభోజమే దృష్టి నిలుపుకతన
పులకరించెను నాతను కలలివిగాగ
చిన్నగ నిలిచిన చైత్రవనపుష్పమాలె!

దివ్యమోహనలలితసందీప్తిశాలి
నీముఖాంభోజమే దృష్టి నిలుపుకతన
హృదయ ముప్పొంగిపోయె సమ్మోదముతోడ
పూర్ణిమానిశి వార్ధి యుప్పొంగుపగిది!

దివ్యమోహనలలితసందీప్తిశాలి
నీముఖాంభోజమే దృష్టి నిలుపుకతన
దివ్యరాగామృతరసమ్ము గ్రోలినాను
కాంక్షఁ పూదేనె గ్రోలుభృంగంబుకరణి!

## నౌక

ఎంతకాలము మోహాబ్ధి నీదగలను?
అంతుపొంతును లేని యీయబ్ధియందు
తీవ్రయాతనచే కాళ్ళు తేలిపోయె:
నన్ను దరి జేర్పవేమి నానౌక షంచు!

నా మనోరంజనీ, విను నీ ముఖమ్ము
స్మిత మధురభావములు వర్షించుచున్న
అలలపై దేలియాడెడి వాంఛరీతి
నామనం బోలలాడు నానందజలధి!

## కర్ణధారుడు

కర్ణధారుండు చుక్కాని చేపట్టి
నడపుచుండెను నావ గమ్యశ్రద్ధతోడ
నీహారమున నుండి నేత్రయుగ్మమునకు
కానగావచ్చు దూరాన దీపంబు.

జలధి హోర్మనుచు ఘోషను పెట్టుచున్న
చలియింప దతని నిశ్చలదృష్టి యేమి!
తుంగభంగములపై దుముకుచున్న
చలియింప దతని నిశ్చలదృష్టి యేమి!

ఎదురుగాలి రంయాని వీచుచున్న
చలియింప దతని నిశ్చలదృష్టి యేమి!
అతని చూడ్కులు నిల్చె నాదీపమందె
ఒక్కప్రక్కకు ద్రిప్పె చుక్కాని యతడు.

అలలపై జరిన బరుగెత్తె పడవ,
నావలో వారికి నష్టంబు లేదు.
నావ కంతకుమున్నె నష్టంబు లేదు
భద్రమ్ముగా నోడ యొడ్డుకు జేరె!

# ఆత్మసమర్పణము

ప్రణయ సంధాననీయంఘ్రిపద్మములను
నాదు హృదయంబు బంధించినాను నాథ !
నా సమస్తము నీ దర్శనార్థ మొసగి
వేణుగాన విశారదా, వేడుదాన !

మాన్యులిల కొందరో నాకు ముఖ్యులనుచు
తలచియుంటిని గాని యీ తరుణమందు
ఎవ్వరికి గాకపోతి నీకె గ్రహించు
వేణుగాన విశారదా, వేడుదాన !

గోకుల మనిందు నా బంధుకోటి యెల్ల
మూరు గాలినిగా నేఁ నాఱు నన్న.
హృదయవేదన నార్పలో నుంచి నాథ,
వచ్చితిని చేర నీ పాదవనజ యుగళి !

నాకు సర్వమ్ము నీ వని నమ్మినాఁటి,
అంతటను నీదు సౌందర్య మరయుచుంటి,
న్యాయ మని యెంచి తోచిన నది యొనర్పు,
అకట, పొమ్మని యాన తీయకుము నాథ !
వేణుగాన విశారదా, వేడుదాన !
నా సమస్తము నీ దర్శనాగ మొసగి,
ఒక్కనిముసము నిను జూడకున్న నాథ,
ప్రాణములు స్థానములనుండి పట్టు వదలు !

యానమాన చారిమ స్వప్నశాలి నొందిగ
పొంది చూచుచు లయించిపోయినాను
అప్పు డీవిశ్వమే నిత్యయాత్ర సాగి
శ్రవణములు మూసికొనినది, రాక రాక
నాగశిరమఃపథమ్మున రేగి రేగి
నాదనోచ్చలితోచ్చగీతా దురంత
దుస్సహార్పులు వెడలి రాగా........ ...



నా హృదయమందు విశ్వవీణాగళమ్ము
భోరు భోరున ఈనాడు మ్రోత పెట్టు;
దశదిశాంతంబులను లోక సుధాస్రవంతి
నంగి మర్త్యుల మెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు.

వెలుగులో, యమృతాలో, తావులో ను నవో
కురియు జడులు జడులు గాగ, పొరలిపొరలి
కాలువలు గాగ, పూర్ణకల్లోలములుగ;
కలదు నాలోన క్షీరసాగరము నేడు!

దారి దొరకని నాగళద్వారసీమ
తరగహస్తాల పిలుపుతొందర విదల్చు!

తనరి యుండిన ప్రకృతి చైతన్యశోభ
తలపునకు దెచ్చు నొక మహత్త్వంపు ప్రతిభ.
అతిసమున్నతభయదపర్వతచయంబు
నీలనీరంధ్రకాదంబినీగణంబు
సతతకల్లోలవీచికాసాగరంబు
గాఢతమసాన్వితకరాళకాళరాత్రి
విస్మయావహభయాలు గొల్పు నవ్విశ్వరూప
మెట్టిదో, యామహామూర్తి యెవని కతన!
పూర్ణిమాచంద్రచంద్రికాపూర మైన
శారదమనోజ్ఞ యామినీసమయమందు
చలువరాయని యమృతంబు జాలువార
మినుకుమినుకను కనుతారకాగణమునందు
ప్రతిఫలించు తుషారనీరములు మెరయు
పచ్చబయిలో నిల్చు నామహామహు డెవండో!
తరులు వికసించు నవవసంతముల లోన
తావి వెదజల్లు కుసుమబృందముల లోన
మించి యిగురించు గున్నమామిళ్ల లోన
తనరు మహనీయ ప్రకృతిచైతన్యకళలు
ఎవని తేజఃకణమ్ములో యివ్వి డాగు!

## ప్రతీక్ష

క్రేవల నున్న చెంగలువరేకులు కోమలకాంతు లీన, పూ
దీవెలతూగటుయ్యాలల తేటులు తేనియసోన లాన, క్రొం
దావులు చూరలాడ యమునానికటామయపుణ్యభూమి బృ
దావనరమ్యవీధు లివి నందకుమార, అనుగ్రహింపవే!

ఎచ్చో మల్లెపూలపొదరిండ్లను దాగురుమూత లాడితో,
ఎచ్చట చెన్నముద్దలను నేర్పడ దొంగిలి మ్రింగినాడవో,
ఎచ్చట చెట్లనీడలను నింపుగ పిల్లనగ్రోవి నూదితో,
అచ్చోటు చూసి పోయితివో, అల్గితివో పరరమ్యసీమపై?

పచ్చికబీళ్ళపై విరియబూసిన తెల్లనిపూలగుత్తులం
దచ్చపునీటిబిందువుల యందము వెన్నెల చిందులాడగా
పచ్చనిరత్నకంబళముభ్రాంతి నిసర్గమనోహరంబునై
విచ్చలు నివ్వటిల్లు వన మియ్యది గోపకుమార, రాగదే!

తీయనిపాలు త్రావితివి తేపకు తేపకు గొల్లబోంట్లకుం
దీయనిమం ద్దొంగితివి తీయనిమావి యిగుళ్ళ యీనన
చ్ఛాయల విశ్రమించితివి చల్లులబువ్వము లారగించి కం
దోయి ఘటించ నాట్య మొనరించితి, నాటను చెల్లిపోయెనే!

చూతము రారె నందు డొకసుందర బాలుని వెంట దెచ్చెనో
రాతిరివేళ నిందుయమునానది క్రేవల ద్రోవ యిచ్చెనో
పూతన వచ్చెనో నిదుర బోవుచు నన్నయశోదప్రక్కలో
నేతమజాతు డైన నిదురించెనొ చూతము రారె గోపకుల్!

కంసునివంటిరక్కసులు గాదిలిబిడ్డల గోయ నెంతురో
పాంసనులై, పవిత్ర మగుబ్రాహ్మణజాతి బరాభవింతురో
హింస యొనర్తురో, బలుల నిత్తురొ మందలలో నిక్రేవులన్,
ధ్వంస మొనర్తురో మెఱుగుబంగరుచాయల పంటపైరులన్?

ఎండకు వాన కోర్చి పలవించెడుమందల నాదరించుటో
మండువిసంపుఁదిమ్మదుగుమాటున దాగిన నాగుబాముపై
తాండవ మాడుటో మరల రాత్రి ధర్మము నుద్ధరించుటో
ఖండితవాదులం బదవి పొందుటొ, కోరుచు నుండ మాదియే!

ఆయమునానదీ పరిసరాగతమందసమీరవార మే
ఛాయల బోయెనో దశదిశావృతతుంగతరంగమాలికా
తోయకణంబు లేకపల దూరములై పరతెంచుచున్నవో
మాయురె, రమ్యవస్తుచయ మంతయు కృష్ణునివెంట నంటెనే!
ఆయువుపట్లు తూలునటు లశ్రులు గార్చిరి గొల్లవారు, తే
ర్రాయులు నన్నపానములు బాసి తపించిరి జాలి పుట్ట నం
బా యని మోర లెత్తుకొని యావులు దూడలు నంగలార్చె, కృ
ష్ణా, యికనైన గాని కరుణామతివై ప్రభవింప వొల్లవో!

## శ్రీ కోపల్లె శివ కామేశ్వర రావు

## విరహము

సంపెగబంగరుం గరువు పోచిన నీమెయిచాయ వచ్చెనో
చెంపకు చేరెడై కనులు సిగ్గులరియ్యగ నాలు నేర్చె నీ
వం వగుభ్రూలతల్ నుదిటిపై నటియింపగ నేర్చె చంద్రబిం
బంపురసంపుబూత జిగిదారినపో మొకవింత గొల్పెడిన్.
తపము చేసెడిబుద్ధి నేత్రములు మూఁదు
కన్నులకు గట్టినటు లీవె కానిపింతు,
కన్నులను విచ్చినను నీవె కానిపింతు,
వలుల, సర్వంబు నాకు నీ వైతి విభుడ!
నీయనురాగరూప రసనిమ్నగ జేరితి, దప్పిగొంటి, నా
దోయిలి పోచితిగా జలము దోయిలి కందగ నిమ్ము నిన్ను నే
ధ్యేయముగా స్మరించెదను తిన్నని నవ్వొకయింత నావయిగా
చేయుము న న్నొకింత కను విచ్చి కనుంగొనరాదె కామినీ!

నీయాలాపముతోడఁ గన్నొగిలుఁగా నీహస్తసంస్పర్శమై
గాయం బెల్లను వాఁడు ఝల్లు మనఁగాఁ గన్విప్పి నింగాంచుచున్
మాయం బౌదువు కోరి యందఁ నగు సామ్రాజ్యంబు బోనాడి యా
గా యజ్ఞంబును చేయువానిపగిదిన్ శ్యామా, నిశల్ పుచ్చెదన్
ఉవిదా, నాపయి కూరుముల్ గలవొ లేవో గాని నీ కార్ద్రమూ
ర్తివి నీ వెప్పుడు నామనస్సునను తంత్రీహస్తవై రాగముల్
చవి పుట్టింపఁగ బాడుచుందు, విక దచ్చాభివ్యక్తసాకల్యనో
ద్భవ దుద్వేలతరంగసంపతన విభ్రాంతిశ్రమన్ దోఁగుచున్ !

# పునర్దాంపత్యము

కవి

పూవులు బుట్ట కెత్తితివి పోఁమున నుత్తెములై శ్రమాంబువుల్
తీరఁ బరెప్పొ, ముంగురులు లేటకనుంగవ నావరించె, నిం
కో వికసద్వయస్విని, మధూదయవేళల యందు తీవ్రబా
ధావిని పాతసౌఖ్య మగుపత్వముగా నుమాపచయమ్ము లేటికో!
కోసినపూవు లున్న వతికోమలముల్ మధులిట్పదాహతిన్
మాసినవైన గావు, వనమానుడు లాలనచేసి పెంచఁగా
ఖాసిలి పిన్నతవ్వుల హుబానబలం గురియించుచుండి, వి
ద్యోనుకుమార యౌవనవిభోదయ చంచలదృగ్వతీ, సతీ!
త్రుంచినపూల జాడఁగ యథోమతివై మనుముందు మంచిపూ
వంచు నతిత్వరం బొసఁగ, వాఁగని వానివిలాసవాసనల్
గాంచెదు, లీల పిండఁగని కోమలతారపాతంబు లౌనా, యూ
హించుట నీమనోరథ మెం విర్గళయౌవనభాగ్యభోగినీ!

## వాణి

శరసనీర వాత్మజ, యెటువో చిత లౌకిక కార్యకామివై
యూరక యాలపింతు, వినవో కనవో కదె యస్మదీయచే
తోరమణీయభంగులు, సుదూరము లయ్యెనొ జ్ఞానచక్షువుల్!
నీరవగానసుందర మనీషితకం బెడబాసినాడవో!

తారలపుంగవుంగిలు లనాకృత మెవ్వని కంఠసీమపై,
పూవుల ప్రోవులై కొనరయుచో యతడే తెలియంగనోపు న
న్నో విచలన్మనఃపథుడ, యుమ్మలికమ్మున నున్న నిన్ను నీ
పూవుల కప్పుజెప్పితిని, పోయెద నవ్విధుచో మహాశ్రమై!

త్రుంచుట నాయభీప్సితము, త్రుంచినపూవుల నేలపాలు గా
వించుమహాశను లంపరు! నవీనపరీమళ మాధురీఝరీ
ప్రాంచిత మైనయీసుమచయంబు జరామరణంబు లేని దే
మంచు తలంచితో, తెలియనైతివి నాథ, మదీయతత్త్వముల్!

నీయుపగూహనం బొకటి నిత్యసహస్రసమంబటంచు నుబ్బ నీ
కో యువ, కన్నతూతులమహాజ్జ్వలశోభల జూడుకంటె నే
రే యితరంబు లేల! తనయిష్టసమృద్ధికి పాటుపాడదే
కోయిల? భోగభాగ్యముల గోరియె కూతుల గాంత్రె దంపతుల్.

ఈమధుమాసయామముల నీపువుదోట రహోవృధాత్రి ని
చ్చామధురార్ద్రగానసుఖసౌరభ మిచ్చెదు పూల గోయగా
నామది తేద్ర యయ్యె, నిక నాచెయి నీచెయి గల్పిపోద మా
రామములోని కోయిలవిరామమున, నన్ను గవుంగిలింపరా!

## శాంతి దేవి

హృదయప్రమదావనాతిథీ,
సదయా, దుఃఖకళంక మైన నా
మదియందు వసింప రమ్ము, ని
న్నిదె ప్రార్థించెదువాడ శాంతమా!

మలయానిలు కౌఁగిలింతలన్
చలువల్ కాంచెడిపాదపమ్ములన్
మొలక నవ్వుల తేట నీవు ? విం
తలంపో నీదువిధమ్ము లారయన్.

చిరునవ్వులపూలగుత్తులన్
గురువంగా నిను గోరుబిడ్డలన్
విరసంబుగ జూతు తల్లి ? నిం
గమునాసింధువుగా ఘటింపవే !

తననీరము రాతిగట్లపై
జని మాధుర్యము జాలువారగా
ధ్వని సేయుఝరీకలంబులన్
మనసేలా ? యొకమారు పల్కుమా !

భయదాకృతి బొల్చునాతమో
మయరాత్రిన్ స్మయమానదృక్కులన్
నియతిం బరగింతు నేల ? నీ
పయనంపుంగతి బల్కు శాంతమా !

జననీ, కరుణింపు మంచు నే
నిను నత్యంతము నమ్మి ప్రొక్కగా
నను గాదని యింక నెవ్వనిం
గనెదో నా కెరుగంగ జెప్పవమా !

నను దుస్తరచింత ముంచి, దు
ర్మన మాందోళన ముందుచుండగా
నిను వీడితి నంచు బల్కదుం
డవగా నీ కిది నమ్మ శాంతమా !

పరుశాత్తను పోలు ప్రాభగా
గుణకాకాదులకున్ వసుంధర గా,

సరి లే డొకదుంగా ! మదీయహృ
త్సరసీజంబున కాపు గాంచుమా !
భవతీయపథంబు దెల్పగా
నవు కా దన్ పలు కాడకుండ, ని
న్నవలీల గ్రహింతు, నంత నా
కగు భాగ్యోదయ మన్మ కాంతమా !

## దయితా హృదయము

బాలయలుకన్ సరాగమృదువృల్ కడకంట నిశాతకాంతి రే
ఖలు ప్రసరింప, నెయ్యమును కొదను దీక దిగద్రావునో, సము
జ్జ్వలముల నయ్యె తాపశమనంగతి చేసునో, రేల చీకటుల్
తొలంగగ ప్రేమరత్నము వెలుంగదొ సౌఖ్యము నిట్టు దేల్చుచున్.
అతివ తలంపులో తెలుగునట్టి కొలందికి మీరె గాని నీ
కత చెవి సోక నశ్రువులు గ్రమ్మ, చలింపక యుట్టె నిల్చి, యూ
నత మయి తెల్లబారువదనంబు చెమర్ప, సరోషభుగ్నవా
క్చతురిమ కంపితాధరనిషణ్ణము గా భ్రుకుటిన్ వెలార్చెడున్.
ఎద యభిమానజృంభణమహిష్ఠమయైన సుఖాభిలాషలం
బొదలదొ, కోపముద్ర విముఖం గననప్పటికాననాబ్జకే
లుదితసుఖోపగూహనల యొప్పమి బుట్టున రోయు నేని, నె
మ్మది దలపోయ కయ్యొ ! కసుమాలపు కోకలపూవు నొంచదే!
వనిత యదేమి చింత యగు, నట్టిబయల్ కనుకొప్ప వాల్పకే
కనికని నుంత రోరగ ముఖంబు మలంచి యలంతినవ్వునన్
కనులు సగంబు మూతపడగా పెదవుల్ కొనసాగు మొగ్గయై
తనరెడునంతలో నలపతన్ పెదవో మిడుచున్ గొణంగెడున్ !

## శ్రీ కొడాలి ఆంజనేయులు

### ప్రేమ లేఖ

ప్రణయపరిమళ శారదరాత్రు లెన్నొ
నిరుపయోగమ్ము లయ్యెనో యెఱుగగలవె?
వేడికాటుక కన్నీట వాడువడిన
అడవిపువ్వుల సెజ్జల నడిగి చూడు.
పాలిపోయిన చెక్కిళ్ళజాలి యెల్ల
నిదుర యెఱుగని కన్నులమదుగు లెల్ల
వలపువిట్టూర్పు సెగలకున్నలిగినట్టి
తొలిమొగిలిరేకు లేఖయే తెలియజెప్పు.

వాలుజూపుల పన్నీరుపూలు రువ్వి
నొవ్వ జేసితినేమొ నీ జవ్వనమ్ము.
వెన్నకన్నను చివురులకన్న గూడ
మృదులమైనట్టి హృదయ మర్పింతు నీకు.
విరహ చింతాధరమ్మున వేగివేగి
మేను విడిచెదనేమో సుమా! త్వదీయ
ప్రణయముక్తాశుక్తిమాలల పరిఫలింప
అంకితము సేతు నీయమృతాక్షరములు.

### కవితా గానము

౧

[illegible]శిరత్నం పూచేచోట
రంజిల్ద్రాక్షలు పాకేచోట

కొండకోనలో గంగాజలములు
మిలమిల లాడుచు మెరసేవేళ
కలకల పాడవె కవితాకన్య !

౨

పసిడియిసుకలతొ పరిచేచోట
దేవకన్నెలతొ తిరిగేచోట
పచ్చరాలపై కిన్నరసానులు
తీయరాగములు తీసేవేళ
కంఠము కలపవె కవితాకన్య !

3

పారిజాతములు వలచేవేళ
అప్సరోంగనలు ఆడేవేళ
చింతారత్నపు తరళపునిగ్గులు
పగడపునందలు నిగుడేచోట
గానము చేయవె కవితాకన్య !

## జవరాలా !

౧

మబ్బులకెరటాలు మలచు మిన్నేట
తొలిపూపజాబిల్లి దోనె వేయించి
మంచిగందపుకొండ మలకవాగులకు
రావింతునే నిన్ను లావణ్యరాశి !

౨

నదియు పర్వతము కలిసెడలమార్గముల
ఇంద్రధనుస్సుతో నిల్పించి వేగ

కవిరాజుతలపుల గాలిమేడలకు
పిలిపింతునే నిన్ను విద్యుల్లతాంగి!

3

రాగాలకోనలో నాగకన్నెకలు
పూవులు చిదిమేటి పున్నెంపుచోట
క్రొమ్మించుతీవలో గూర్చుండ బెట్టి
ఊగింతునే నిన్ను భోగాలకోన!

## ఋషి కన్య

ప్రాతమావులతావి శీతగాలులకు
పడుచుచెంచెత పాడునలవుపాటలకు
ఉదయరాగములతో నిదుర మేల్కొనగ
నిదురలో ముంగురుల్ చెదిరిపోయినవి
జడలోన ముడిచిన జాజిపూదండ
మెడలోన వైచిన అడవిగన్నేరు
చేతుల గట్టిన చేమంతిపూలు
పరిమళమ్ములం వీడి వదలిపోయినవి.
దివ్యధ్యానములు చేయు దేవపూజలకు
కుసుమముల్ ఫలములు గొనితెచ్చి యీఁగు
చెక్కుళ్ళు చెమరించి చిక్కిపోయినవి,
కటికినేలను కాళ్ళు కందువారినవి.
ఉదుటజాపుల చిన్ని బెదరుజింకలకు
పదనురాలను కుశల్ చిదిమిపెట్టగను

మగుడు చేతుల వ్రేళు లెఱ్ఱబాఱినవి.
చెమట కుంకుమబొట్టు చెదిరిపోయినది.
నీయలంకృతు లిట్లు పోయినప్పటికి
ఋషికన్య, నీశోభ యీటు కోలేదు,
వాడిదమ్మి పూచేసె అళులు త్రావినను
తమ్మిసౌరభ్యంబు తఱిగిపోనట్లు.

## శ్రీ కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు

### స్వాధీన పతిక

ధరితకర్పస్విని, వరవర్ణనీ!
పరమసమ్మానానోజ్జ్వలకమలినీ!
నీసుకృతఫలమా వర్ణింపజాలన్
పతికి నీపై గాఢలుబ్బాలి యొల్లన్
ప్రియునిపై నీ కున్న ప్రేమ యొల్లన్
తెలిసెబో మాచర్య తెలమి జూడన్.
ధరిత... ...
కమ్మతావుల తమ్మి కలికిపువుఁగ
సమ్మతిం దెచ్చి పూజలు సల్పగాన్
పరమాత్ము డతిదయాపరత నీకుఁ
కలిగి యీవర మిచ్చె నీకుంతినీ!
ధరిత .. ...

# పూజ

౧

పసినిమ్మచాయల సెనలారు సెమ్మోవి
కమలసౌందర్యంబు నలరించు తెలిచీర
మోచేతిదాక సమ్మోహనాస్త్రము వ్రాలె
జిగిజాలు మేల్ రైక బిగియించు పసొంగసులన్
ముక్కునం జోకగ్రుంవు ముక్కెర కాంతులు
కంఠసీమ నటించు కనకభూషణశోభ
స్తనభారమున నృత్య మొనరించు కానుకన్
బంగరొడ్డాణంబు బలుచిత్రగతి గాత్రిల
కనులపండువు గాగ గన్పడె
నుదయసంధ్యల నుల్లసిలు మ
నోజ్ఞవికచవినోదమానము
జోటి నానవలా!

౨

ఆక్రోటిపర్యంత విశ్రుతశిరోజరా
జితశోభనాంగియై చెలగి దేవళములో
పరిబలిప్రదక్షిణా లొనరించు మనమార.
ధ్యానైకనిరతి మహాసక్తయై సొబగు
చేదోయి సంధించి శిర మొంకించుక వాల్చి
నిశ్చలభక్తి రాణించుదృష్టి నిగిడ్చి
తెలికన్నుగవ నూత్నదీధితులు గక్రుంగ
దీనవదనాంభోజయై నిండుమనముతో

గదియలోపల సుఖముగా కంటి నీవు
చందమామను బురిడించు కందును చెలి.
మగడు రాడాయె నని చాల దిగులు బొగిలి
ప్రియుని స్వప్నము చూడగోరితివి తరుణి!
ప్రియుడు వచ్చును నీదుకోర్కెలును దీర.
ముద్దుకొమరుని కంటి వో ముద్దుగుమ్మ!

## కపిల ధార

గీతానంద సుధారసోజ్జ్వలస్ఫురత్ కీర్తిప్రకాశోద్ధతిన్
పూతోదంచిత మయ్యె నీను లెంకిన్, బుణ్యంబు చేకూరె, సం
ప్రీతిం గన్నుల నీరు గ్రమ్మె ననిశోద్వేలోద్భవీణాశ్రుతిం
ప్రాతః కాలరుచిరోజ్జ్వలమ్ములై భాసిల్లె ధారాంబువుల్.

## శ్రీ నాయని సుబ్బారావు

## మాతృ గీతాలు

౬

పుణ్యమాసమ్ములో నీవు పోయినావు
నాకు చలి తీరినది రమానాథచరణ
పంకజాసక్తమైన నీపైట చెంగు
కప్పుకొనుటకు పడయని కారణమున.
ఎంత దయలేనితల్లివే. ఇంతజాలి
యెట్టిదో యెన్న డెరుగని యట్టి కఠిన

కాలదగ్ధమ్మునన్ నన్ను కట్టివైచి
ఎగిరి పోలేవ శాశ్వత మగుసుగతికి.

మాఘమాసమ్ము వెన్నంటి ముందు వెండ
రగులుకొని వచ్చు నట్టి వర్షమ్ము లేని
ఈయభాగ్యపు వేళ వైచెత్తి నీవు
నన్ను రక్షించు కొను కోక సన్నుతించి.

౨౦

నేడు శివరాత్రి కథ వినరేడు నీవు
పావనసువర్ణఝరీనీజలావగాహ
నమున పరిపూతవై పంచినావు నాకు
కాళహస్తీశ్వరుని కటాక్షముల మధువు.

నిరుడు నను వెంటబెట్టక నీవు మునిగి
నావు మొగిలేట కోకలెవు నన్ను విడిచి
నేడు ఘనజటాకల్లోలినీతరంగ
శీకరస్నాన మొనరింప నీకు తగదె?

నేడు శివరాత్రి కైలాసనిలయవిమల
వదనరేఖాముహుర్ముహురుదితమంద
హాసమున తరంగితమైన దమృతముగ్ధ
మతులితానందరాశి నీ యంతరాత్మ.

## అంబికా స్తవము

శ్రీదము లైననీనయనరేఖలదివ్యసుధాస్రవంతికల్
పాదులుకట్టి నాహృదయపద్మము నీకరుణాప్రసాదసూ
ర్యోదయదీప్తిలో నవనవోన్మిషితం బయి భక్తిగీతికా
స్వాదుమరందముల్ బయలు ప్రాకెడు నేటి కనుగ్రహింపవే.

ఈచవు రెట్టివో తెలియు నింతకుపూర్వము నవ్యభావముల్
పూచినకేసలన్ తడిసిపోయిన నాహృదయాంతరమ్మునన్
వీచియనవ్యవాస్నలలు నిండిన యీసకలప్రపంచ మం
తా, చిగిరించు కేని చరితార్థుడ కేగద నాడునాటికిన్.

౨

చీకటికాటుకల్ విరియజిమ్మెడు నాది ననంతధూమమున్
ప్రాకి తమోవృతాంధములు మామక దృక్కులు మూకలై భయ
వ్యాకులముల్ మదీయహృదయాంతరభాస్వదఖండదీపికా
శ్రీకరకాంతిలో మరల రెప్పలు విచ్చి నవాశ్వసిల్లెమున్.
ఏతొలినాడు నీవు వెలిగించిన దీప్రతిభాంక మాంతర
జ్యోతి నవాంతరాయమును మహోగ్రమహాప్రతికూలమారుతో
ద్ధూతమునై చలించు ప్రణతుండను కావక వత్సలత్వసు
శ్రీ తరలించి నాహృదయరేఖలలో ప్రవహింప జేయవే.

## అంతులేని యాత్ర

యౌవనసంతమ్మ పల్లవిత మైనవసంతపు చైత్రసంజలన్
దేవి! త్వదీయపాదనఖదీప్తులు నాహృదయంపు మొగ్గలో
భావనమంజులాకృతులు వ్రాసిన యప్పటి నుండి యాగక
జీవనధార నాప్రణయసింధువు పొంగు తదంతరమ్ములో.
నీసగళంపురూప మది నెమ్మన మందున ముద్రితమ్ముగా
చూపిన చేతలముల్ హృదయమూర్తి వయిన్ నెలకొల్పి యున్నపూ
జాసమయమ్ములన్ ప్రణయసాగరముల్ మధియించి నానో ల
జ్జానమమైన నియమ్మృతవాసము కొంచెము సేకరింపగన్.

ఈమధుమాసపుంజీకృతి దొత్తినమేఘపతాకలందు సం
ధ్యామదిరాక్షి రక్తిమెయి నద్దినచిత్రము లంటి దివ్య తే
జోమధురమ్ము నీయుషశ్రీ నూటితి మత్ప్రియాయాన్ద్రవీక్షణ
గ్రామ మనంతమార్గములకై ప్రసరింపగ నాటియుండియున్.

ఏజన్మమ్మున గ్రాయగా బడియెనో యీపుణ్యముల్, మన్మఖాం
భోజాతమ్మున యుంగు మూపులు పడెంతో యంతభారమ్ము శ్రీ
పూజాగ్రవ్యములైన నాహృదయమున్ పొంగించి ప్రేమాపగా
భ్రాజత్తుంగతరంగరంగములపై పైపై నన్ను తేలింతురున్.

ఇవి తలపై ధరించి నీవ మెత్తిన నేననురాగవాహినీ
ప్రవిమలసర్వతీర్థముల పాతరలాడితి, నల్పభావనల్
తవులగరాని యక్షయపథమ్మున నీ వొకమిన్కుమిన్కువై
దివమును బోలె భూతలము దిద్దుదు నంట యొకింత కక్కటా!

ఇక్కడ నేటి కిట్లు మెరయించితి నీప్రణయమ్ము; నీవు నా
చుక్కవు; పూజకై వలయుసొమ్ములివే కొను; పారవశ్యపుం
జోకున నాదుమానసము సోలినయ ట్లనురాగబంధముల్
గ్రుక్కగ కన్నొరంగెడవు నా జలదప్రతిసీర లొడ్డుచున్.

ఈప్రణయయాత్ర ముగియదే దింక ముగియ
దనుము, నాచుక్క వైనని వస్మృదీయ
మానసాభ్రమ్ము నక్షయమధురరాగ
మూలమున యందు లీనమై పోవుదనుక.

## ఫలశ్రుతి

ఈతలిరుపాదముల యచ్చు లెచటివె, ర
పాతలన్ పుల్కరించు నా పాదలందు
ఈయమృతహస్తమార్దవ మెచటిదె, ప్ర
సాదమాధుర్య మొలయు నాస్వర్శలందు;

ఈమనోజ్ఞ సాంద్రప్రసారేక్షణమ్ము
తెచటినే, శారదజ్యోత్స్న లింతలించు;
ఓప్రణయలోకవాసిని ! సుప్రసన్న
దేవతామూర్తి! నిన్ను దర్శించుచుంటి;
ఈమహాప్రేమమంత్రనేతృత్వమధుర
సార్ద్రవచనమ్ము తెచటివే, యనుపదమ్ము
వాశ్రుతుల యందు నాయంతరాత్మ కరగు
నో ప్రణయలోకవాసినీ! ...

## శ్రీ ముద్దు కృష్ణ

## చిటి శ్యామల

గాలిఅడుగులు కదిలితేనే
తేలగుండెల బెదిరిపోతుంది,
మా చిట్టిశ్యామల
దేనికోరకో వెర్రిచూపుల
వెదకిచూస్తుంది,
అంతలోనే
బోసినవ్వులు వెళ్ళబోస్తుంది,
మామనసులోపల
వెన్నెలట్టే విరిసిపోతుంది,
మళ్ళీ ఏమో
కళ్ళు రెప్ప కదిపి చూస్తుంది,
కళ్ళలోనే
వింతవెలుగులు వెలిగిపోతాయి
మా చిట్టిశ్యామల

నా డెందములో గల
సంబారశ్రీ
పాడగ నావని
పోగలదటా?... తెలుసు...

# కోడెగాలి

కోడెగాలి
ఆడుకుంటూ దారిపోతూ
బ్రతుకు తెలియక
జగతి నెరగక
కలకలల విరిసిన
కన్నె పువ్వును
కన్నుగీటి కదిపి చూసి,
లేతపెదవులు అని నొక్కి
లోని తేనెం కొల్లగొట్టి,
ఏమి యెరుగని కన్నెగుండెను
కామితాగ్ని కలత పెట్టి,
ఆడుకుంటూ పాడుకుంటూ
మెల్లమెల్లగ జారిపోయాడు;
పోతుపోతూ దారి కలిసిన
పోకిరి పాటల్ని పాడే
తుమ్మెదలతో నెమ్మదిగ
తన ప్రతాపం పరిమళాలను
గొప్పలాడుతూ కులుకులాడుతు
మీసాలకొనలే మెలితవనీ

# పెంపుడు నెమలి

మేదురవినీలమేఘాల మేలిముసుగు
వేసికొని వచ్చె శ్రావణమాసలక్ష్మి.
ధారుణి ధరించె తొలకరి సారె యిడిన
యార్ద్రపురుగుపూవుల శాద్వలాంబరమ్ము.

వడిమిపూల నెత్తావులకనటు నార
వృష్టిమంచటి తొలిగాలి వీచసాగె
ఏల యీనాటి దశప్రాణములఁ జేర
నెగులులాడ కెట్రాలు నా హృదయమునకు !

పేడ దేమొ పరాపింఛ మీ నెమలికొదవు
గోడమరుగున మెడ దాచుకొనును గాని
ఉరుము లురిమెడి మబ్బుల తెగవుకేసి
చూడబోవదు, పురి విప్పి యాడబోదు.

ఆడకున్నను మానె గొంతైన విప్పి
కేక వేయ దాశల గిలిగింత లడర.
కోడెత్రాచుల నణగించుకొనగ జాలు
ప్రకృతి కెటు కల్గెనో యెడబాటుబరువు!

కన్న తడియని మూకశోకమున ముంచి
నన్ను వెత నొంచె నీ పెంచుకొన్న ప్రేమ.
వానకారునృత్యము చూడ వాంఛ గొన్న
నా యెద ప్రవాసవేదనాచ్ఛాయ లలమె.

కుండపోతగ వర్షమ్ము కురిసెనేని
తెలిపోవును పో మింటినీలిముసుగు.
కాని యెదలోని విరహదుఃఖంపుబరువు
తీరు టెట్లు నా కేని మయూరికేని !

# ప్ర భా త గీ తి

విరహబాష్పతుషారమ్ము గురిసి కురిసి
కను మొగిడ్చెను హేమంతకాలరాత్రి
జీవచైత్రప్రభాత వంశీరవమ్ము
మ్రోగుచుండ రోదసి మూలమూలలందు.

సప్తరథ్యప్రయాణ హేషారవమ్ము
సాగె తూరుపు పైడిమోసాలప్రోల.
నరుల నుపేక్షించు తృణకణాంతరహిమాశ్రు
కణములపై నీ బాంధవుకరము సోకె.
ఓ విషాదప్రపంచయాత్రావిరాగి!
ఓ నిరాశాపథైక పురాణపాంథ!
ఓ ప్రవాసదుఃఖాశ్రుపరిమ్లానమూర్తి!

రేయి కాటుకకనుల జారిన విషాద
బాష్పవారి నొకేసారి పారబోసి
యీమధుప్రాతరాహ్వాన సామగాన
మంచు మోయు జీవనపాత్రి నించుకొమ్ము.

పూవుపూవున తావి గుబుల్కొనంగ
పూలవన మెల్ల నిలువున పులకరింప
కాదముతెమ్మెరపిల్ల వ్రగోలి తోడ
పులుగుగొంతుక పాటరెక్కల విదల్చె.
అణుగణువుగూడ శుభగీతు లాలపించు
వందనోత్సవమందిరాళిందసీమ
నిరవగళమ్ముతో నీవు నిలువరాదు

భూతకాలదినాంతానుభూతితోడ
భావియుగముల కల్యాణపథము బట్టి
వెలుగునీడల జీవనవేణు వూది
పాడుకొనుమ, యీనాటిప్రభాతగీతి !

## ఆషాఢ మేఘము

ఏవిరహార్తుడేని హృదయేశ్వరి సన్నిధి కేగ జాలు వా
ర్తావహు గోరి యోగిరికోనికంబతటమ్మున నేని చిక్కి, వా
పోవుచు నుండెనేమొ యని, పొంచి దెసల్ పరికించి చూచుచు
న్నావె ప్రవాసదుఃఖిగమనప్రకరణోత్సవమా, పయోదమా !

ఈయచలేంద్రుకొండల ధరించినమేలిహారంగునీలిపా
గా యటు, వేగుజోక చిరుగాలికి నట్టిటు లూగుచున్ననన్
నాయెద కాళిదాసకవినాటి యొకానొక యక్షవేదనా
ఖ్యాయిక జ్ఞప్తివారి కరుణార్ద్రమగున్ స్వగతానుభూతికన్.

లే దలనాటియుజ్జయిని, లే దలకానగరీప్రయాణస
మ్మోదము, లేదు ప్రేమధురముగ్ధుడు నాటిగిరిప్రవాసి, భా
నూదయచిత్రితేంద్రధనురుజ్జ్వలమూర్తివి నీవె నాటిమ
ర్యాద ప్రవాసిబాంధవుడవై కనుపించెదవోయి నేటికిన్.

తరుణీదూరులు, ప్రేమజీవనదరిద్రాణుల్, నభోమాసశా
తరుతాదీనుల దుఃఖబాష్పకణముక్తాపాళి వార్తాక్షరో
త్కరముం బోలె వహించి, యంబరపథాంతర్నిత్యయాత్రాధురం
ధరతన్ మానవు నేటికిన్ ప్రణయదౌత్యం బీవు మేఘోత్తమా !

తొలకరిపాటపాట జడితుంపరలన్ వయిపై గ్రసింపగా
డలచి, బలాకలున్ కలరుతమ్ముల నావెలి నీకు స్వాగతో

క్షులు పచరించుచున్న వవిగో! తడిముక్కు పాలా తావులం
గలసిన పైరగాలి తరగల్ చల్లచల్లగ సేద దేర్చుగన్.
కౌటుకలేనిపోగ తెలిగన్నుల ముత్తెపుటల్లు జాలుక
న్నిటికి తాలజాలు కుచనిగ్గుణహారకణ లూనగా, ఏపం
బాటువగన్ పనం గనెదు భామల పాటనతే ప్రాపటన్
నీటుగ తీర్చి దిద్దావు నీతొలినీటి మెరుంగు ముత్తెముల్.
నీ యుతనీ ప్రసూనగవనీ ఘన నాకృతి నపడు నగ్గు క
ద్దోయికి కావరా, దగంధూపసుగంధిల మాపిరియావినీ
లాయితకేశపాశము హృదంకితమై వలపుంగిలల్ కనం
బోయెడు నారి యిప్పటిఘనుల్ నవనాగరకత్వకింకరుల్.
మాసిన వాసనా మధురిమ సుస్మిల భౌతిక తుష్ణజీవన
ప్రాసవు మీరలన్ గడచి రాని తలంపుల బోవు ప్రేమస
హ్యాదుల నీరసంపు హృదయంబుల కేమిటికిచ్చ దీనభో
మానసిరీక్షలున్, కరవామాధురులున్, దయిశాస్త్రప్రవృత్తులున్

# శ్రీ నోరి నరసింహ శాస్త్రి

## అర్ధబిందు స్తవము

అల్ల రాముఁడు నిన్నుఁ గరాబ్జములను
ధనువుగాఁ బూని రక్షోవధం బొనర్చెఁ
బార్థుఁడు లభించె నీదయఁ బాశుపతము
శత్రుసంహారరూప, నిన్ సంస్తుతింతు!
చైత్రియా శ్రోత్సుకత చేసు స్మరుఁడు నీదు
ఘనమహత్త్వ మెఱింగియే కాద స్త్రీల

ఫాలభ్రూవల్లు లుద్ధరించుబాణములుగఁ
జళిపి, మానవకోటిపై జయముఁ గాంచు.
కఠినదంత నఖక్షతాకార ఘనుడు
సంగవాధరకుచసీమలందు రతుల
నీమనోహరమూర్తి వర్ణింపఁ దరమె—
మారశృంగారరస దైవమూర్తి వీవు!
శీతల జ్యోత్స్న లెల్లెడఁ జిమ్మి జగతి
సాంధ్యము హరించి శోభామహత్త్వ మెరిగి
ఈశుఁడే నిన్నుఁ దలఁ దాల్చె నింక మాదు
నల్పవినుతులు నీ కేల యర్థింప!

## కృష్ణవేణి

ఈయాషాఢ నవాంబువాహఘటలతో నేకత్రముత్తింగల్పి త
ల్లీ, యీరీతిగ నిత్యయౌవనసుధాశ్రీరంగ మాలాపనల్
చేయం జాలితి వెన్ని మాఱు లిటులన్ జీర్ణించు నాబోంట్లకున్
ప్రాణం బింత చిగుర్ప నేర్పితివె అంబా, కృష్ణవేణీనదీ!
విన్నా మొన్నటిదాక నెండఁబడి యెంతే జాలిగా జాలుగా
ఉన్నా వోపిక లేక నాకు తెలసె, ఒక్కు-మ్రాడిన్ నేడు సం
పన్నార్భీయ మహాప్రవాహమున నివ్వాలాడుచున్నావు, నే
నిన్నీనాడును పోలి పొంగగల నంటే తల్లి, కృష్ణాపగా!
నీ కూలంకషవాఃప్రపూరమున నెన్నే బిందువుల్ కల్గునో
నీ కన్నెర్రవయున్నవే దటవె, వీనిం బోలు షట్త్రింశకున్
వాకల్ కట్టుచు పొంగిపొంగి మరలన్ వర్షంబు వర్షంబునన్
నీ కౌమారము నాటదే, యీతడో క్షీణించెం గదే అమ్మాడే!

నీకల్లోలకరాబ్జసంతతుల కొనిం దాకవే చల్లగా
నా కాయంబును మంచు తేల్చవె త్వదంభశ్శీకరాసార ధా
రా కేళిక, తనియింపనే శ్రవణముల్ గాంధర్వ సంపత్తిచే,
నా కౌమార మిగిల్చి నిల్పగదె కృష్ణామాత, జన్మాంతమున్.

## దీపావళి

కారుచీకటులు క్రమ్మి జగమ్మున కన్నులు కానని వేళన్
దీపావళి దేదీప్యమానముగ దీపించెను నీ వేళన్.
ధారుణిలో గల ధర్మదీపముల నార్చినవారీ యసురుల్
అన్యాయంబున నంధకర్దముం బారోపించిరి యసురుల్.
నిరత విమ్రశిత నిండి వెలింగెడి నీతిన్యాయకృతి కాంతుల్
చేసె నిరంతరనీహారావృతి నిస్తేజము లయ్యె నెంతో.
ధర్మచ్యుత మగుధాత్రీస్థలిలో ధర్మరూప మెటు కాంతుము!
దీపించని బహుదీపజాలముల దీపావళి యెటు కాంతున్!
ధళధళలాడగ ధర్మఖడ్గమును ధరింపెద నది యెప్పుడో
ధర నన్యాయపు తమసచ్ఛటలను దళనము చేసెద నెప్పుడో!
ధర్మహీన మా ధాత్రీస్థలిలో ధర్మస్థాపన మరలున్
దీపావళిలో దిక్తతు లెల్ల నుద్దీపించెదవా మరలన్!

## శరణాగతి

కన్నులంతరింగెడి మేన సైకతమ్ము క్రమ్మ
హృదయమ్ము చలించి క్షోభించె పెదవు లెండె
చేర నిను శరణార్థినై సింధురాజ,
దిక్కు లేనియనాధు దీనజనుడు!

కాయము హిమమటు క్రిమ్మగ శైత్యము
గళమున భరమై కఫ మెక్కంగా
కంఠగతంబై ప్రాణపంచకము
కడపటివేదన పడుచుండన్:

అవసానక్షణ మరుదెంచిన దని
ఆంగిటనుంచితి తులసీతీర్థము
నారాయణవిభు నామోచ్చారణ
నాటితి చెవులను తల్లీ!

ఆసన్న ప్రాణావసానులకు
ఆప్తుల యప్పటి యాఘోషములు
అశుభావహములు నఘదాయకములు
అని పలుకుదు వెపుడమ్మా!

భవదాదేశ స్వర్ణాక్షరముల
భావవీధి గాఢాంకిత మగుటను
అతియత్నంబున నార్ద్రతర హృత్పు
డాగిటి పెట్టిలో తల్లీ!

నీపవిత్రతర నిర్మలదేహ వి
నిర్గతమై జీవాత్మ వెడలగా
నీపవిత్రతర నిర్మలదేహము
నిర్జీవంబై నిలువంగా,
హృదయాబ్జాంతర మెరియించుచు నం
దిముడక లేచెడి శోకజ్వాలలు
ఒక్కసారిగా నుత్సేకింపగ
నుద్ఘోషించితి తల్లీ!

జన్మజన్మముల సంచిత మగు నా
సత్కర్మంబుల సాక్షాద్దేవత
వీజన్మంబున నిలలో భాగ్యం
బీవాక్కై తెచ్చె తల్లీ!

## మధు గీతి

కంటికి మెరసెడి కనకపాత్ర మిది
కన్నులకు కరవులు దీరన్!
యౌవన దీపిక యార్ద్రిత వెలిగెడి
అందములోన నీహేలాగ్ని!

కణకణలాడెడి కావు చిచ్చువలె
కాదంబరి యిది కమ్రంబు,
పొడిచిన బుసబుస పొంగెడి రక్తము
పోలుపు గలది యీవారుణము!

ఎర్రనిపువ్వుల వెన్నెల న్నిటినో
పరి చిదిమినది యీమదిర,
పంచబాణముల చంచలరసముల
వంచుకున్న దీమధుమధువు!

ఎగురుచు చిందెడి ఈమధుచషకము
నెర్రని పెదవుల ముద్దిడుమా,
చక్కిలిగింతల శరీర మంతయు
సంచలింప నీమధురసముఁగా!
కాలఘాత మటు సూటిగ హృదయము
చూడి పోవని సుమమధుపున్,

నరనరమ్ముల బలు ఛురికధారవలె
నరకఁగ నిమ్మానవమధువుల్ !

తటములు పొంగిన తామ్రపర్ణివలె
ధరింపు కుక్షిని ఈమదిరన్
ఉదయభాను ఖరపదంబు తమమటు
విదల్పు జడిమము మధుధారన్ !

# శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ

## సంధ్య వార్పు

సంధ్య వార్పంగ రాదు - కాలంబు - సంధ్య మయి పోవు లేదు
వింధ్యహిమగిరుల దాటి - అర్ఘ్యంబు - నెల్లువలు పారనిందు...పల్లవి
కటిక చీకటి మూసెను - గుడ్డినవ్వు - కప్పు తెల్లడ దీసెను
చిటుకలో తూర్పుమింట - వెలతేం - చిత్తరువులను వ్రాసెను.
చంద్రబింబాలకు - పోటి - ఆరాము - సంద్రగొడ్డలికి సాటి,
తింత్రించి పగము పొడిచి - సూర్యుండు - తేజరిలె నిద్ర దాటి.
మంత్రనినదంబులోడ - మూర్తొన్నరని - పంత్రములు మనల గూడ,
సాంద్రప్రణవన్వనులకు - దిశ లెల్ల - సభయముగ తిరిగి చూడ.
మరచిపోయినమంత్రము - జ్ఞాపించు - తరణితేజో మంత్రము;
స్థిరము అగుచిత్రములతో - మన మిపుడు - చేసినదిదే తంత్రము.

## పెనుగొండ కొండ

పెనుగొండ కొండ - ఈ పెనుగొండ కొండ...పల్లవి ..
దనినవాభుల తెనుగుకత్తులు - సాన పెట్టినబండ (ఈ పెను) అను...
రంధ్రిముల ప్రవహించుతురకల రక్తధారలు త్రాగి త్రేచిన,
ఆంధ్రకన్నడ రాజ్యలక్ష్ముల ఆరతినీలపుదంప - (ఈ పెను)
వెరవు తెరుగని బిరుదువదకల - విజయనగరపు రాచకొడుకులు
పొరలబోయుగ కరుడు గట్టిన - పచ్చినెత్తురుకండ (ఈ పెను)
తిరుమ తేంద్రుని కీర్తికెసెలు - చెరని దించిన కాపురవనవు
నిరుపమప్రాకారసంములు - నిండి తొలకుకుంద (ఈ పెను)

## ముసలి వైణికుడు

కలహాకోలాహలముల సౌఖ్యంబు చెడిన
భావవృద్ధుని నను బలవంతపరిచి
పెండ్లియింటికచ్చేరికి పిలుతు రేల?

మద్దెలలసద్దులను మెచ్చు మరగినట్టి
యీ విశాలసౌధంబుల మిద్దె లెల్ల
నాదసుకుమారి నా సవీణామతల్లి
నాత్మసంగీతమును చవి చూడగలదె?

ఒడలు కంపించు సాధన కోర్వ లేదు;
సాధువాదంపు రసికుల సైప లేదు;
మూగపలుకుల భావంపుసోగ తెలిసి
పులకరించెడుమనసుల గలదుగాని;
మధురమధురాగమునకు నాముద్దువీణ
జీవతంత్రుల బలిమి ద్రెంచికొన లేదు.
పెండ్లికచ్చేరికై నన్ను బిలుతు రేల?

## ప్రబంధకవి

ఇంత వృద్ధుడ వంతయు నెరిగినావు,
తెలిసికోజాల వేమి మా తెలివిలేమి!
అర్థమే కాని పద్యము లల్ల నేల?
వీధివీధుల వినువారి వెదక నేల?

అద్భుతేటలు కాళిందునట్టి మహాత్మ
[illegible] నాన్ను గలదె?

పూత లేనట్టి వ్రాతలో పొలుపు సొరుగు
కన్ను లెవ్వారి కున్న వీ కాలమందు ?

భావములు క్రుంగి యున్నట్టి బంధములను,
ఆది యంతము లేని నానార్థములను,
నోరు తిరుగని పదముల తీరుపులను
విచ్చి చూపేవు గాని నీ వెంట దిరిగి
తెలిసికొన మాకు బ్రదుకులో తీరి కేది ?
మరచిపోయిన జ్ఞాపించుమార్గ మేది ?

## శ్రీ పింగళి - కాటూరి వారు

## భి క్షా గ మ న ము

(సౌందరనందములో)

ఉడురాజోపలఘట్టనాసుభగమై యుద్యానమున్ జుంబించు మేల్
పడకింటన్ లలితోపభోగకలనాపారీణుడై నందు డా
మదవిన్ గూడి యి టున్న వేళ, బిరబిరన్ మధ్యాహ్నభిక్షార్థియై
గడపన్ మెట్టినగౌతముండు 'మను భిక్షాం దేహి' యన్ వాకునన్.

అనుజన్మాంతరపథం బటంచు మది నెయ్యం బూనునో, లోనికిన్
జనునో, నెమ్మొగ మెత్తి కన్గొనునొ నిన్నం గుండు శాక్యర్షి ని
ల్చెను దద్దేహళి నన్యగేహములలో లెన్ రప్పు పాటంత, పో
రెను దారిం బడి 'యస్తి నాస్తి' యనుప లెక్కిందున్ వినన్ రామిచేన్,

అగురుగంధము నులోద్దుగ పూలపిండితో
[illegible]

కోన్నతుడట్టి, యిట్లు నిలయోపగతుండయి భిక్ష వేడి, యు
న్నన్న మరే మనన్ - మగిడెనట్టి. చెలీ, కను, నా సుభాగ్యతన్!

ఎంత ప్రమాదము వుట్టెన్
కాంతా! నన్నుపకరింపగదె, పూజ్యుం డతి
క్రాంతుడగు మున్న చని ప్రా
ర్థింతున్ బాదముల వ్రాలి, తెచ్చెద మగుడన్.

అని సరసీజకళ్ళు మగనంజలి పట్టి యనుజ్ఞ వేడు కాం
తుని గని, వెచ్చ నూర్చి, సకలో యాజచారుపిలోచనమ్ములన్
దొనదొన బాష్పముల్ దొరగ, దొయ్యలి తన్నెడబాసి యేగెడే
యని మొయితీవ తూలె, ప్రియు నక్కున వ్రాలి సగద్గదమ్ముగన్

ప్రాణనాథ! నానిధానమ్మ! నాదు
కంఠహారమ్మ! నాకనుంగవ వెలుంగ!
గురుచరణసేవ గావింప నరుగునిన్ను
నెట్లు వారింతు, గాక నిన్నెట్లు పనుతు?

అనుకొనినట్టి యీపిచ్చి మనిక్కు! తారసిలెన్ గదా! ప్రియా!
మునసు వశమ్ము గాక పలుమారు పదంబుల శంక చేసినన్,
జని యాటనే విలంబనము పొంపకుమా! యిట మున్నయట్లు నా
యనుగ! విశేషకమ్ము తడియారకమున్ జనుదేర గావలెన్.

పలుకబడి నింతలో నేగి వచ్చితేని
విడని గోర్వెచ్చ కౌగిలివిందు, ముద్దు
దొంతరలు, దొంతరల ముద్దు—, లింత యోల
కొసపించెద నాయనుగ్రహమహమ్ము.

అని యనురాగలాలనము లారగ, గూరిమిమేర యైన చం
దనఘనసారగంధకలనా కమనీయగృహోపగూహ బం
ధన మొంటు లెట్లొ విప్పియును, దన్నెడవీడగ లేక, వేణువి
ధ్వనమధురోక్తి వేడుచెలువన్ ప్రియు డల్లన బుజ్జగించుచున్.

# శ్రీ మంగిపూడి పురుషోత్తమ శర్మ

## కోయిల

తొగరు జిగి తేరు నునుమావియిగురుకొనలం
కెరలి కుత్తుకబంటిగాఁ గొరికి తినుచు
తద్దయును రేగు క్రమగీతానుగలను,
కూయుచును పాడు కోయిలకొలము నాది.

నాకులస్వామి నిఖిలరసైకభూమి
దివ్యయౌవన మాంగల్య దీపరేఖ
కువలయానంద జీవనోత్సవ విధాయి
శ్రీవసంతుండు ఋతురాజశేఖరుండు.

నా నెలవు నిత్యవికచద్రవనూనమధుప
గాన ముఖరితమహోద్యానసీమ.

నా యనంత చైత్రమున నేనాత్మ సుభగ
తరళ సురభిళ వాతపోతములె కాని
పుడమి వడకించు చలిగాడ్పు నెఱియబోదు.

లేవు నానీలనభమున లేశమైన
లోకమును బిట్టు ముంచి చీకాకుపరచు
నిబిడనీరంధ్ర పుష్కలనీరదములు.

నవనవోజ్జ్వలాయితములౌ నా యుపాంగ
ణముల నలపదు మలినమౌ తిమిరరేఖ.

నా నవారుణ వారుణీ శోణనేత్ర
కోణముల నశ్రుకణములు కూడ నెపుడు.
గద్గదిక లేదు నామూర్తగళమునందు.

కలదు నాకల కోకిల గానమందు
జగతి నడిపించు వైద్యుతిజ్వాల యొందు.

భువియె నందనవనముగా మొగులుకొనగ
మానవుడె దివ్యతేజిగా మసలుకొనగ
బ్రతుకె రసపూరపటుగాన బంధురముగ
పాటయే జీవనపు తేనెయూట గాగ
భావ మాధురి నాజాతిపాట తెరగు;
బ్రతుకు మీటుటే నాగానపాటవోరగు.

## శిల్పి

యుగయుగమ్ములుగా నొక్కదారాజ సేసి
నరుని నిర్మించినాడు విన్ననువు మెరయ
మృణ్మయమునుండి రేఖలు మేలుకొలిపి
బ్రహ్మ తనప్రతిరూపంబు పరిణతముగ.

నరుడు బ్రహ్మర తనమహోన్నతగభీర
పూర్ణసత్యమ్ము నీక్షించుపూనికతోడ
ఏండ్లుపూండ్లునుగా తపియించి భూరి
తేజ మానందబ్రహ్మమూర్తి రచించె.

తనపనికి సఫలంబౌట ధన్యుడనని
తనివి నని బ్రహ్మలోన సంతసము మీరె;
తనయునల్పసుశిల్పసౌందర్య మరసి
ముగ్ధుడై దివ్యవిస్మృతి మునిగె నరుడు.

## స్వేచ్ఛా గానము

నాతనువు కర్మకోపల సద్ధనద్య
రాజపరిస్ఫుటాయఃపంజరాంతరమున
శృంఖలాబద్ధమై కృశియించుచుండు.
నామది విహాయసపథమ్ము నధిగమించి
దిక్చక్రమును దాటి యుష్ణకద్వీపములను
నిత్యస్వేచ్ఛావిహారియై నెగడుచుండు.

నాకనులు తారకాకిరణప్రసార
మును చేరగ రాని గాఢతమోవృతములు;
కాని మాహాత్మ్యదివ్యప్రకాశపుంజ
నవనవోన్మేషమై వెల్గు నాహృదయము.

వీను లమృతఘటులంబోలు వీచవండ
నాదికాంతిరస్ఫురణాభిమూతి
ముల కనుక్షణమును నిర మొగ్గవలయు;
విన విశ్వజననీ కరుణార్ద్రమధుర
లోలదృక్కాంతి కాంచాటలాలితుండ.

కొలిచి దినమును నా కేడు కూడు కుక్క
లైన ముట్టని హేయపదార్థచయము;
నారసన చవిచూచెడునది నితాంత
షడ్రసాతీతమధురరసాయనమ్ము.

నాశరము క్రూరనిశితకంటకకిరీట
పరిపీడిత; మైనశిరీషరతధాత్రి
కరుణాకరగాఢసంస్పర్శ ధన్యతమము.

నారొదలు దన్ని క్రుస్సి నా నాట శల్య
శేష మైనను లోన విశిష్టవిమల
దివ్యకాంతిమయామర దేహ మొందు
దినదిన ప్రవర్ధమానమై తేజరిల్లు.

# శ్రీ భమిడిపాటి రామ సోమయాజి

## నా పాట

గొంతు పోయి స్వరమ్ము రవంత రాని
పైకి తెలువడకున్నను పాడుచుంటి;
మూగనైనంతమాత్రాన మొరల వినవొ?
వినిన మానిన నేను మానను ర స్వామి!

ఈమహోన్నత పర్వతభూమిలోన
వెలుగెరుంగనిలోయలో, శిలలపైని,
హోరనుచు పాడు పెలరేటి యొడ్డునందు,
కాల మెరుగక పాడుకోగలను స్వామి!

అంతమే లేని నా పాటయందు జగము
లీనమైపోవు; నీవును లీన మగుదు:
ఈశరీరమె రాలెద రేమొ; దాని
విడుతు, పాటనుమాత్రము విడ స్వామి!

చుక్క లన్నియు నీ రయి, సూర్యచంద్రు
లాకసముతోడ గరగి నాయందె కలతు
రప్పటికినైన నీ పాట నాపబోను;
[illegible] స్వామి!

## ఏ మున్నదే?

ఒకసారి నిను జూచి ఉప్పొంగి పోయేను,
ఒకసారి నిను తిట్టి ఉసురోసుకున్నాను,
మాటాడ వని యెంతో మరగి పోతున్నాను,
చెపితివా హాయిగా చెవులార వింటాను;
మబ్బులో నే మున్నదే, ఓచినుక,
మబ్బులో నే మున్నదే?

లిలో తేలేవు, గగనాన నిలచేవు,
ఉరుములో నురికేవు, మెరపులో మెరసేవు;
మెరుపులో నే మున్నదే, ఓచినుక,
ఉరుములో నే మున్నదే!

తళుకంచు వరిచేను తలలపై హాడేవు,
శిలలపై పరుగుత్తు సెలయేట పాడేవు:
నిలు వెల్ల పులకలై కలగిపోయేలాగు
నిలుచున్న నను జూచి వలచి పైబడ్డావు:
నీలోన నే మున్నదే, ఓచినుక,
నాలోన నే మున్నదే?

నీతోడ నేగూడ నీలమేఘా లెక్కి,
నీతోడ నేగూడ నేలపై దిగజారి,
పూలలో, చేలలో, వనములో, వనధిలో
పాట పాడగ వీలుపడ దటే చెప్పవే,
ఆటంకమే మున్నదే, ఓ చినుక,
అంతు తెల్పు మున్నదే!

# నీ వెవ్వరో కృపాబ్ధి!

"తీరని కోరికల్, నిదుర దేరని నీ కనుఱెప్ప నీడలం
జేరి, నిరాశచే గరగి నీ రగుచున్నవి; మందహాస రే
ఖా రహితమ్ములై పెదవికాంతులు పేదరికమ్ము నొందెఁ; ఈ
తూరుపు సంజ లేవెలుఁగు దోవల బట్టెరి వేల కోమలీ!

ఆలలితాస్య కోమలనవాబ్జము రీతిని వాడియున్న, ఈ
పూలసరమ్ము చేత గొంపోవుచు, నొంటిగ నిర్జనప్రదే
శాలకు, సందెచీకటులచాటున నెవ్వనికోస మిట్లు వి
హ్వలచిత్తవై పయన మైతివి చెప్పు గదమ్మ కోమలీ!"

"కనికరపునీడ కర వైనకరుణ శాలి
లోకమందున నీ వెవ్వరో కృపాబ్ధి!
అదిగొ, యాలింపు నవ్యదివ్యామృతముల
వెల్లువల జిమ్ము నాథుని వేణుగీతి!"

"ఈ పృథివీతలమ్ము నిమిరించిన చల్లనిమాపులందు ల
జ్జా పరిపూరితాత్మ నొకసారి యురమ్మున వీణ వాని సౌ
ధోపరికాంతసీమ వెదయూరువుతో శ్రుతి చేయునంతలో
నైవగరాని మంజులరసస్వరవేణుసుధల్వినంబడున్.

"అప్పుడు వేణుగానవశసాంతరసుల్ మెయి సోకి, పావన
ప్రేమతరంగము ల్పులకరించి మనంబున పొంగిపోవ, ఆ
శ్యామలమూర్తిదివ్యచరణాంబుజ సేవకు, ఈ వసంతసం
ధ్యామలవీధుల స్వదములాడుచు పోవుచునుంటి నొంటినై."

# భయము నా కేల?

ప్రవిమలానంద మందానిల ప్రశాంత,
శీతలోర్మికాడోలికావ్రాతమందు,
మధురహేమంత చంద్రికామానగిరి
సాగి దెస లంట సుయ్యాల లూగు నపుడు!

విశ్వగర్భాన కార్చిచ్చు వడలు తీవ్ర
శోకదావాగ్ని, పరవశాత్మైక్యస్ఫూర్తి,
చల్లనై, కన్ను లరమోడ్చి, శాంతదివ్య
ప్రకృతి మంజులగాన ప్రసరిలోన
మునిగి పడి శేక కొట్టుకపోవు నపుడు!

అతిశరోదారు డీశ్వరు నభయహస్త
మృదులసిరిదదశముల మేను మరచి
సృష్టి పవిపావరయి నిద్దురించు నపుడు!
దర్రినై, జేలనై, విలపించి పోవ
భయము నా కేల ఇంతవిశ్వమ్ములోన!

# శ్రీ భారతుల మార్కండేయ శర్మ

## నేమి ధ్వని

ఔ నా హోయి రథీ, ప్రయాణము సగంబయ్యెన్; నిదాఘాంశుధా
రాశైత్యము సొక్కి దద్దరిలి నిద్రాముద్ర వీడెన; గతా
ధ్వాశైశాంతికదూరదేశముల కన్నారన్ విలోకించి నీ
అనాళ్యం దలపోసితో, వలన తీయాం జూచెదో తప్పదో!

చివురుంగేలు కదల్చి హాస్యము పచించెన్ సల్లెపూవోట; కా
దవుల స్వాచ్ఛితి; గర్వపర్వతనుమీాడ న్నిక్కి గుర్తింప జా
లవు రాబోలు; ప్రవాళి విప్పి పుసతో లజ్జాశ్రువున్ దాల్చు దు
గ్గవసీప్రాకృతగర్తసీముల మెలంగంగా ప్రయాణించుటన్.

వలకేని న్విను మాటమాటకరుసన్ వాగ్రత్తు: పర్వ్వాత్తు గు
బ్బలిజా లోప్ల కలపూర్వదేశసవద ప్రజ్ఞానరుల్ సైకత
స్థలుల న్మాత్రయశ యుండ జూడ; నచలోద్వృప్రస్థరాధారతన్
పులినంబుల్ రచియించ జూచె; దెస డోపు నీతనుసేం దూకగా.

గురి గోల్పోయినధన్విబాణమవు; నీకుంబోలె మా కట్టు చే
కురు కేల్సాచి దివిం గ్రహింప అల చెక్కుల్ స్పృశులం గూర్చి వెం
దుర కుల్లాసినిగా ద్వితీయశశి కాదో? పారిజాతాధరం
ధరతన్ లోకము ముంచికొందో? ఎటులైన న్నియతిత్వం బికా?

గతుకుల్ గోతులు దాటి కీర్పు సడలంగా నడ్చి అప్పై మహో
న్నతగోత్రాగ్రసమస్థలంబునన ఉండం గోరె నీ స్యందన
స్థితి గాలింబలె శీతరంగల విశేషవ్యస్తమై; నిల్చు అ
ల్ప లతిల్లిల మొరంగి పోవు; ఎటులే స్వస్థుండ నైతందుచే.

ఏలా కన్గవ చేవురింప దిశ లన్వేషింతు ? నీపై ప్రపం
చాలోలానిలరంహతిన్ వెలుఁగ దీపాంకూరము న్నిల్పి, ఈ
త్రాలోల్లోలలయప్రవాహము కటీం దాటించునా అంచు ఆ
లోలిం దూలెను; కేటిదాక సుఖముం జూరాడుటల్ చాలవే ?

## కా ల స్మృ తి

అదిగో, అయ్యదిగో, అవం గనులు కాయల్ గాదు; ఎద్దాని కే
దెదు; నైసర్గిక కార్యసంకలన నీచే బద్ధవిభ్యాదు లెం
చదవో ? కాల ప్రతిప్రశాంతిసృజనాశీర్వ్వనలిం జూచి నా
యది; నాకై తరిపేచియున్న దనియుల్ వ్యాసంగముం జేయుదో!

సుకృతివి పారవశ్యమయశుద్ధి గడించెను నీగుణాలి, కొం
డక తిని వ్రాసి కట్టితివి చాలద ? కావ్యవిచిత్రచిత్రణ
ప్రకరము నీవ యాటకు దివస్పృథువుల్ మూడెకట్టి పెట్టి ఊ
రక చెడిపోయె; దిమ్మెరదము రాగల కైచిఖకవృత్తసంగతుల్.

ఓయి అమాయికా, నవనవోదితసృష్టిబడిన్ ప్రతిప్రఘా
తాయుతసీమల న్నిలిచి అర్పును పెద్దయెలుంగు పెట్టి; ఓ
రా, యనుకొన్న చెర్వగును స్వాంతము; నీమరదృష్టరేఖ ముం
దై అరరి న్నగించె; ఇక సారయు పొందడొక ద్వాఃప్రఘాణమున్.

రాకాచంద్రికవోలె కైరవదళప్రస్ఫీతపల్యంక ని
ద్రా కౌతూహలివై సమాధిపరకోదః ప్రాభవం బూని దో
యీ, కాడాడిగ; కే, దవుడ్వడగ పోయించెన్ దమర్వాద లిం
కే కాలార్థ్వగు; డాగ డొక్కనిముసంజేం న్నవత్యాప్రుడై.

చరమశ్లోక మొకండు నీయెడద జెప్పన్ రూపుగొన్నట్టి దు
ర్వారమానుష్యకవ్యాప్రదవాక్యముల విప్పం జాలినేపైన దే
ది రచింపన్ బనిలేదానుకో"; మ్మనలు నేకృత్యంబు ఘోషించు నెన్
దెరయై; తాన నిజప్రభావమును వర్ణింపించుకో గల్గెడిన్.

## రవి బాబూ!

హృదయప్రహారముగ ఎటు వచ్చి పోయితివో ?
ఎదను గుర్తింప లే దింకను శిశుర్వ మట-
నిదురలో తూగుచుంటిని రవీంద్రకవీంద్ర,
ఇద మిత్ర మందు గుర్తింపలే నైతి నట-

అంధకారపరీవృతాభీలరాత్రులం
నందించితి ప్రభాతచారుప్రభల జేరి;
ప్రత్యూష సతి చెట్టబట్టి వాహ్యాళిలో
అతూర్యర్జితపథాల అలరించి యుందువు.

నీయాశాకలశాబ్ధి ఈనిఖిలజగము
మునకలెత్తు- ఆత్మజ్వాలన్మణివి బాబు,
ఒకమనోహరగీతినై ఒలసియుంటి;
నేను దత్తానమును గాగ ఇచ్చగింతు.

నీమమతాపూర్ణకవిత విధాతృకృపణత
పో మట్టెడిప్రతికృతి యని నామది నలరుడు
కరుణాశ్రుకలితవిక్రము గృహాశ్రమధర్మ
ములను వాల్మీకి యెప్పుడో వచించె
కర్మవైరాగ్యనిష్కామశౌర్యప్రచా
రమున వ్యాసు డనన్యరక్తి బెంచె

కల్పనానల్ప సంకల్ప కల్పకతరు
చ్ఛాయ భాసుడు స్వర్ణసరణి దీర్చి
ప్రణయకైవల్యద సౌందర్య హాసనా
ర్ద్రీతి కాళిదాసుండు ప్రకృతి జూపె
ఔపనిషదమృత ప్రవాహముల ముంచి
తరచి విశ్వకల్యాణమంత్రము జపింప
జేసి ముక్తి చూపితి: కవిశ్రేష్ఠ, విశ్వ
విజకరాంచల మూర్ధ్ని పుష్పించు శాంతి.

నీరదనంబు లీశ్వరుని వెత్తిన నిల్చిన అర్చనా సుమా
లై విలసిల్లి, కాలగతి నష్టి అసంఖ్యకవిశ్వరీతులా
గానె! ప్రవక్త్రసత్యములుగా వెదజల్లబడుగ రవీంద్ర, నీ
భావ సరిత్ప్రసారణుల భావిమలుమాన్పుల ఇంద్రజాలముల్.

## హా తాత

కులాయసుప్తోత్థితకలకంఠీ కులకాకలీకలకలధ్వనితము
ఉషోగరిగరిజ్జగజ్జనహితాశీషోక్తి సంకలితమంజురాగము
రసలోలుపభృంగరాజసంగీత సుధావిముగ్ధవిహాగతుందిలము
హావీతకుసుమకులవిలసితప్రాతః సుసమయవిశ్వమోహనాలపనము
మధురహూణాంతకరరకమలకోశ శిథిలవినిస్సరత్సుధాపూరము.

ఏమి పని యెవ్వరికి గాని ఈడు పడన
వాడి పూ లేవి? ఇటు త్రుంచి పారవైచి
త్రొక్కి తొంబాడు చేసిరే తొక్కి ఎన్ని
దుల్లి క్రిందబడ్డవి! కటా! కొల్లగొట్టి.

ఈ దవు లూహ్చుకండ్లు; తరు లిట్టటు పొటుగ త్రిప్పి త్రిప్పి ఇ
ట్లాడక పూలు నల్గి నలిగియైనవి ! కొమ్మలం పిచ్చిపిచ్చి ఏ.
రో దవి చూచినారు; హృదయోద్గతభావప్రకణాల పెంచినారు.
నూచినకొమ్మలా ! బెరడు లూప్చినతోదల ! వాగ్రిల్చినాకలా !

పూలబాస తెరింగి పుటలు విప్పి వినంతు
బాడు అరయలదేంట్లనరయనల యివి ?
సందేశములు తెచ్చి మందమారుత మాకు
లకుమధ్య మాట మూల్గంగ నేల ?
నిర్ఝరశీకరోన్మిదగ్రనంభావన
శిగ్రలలో కగ్రిందనా తేల దొరలె ?
పథికపక్షులకు శార్పణ్యరూప పెంరుంగ
కమె యిచ్చు అతిధ్యనియతి రేంద !
తోటలోకి వాగరు లన్న పాటీవార
లేని కాలి లిదంచుంటరో లేద ? మిడికి
మిడుత లైర ! దోహదశక్తి మొదలి-జోకి
రీ అనాథాంధపంగుహీనాయుతములు.

సరలస్వభావకర్షకునాగలితలాన
శ్రిమశీకరార్ద్రితద్రవిణ మడగ
తండ్రికిత్రికి సుతత్యాగమ్ము అగ్రిజా
పత్యాగ్రమాన అత్మబలియు పెంరగ
యువకోద్రహాసప్థ హైందవజాతి ని
ర్మాణవైదేశికపగ్రథయు మాసె
కృష్ణవాంశిక మాధురీవేణికలు కులా
ఫీలయుద్ధాల ఏరూల నాదిగ

ఇది వసాన సంఘటనమ్ము ఆది పురాన
ఎటులు గళరుద్ధగీతి కాన్పతిరో ! ఆకు
లాకులితకోపితస్వరాలాపనము లె !
ఇంక తత్తాన మె ట్లఘోరింపగలదో ?

హృదయవిదారిదృశ్యము కదే యిది; కోకిల, నీదు జీవన
పరిదగళమాధ్వి దాచుకొనుపట్లు వసాన పాలికెక్కె; పొమ్ము వ
న్నిదము గ దేవ నందనవనిం దొగడింపగ నుంటినో అదే
యిది; కడ లేనిన్యాసతగ ఏడ్చు: వరుద్ధలి; ఏల మార్గగా ?

## బ్రహ్మాంజలి

పొరిపొరి గ్రిమ్మచంచలత గుర్రింగుచు శీతమయూఖపూర్ణిమాం
కుర ముదయించు కప్పురపుకోవల నీరము లాడి, మించువా
దర జిలిబిట్టుపచ్చడము దాలిచి వాసకసజ్జికాయిత
స్ఫురణ రహించుచున్నది ప్రభూ, కయిసేతలు చెప్ప నేటికిన్ !

స్వైరపవనపరిఘూర్ణమున జారినమంజులపారిజాతమం
జరుల రచించి నీజలదజాలవినీలవిలాసరేఖ, పై
పారల మిటారముల్ చెరగిపోవగ నీక తమాలవార్షణా
వరణమునందు దాచె; కనవా ప్రభు, దూచెదు ప్రాన్యదృక్కులన్.

విరిసినకల్వతూడిగిలి వేదుల తొల్కరిజల్లులం బరా
మరసము బొంది ఆసురభిమార్గముల న్విడలేక నీకు పూ
మరయుసమీరణాంకురచయంబులతో కుశలంబు లాడి నీ
నిరవధికానుకంపమున నే మని యున్నది నేటికా ప్రభూ !

సరసహరోచిరశకలాకారముల స్వేదజల్లు లందనుం
దరుల గళక్వణమ్ము ప్రియదానలయక్వణనమ్ముతోడ సు
స్వరయుతరాసకేళనము సల్పుచునున్న విధాన దోచి, కా
తుర పిలు వాసియున్నది ప్రిథూ, యమునాపులినప్రసూనరాత్రిం.

విరియుచు నున్న చెంగలువ వేను తుపానున దొప్పదోగి క
ప్పురపుదుమారపు న్వెకదపూరములం బరిపూరితంబులై
తరుణసమీరవారము లుదాత్తల గారియవెట్టు సద్దు నీ
మురళివిరాగగీతికలె మోగినచో త్రిజగంబు లూగవే!

## శ్రీ అన్నమరాజ శర్మ

## కవి జీవితము

కవికుమారుండనై పుట్టుకారణమున
సతతపరిణామకాలవికాలవీధి
స్వీయజీవితకావ్యకర్తృత్వవృత్తి
గాలిచిన్నెలు ముదిగించి కడగుచుందు.

శర్వరీస్వప్నబంధమ్ము సడలిపోవ
నలతినవ్వులు మోములం దలమికొన్న
విచ్చుమొగ్గల నైక్యమై వెగుజాము
పాడుచుందును బాళి విఖ్యాతగీతి.

శ్వసనసంచాలనమున కీసాలయములు
గుసగుసలు వోవ నొంటినై కూరుచుండి
హృదయకావ్యమ్ము నొకమారు తెరచి చూతు
వింత లగుదత్ ప్రబోధముల్ వినెదు శేద్ర.

సమయతూలికఁ స్వర్ణరసంబు గూర్చి
పశ్చిమాశను చిత్రముల్ వ్రాయువేళ,
స్వప్నసీమకు కుసుమగుచ్ఛములు వ్రాల
చెప్పరాని వియోగమ్ము చెందుచుందు.

శ్యామలాకాశవీధి నిశ్శబ్దరాత్రి
గాలులే పాదయము నరికట్టలేక,
పరిశ్రుతి వినగల్గు మృదులనిస్వనము గదుర
స్వర్గదేశవాసులకు సుపన్యసింతు !

నరకమో, త్రిదివంబో మనంబునందె
భావసంవేగభరమున బహుళగతుల
ప్రతిదినమ్ము జీవితావస్థ గనుచు
దుఃఖసమ్మదబాష్పముల్ తొలకరింతు.

## ప్రణయము

ప్రణయిని, గులాబిమొగ్గల బరిహసించు
నీకపోలయుగమ్మున నృత్యమాడు
రక్తిమాంకూరముల రాగరసము జిందు,
విడుతునే నేడు ముద్దుల గడుగకుండ?

రామణీయేందుపాలిత రాత్రియందు,
మాధవీలతాగృహమున మాటు నిలిచి
వీణ సంధించి భావాతివేల మైన
ప్రేమగీతంబు పాడగా వేగరమ్ము.

బొండుమల్లెలతావులు విందుగొనిన
కొండగోనలఁ జరియింపఁ గోర్కె కలదొ,

వనకురంగీవిలోచనా! భయము దక్క-
రమ్ము, నాతోడ ప్రణయసామ్రాజ్యకేళి.
చెలులు లేరందు నంతయు జింత వలదు,
తరళనేత్రిలు హరిణకాంతలు నిరంత
రమ్ము నిను గూడి మోహనారణ్యసీమ
లీలమై నడతెంతు శ్రీశంపాలతాంగి!

లేతమామిడికొమ్మల కూత లిడుచు,
గండుకోయిల జపియించు గానమునకు
గల్పనదొనర్చి యర్థమాల్ కవిని గాన
పాటలాధర, వివరింతు ప్రతిదినంబు.

పలుకులకు భేద మేర్పడక ప్రేమ
రాగముల జిల్కు-పెంపుడోటి రావ మలరు
రమ్యవీక్షాస్థలమ్ము కేరంగ రమ్ము,
అబల, వచియింతు శ్రీకురహాస్య మొందు!

## మీరాబాయి

కరవకోత్సుకభవదీయ బాహుపాశ
మాగిపెనో లేదొ; వలిమంచుప్రొద్దులందు
హృదయనీరాజనమున వెల్గించినట్టి
కప్పురపుదావు లారలే దివ్వటీకని!

ఆత్మసర్వస్వమును హృదయాధినాథు
డైనయదుభూలి కర్పించి, అక్క-టకట!
కంథభోజనికో త్రిధాగ్ని గూలినావు
బ్రతుకుదెరు వెల్ల ముందుకే కాలిపడగ!

విరహావిహ్వలరైయి రాధ వెదకి, వెదకి,
విపిని కోపాన కృష్ణు కపించె, గాని,
మీర, నీ వెంత సుకుమారమతివో
బాష్పధారాభిషిక్తగోపాలు డెరుగు!

మర్మకవితాసుధాస్రవంతిగా శాంతి
మంజులం బైననీ గానము జీవమున,
నీమురువ్యార మెదటికో నెరుగరాదు,
దారి జూపింతు మాంగలితటమునందె.

మృదులరాగాశ్రయ మ్మైత్రవహ్లాద వీణ
నన్నుతంత్రుల భక్తినే యువ్వాయించి
పాడి, భగవల్లీలయొప్పుల బాడుదువన్న
మీర! నీప్రేమమాహాత్మ్యమ్ము మీర గలమె?

నీయుతో గానకథనప్రణోత్సమతిని
పాడుచుండు అరావళీపర్వతాట
నీ దరీఝరీకల కాశ్రుపతతి ముక్త
కంఠమున భక్తిపులకిత గాత్రి మగుచు!

## శ్రీ పంద్యారం సుబ్బయ్య

## వేడికోలు

విరులం గాని పూజ సేతునా
సరముల్ గట్టి బుజాల వేతునా
సరసోక్తుల గీర్తి సేతునా
కరుణార్ద్రాత్మవు గమ్ము శారదా!

పలుభంగుల నందు నీగతిన్
దెలియంజాలితి, తిక్కయజ్వప
లుక్కుల చేత: ఎడందలోన నా
వలనం దృష్టి లవంబు పుట్టదే!

చిగురాకుల వద్దు నాలకిం
చి వినన్ దిక్కులచెంత బోయెదన్
భవదంఘ్రిబద్ధకింకిణీ
రవ మంచాత్మ దలంపు గూరుచున్.

శ్రమ మెంచక యన్నిసీమలన్
గాపుక న్నాపది నన్ను గన్గొనన్
శ్రమ మూడ వచింపు మెందు నీ
విపులాకారము విశ్రమించునో!.

వినుతుం గొని పూజసేతునా
వరముల్ గట్టి బజాన వేతునా
పరస్తోత్రుల కీర్తి సేత నా
కరుణార్ద్రాత్మవు గొమ్ము కారరా!

## సముద్ర గానము

౧

ఇది మహాభూరంజితనిశాంత మిందు నేను
చెవులు తెగగోసికొనినట్లు శిలలు కరగి
పరవశీభావ దొడగిన పాట వింటి

అమృతమయ మైన దాగీత మంతకన్న
సుమధురము నీలసద్గళస్వరము జలధి!

ఇపుడు నీమది నిండెనో యేమొ పొంగి
పొరలుచున్నది. ఏదో మాకుమ్రోగుచున్న
దదియు నీపాటవలె నున్న దట్లు దేని
వెరవి మ్రోగెడునో దాని నెరుగలేము!
భ్రమసి దిక్కుల జూతుము, నేర్పడదు దారి.

౨

సంఘపీడ్రభీతావల్లకి మేళవించి
ఏకతంబున నీవు రో జెల్ల పాడి
చాల నలసితి, వదె గాఢసంతమసము
ఘానభోంతరముల వెంటి బొదుగుచున్న
దో గురూ, నిద్ర గూరు మే జాగరూక
తా సమన్వితహృదయుడవై సమీప
సైకతంబుల సత్కవి స్తన్య మైన
నీరవహోవృత్తి మరయుచు గూకుచుండు.

అటు లుండె శాంతిముగ్ధము
పటీరశీతలమూ నైన ప్రకృతిని నే ను
ద్భుట లాడి మదిని గాంచెద
దటాలున ద్భవత్స్వరూపధావళ్యంబున్.

ఏశుభోదయవేళ నా కింపు గూర్ప
మేలుకొందువొ! వల్లకీ మేళవించి

ఏలలితరాగపుంజము నాలపించి
నీహృదయగుప్తభావము సౌహృదమున
నాకు నెరిగింతువో! ఎప్డు నీకరము
నూతగా నాకు నొసగుదు వాకుచేల!
నీకునై వేచియుందు నిశాకరుండు
కానిపించనిచో కన్నెకలువరీతి.

## ప్రకృతి పరిచితి

నీకమనీయరూపము గణించి పదంపడి నిన్ను జూసి పో
లేక యిటన్ నిలంబడితి లేచి, పరీమళ మానవిమ్ము చిం
తాకులితమ్ము నాదుహృదయ. మ్మట నాదట పొంది పోయి నే
జూ కనుగొంద మోనవనవ్యోజ్జ్వల చారుతరప్రసూనమా!

పొదువృటీరండలో కదు బోలుచు తన్ను
విడిచి నే బోదు నని వెక్కి-వెక్కి యేడ్చె
మంచుకన్నీళ్ళు గార్చు నీమాతృవల్లి
స్వాంతమున శాంతి గూర్పుమా సాగిపోదు!

## శ్రీ తెలికిచర్ల కృష్ణమూర్తి

## కాబోలు!

సరసనంతవ్ర లేమావిచివురుటాకు
[illegible] గొంతెత్తి పాడు[illegible]

కోయిలవిధాన, నునుదీగకొన వసించు
విడివడని మొగ్గలోనుండి వెడలు శ్వేత
కమ్రకావుల బోలు నీకన్నెవలపు
తలపులెల్లను చిన్నపాటలుగ కూర్చి
యాలపింతువు కాబోలు.

మేలిపసిడి
చాలు తొలికించు మైదీవ జవ్వనంపు
తొలిదినమ్ముల దొడిగిన వలపుపూవు
పెదద వికసించి మెలమెల్ల కదల జిమ్ము
పరిణయసౌరభముల తీయదనము గ్రోలి
సంభ్రమాశ్చర్యములతోడ సంతసించు
చుందు కాబోలు—

ఒంటి గూర్చున్న వేళ
ప్రేమపుదలంపు రెక్కల విప్పి యెగసి
తెలిసి తెలియని వింతసీమల యథేచ్ఛ
సంచరించుచు దరహాసచంద్రికలను
జిలుకుచెలికాని యౌవనకళల వెలుగు
మధురమోహనమూర్తిని మది లిఖించు
కొనుచునుందువు కాబోలు—

## రహస్యము

తేటతేనియ దాచిన తీయనైన
వలపుకావుల విరజిమ్ము నలరుకన్నె
చెలిమి సేయంగ వగచుచు లలితమధుర
గీతముల పాడు నలిరాజు చేత మెలగ.

ఆమధురగాన మాలించి యలరు లేమ
తిన్మ్రయతి కేందు, నళిరాజు తన్ను జేర
వరుగుదెంచుచున్నాడు కరుణతోడ
ననుచు తను వెల్ల పులకింప నధికసంభ్ర
మమున గడ తెల్ల పరికించి పడకు, గాని
యెఱుగ డింతకు తనుగూర్చి యెల్లదెసల
పరువు తెత్తుము, వెదకుచు, వలపువాడు
వలకె మదిగోంపోయి యానందవశత
బాడుకొనుచుండె జిలిబిలిపాట లనుచు.

తనజిలుగురేకు మెయి మెత్తదనము, తనయొ
డంద నందారు పేర్మిమకరందరసము
తను గడల జిమ్ముమేంపెక్కానింగ ఫు
నలరుకన్నియ యెఱుగదు —

తెలిసి తెలియ

రాని జిలిబిలిపాటలో లోన నడగు
వరపు తీయదనమ్ముల కలిమి యొకరు
మూరు దెరుగదు— అతిసుకుమారమూర్తి
రైనవిరిచేడె తన ప్రాణ మనుచు మిత్రు
పొద్ద మందును —

మోహనస్వాదు గాన

రసము గురియించు సుందరప్రణయమూర్తి
యళిసుతుడె ప్రాణకాంతుడ టంచు నలరు
బోటి యెప్పుడు —

వలపుటాఁకలి తీఱి నావలెనె మౌన
జీవితమ్ముల నొంటి గృశించు భగ్న
హృదయులకె కాని ఆటగా బ్రతుకు గడపి
కలత నెఱుఁగని సౌఖ్యజీవులకు కావు.

ఈవిరహగీతికలు శోకభారభరము
లివి పఠించిన నీపూవుఁబోఁడి కలఁగు.
అవిరతానందవిలసిత మైన నీదు
జీవితమ్మున నను చింతసేయుచుండు
టెఱుఁగుదును, కాని గాటంపు మఱపుతెరల
నడఁగిపోయిన నాదు నెయ్యంపుఁ గతలు
ఈవిరహశోకగీతి నాలించి యంత
నులికిపడి వేచు మఱపుకత్తులవిధాన.



నేను మరణింతు నేని నన్నే నిరంత
రమ్ము స్మరియించి బాష్పధారలను గురిసి
నీవు విలపింపకుము శోకదేవివోలె
మన ప్రణయమైత్రి యంత మర్త్యమని యెంచి.

సృష్టితొలినుండియును నవిచ్ఛిన్నమైన
మన చిరంతనప్రేమ సంబంధమునకు
నంతరాయము సంప్రాప్త మౌనె నేఁడు
చెడుగుదైవమ్ము విచ్ఛేదచేయు కతన !

## కృతజ్ఞత

ప్రేమవంటిది మరి కానబోదటంచు
ప్రేమచేతనె జగమెల్ల పెరుగు ననుచు
ప్రేమకొరకేమియైన నర్పింతు రనుచు
ప్రేమకోసము ప్రాణముల్ విడుతు రనుచు
ప్రేమ వెలలేని యానందధామ మనుచు
ప్రేమ దేవుని కింకొక నామ మనుచు
ఎన్ని గ్రంథాలు చదివియు నెరుగనైతి;
నీచెలిమి గాదె నెచ్చెలీ! నేటి కిపుడు
నిజముగా ప్రేమ యన నేమొ నేర్చినాడ,
మందబుద్ధి కవినిగా మారినాడ.
బహువిధక్లేశభరిత ప్రపంచమందె
నిరవధిస్వర్గసుఖరుచి నెరిగినాడ
నిర్భరానంద నిర్వాణనియతసుఖము
నిట్టులే యుండు ననుచు నూహించినాడ;
ఇంత పరమోపకారి, నిం కేవిధాన
నీఋణం బేను తీర్పగా నేర్తునొక్కొ!

## ముద్దు పలుకులు

ఏమి రాగమొ? తాళమో? యెఱుగకున్న
పాడుచున్నది తెలియనిపాప యైన
హాయి యనిపింపజే శ్రవణేంద్రియ మునకు
చేత మలరించు భవ్యసంగీత మెపుడు.

కూసిందె కూయుచున్నను కూత కర్థ
మించుకయు బోధపడకున్న నేమి లోటు!
మనసు రంజింపజేయదే? మధురఫణితి
కూజితం బొనరించెడి కోకిలంబు.

పొదలు వెన్నునిపొక్కిటిపువ్వుకొన్ని
వదనమున తొల్త వెలువడ్డ మొదటిపదాల
భావ మెఱుగక రాకున్న పరిమద మిడదె
శ్రుతిహితస్వరశబ్దసంయుతము లనుచు.

పదము లస్పష్ట, మర్థసంపదయు నుంత
కుదురకుండిన నద్దాన కొరత యేమి?
తొట్టిలోపల నున్నమా చిట్టిబుడుల
పుట్టతేనియ కొలుపు లుట్టిపడవె!

# శ్రీ అత్తిలి సూర్యనారాయణ మూర్తి

## మేలుకొలుపు

పిల్లతెమ్మెరపడవలో ఒక
తెల్లవెలుగులపడవ నెక్కి
పల్లవాంగి తేలి వచ్చావే
అల్లరాతిరి ఝల్లు మన్నాది బతుకుబతు కంతా,
ఓమల్లెపూవుల మత్తుదానా!
తెల్లబిరిబూసె పొదయువన మంతా,

పడగ త్రాతెరచాప లెత్తో
ముడవకే ఆగింది యానము
అడుగు తడబడు సడికతో నీ
నడుము జవజవలాడి పోగా
జడలో మల్లెలపూలు జాలుగా
విడిన పెదవుల నవ్వులాడా
కడిమిపూవుల పదును దాగా
ఒడిని వాలితివే!

మేలుకొన్నవి నాది కన్నులు
మేలుకొన్నది నాది కంఠము
మేలుకొన్నా కొత్తలోకంలో
పారిజాతము పరిమళాంగీ,
చేరినది నన్నమృతకలశమ్ము !

## నీవు—నేను

ఏపూవు విరిసినా రేచుక్క మెరిసినా
నీవె నాకై వెలసినా వన్నెభావమే!
వీణతీగల వాలి శ్రేష్ఠ్య ప్రసరించినా
కోమలపరాగమై కుంచె ప్రవహించినా
నీవిలాసము లన్ని నావిందు కనుకొందు.

బహుళపరిమళపూర్ణ పవనమ్ము వీచినా
మెరుపు నిండిన నీలమేఘమ్ము తోచినా
నీవె నాలో వెలుగు భావమ్ము కలుగుతే!

ఆనదక లానృత్య మానాట్యగతులలో.
కరగించు లాస్యాల భరతమును ఆడేరా! ...విన్నాము...
శంభో పదమ్ముల్లో అంభోధి అరచెరా!
కాళ్ళ గజ్జెల మోత కంపించె కులగిరులు! ..విన్నాము...
సంగీతవిద్యలో చక్రవర్తివి నీవు
మహతీ విపంచికా మహనీయ రూపమువు! ...విన్నాము...
సప్తతి శరత్తులే లిప్తలై నడిచెరా!
వాగ్గేయకారకా, ప్రజ్ఞాధురంధరా! ...విన్నాము...

## శ్రీ కర్లపాలెం కృష్ణరావు

## కుమారి

నాకవిత్వాని కందనినవ్యకళలు
హేమలత లయి పూలు పూయించుచుండె,
ఒకమహోత్సాహరథంబందు యొదిగి దిశల
బంచుచుండెను శీతలవాయువీచి.

చూడచూడగ వింతసొబగులు గురియుచు
పగడాలు బందు నావదనమందు
ఉండుండి పలికెడు ఓంకారలలో వేదం
వేదాంతభావముల్ వెల్లివిరియు
ఒకనాటి కోకవాదు ఒకనూత్నభావలో
మాధుర్య మొలికించుమాట లూరు,
ఇంతింతలై శ్రీల సాగబోయుతనులలో
జగముల మేలుకొల్పంగ మెలయు,

అనుదినంబును జూచుసర్వాంగములును
లలితసుస్నిగ్ధ మగుచు విలాస మొసగు
ఆమహాశిల్పి నిర్మించి యువని కంపు
చిత్రముల మేటిచిత్ర పాళికవు కాదె!

ఒక్క పదమేని, మాటేని యూహ సేయ
వలనుపడకున్న, శాసించి నిండుశ్రీల
నన్ను నిర్విణ్ణునిగ జేసినావు తల్లి!
నీకు దీర్ఘాయు రస్తు! సుశ్రీ కుమారి!

ఏండ్లు పూండ్లును జాలునే యింపు లొలుకు
నీదుముఖపద్మమును జూచి మోద మందె?
పనులు పాటలు మరచి యీబ్రతుకె నీకు
అంకితము చేసినాను దివ్యానురక్తి.

## సంశయము

అసలు, నీ వనువాడవు అవతరించి,
ఇంత లోనరించి యుండుట సుంతయేని
సత్యమా! ఏమొ! మా ఋషీశ్వరు లబద్ధ
ములకు తల యొగ్గ రెందు నేకలనమైన.

మును లొసంగిన ఉపదేశములను గ్రోలి,
అమిత విశ్వాసమున వారి ననుసరించి,
ఆచరించితి, కాంచితి ననుభవమున
ఎదియొ సత్యస్వరూప మిం దిమిడియుంట

## మహోదయము

సాధనంబున సమకూరు జయఘటంబు,
పట్టు వీడక నమ్మి నీపాల బడితి
చిక్కియును చిక్కపడ పసితరతిని
నన్ను చిక్కుల బెట్టుచున్నావు నీవు.

ఏటి న్యాయము? దేవా! యిప్పుడు నాకు,
ఇంతకే నీవు నాకు లభించరావ?
అంత శ్రమపడి పొందిన అనుభవమ్ము
సైత మొసగకపోయె నీసహజగుణము.

ప్రేమతో నన్ను లాలించి పెదకొన్న
రాధ కనులనె నీవు కొరగుల్ల జల్లి
మాయలుప్పతి వంట, నామాట కేమి-
అన్నదాతులు నీ కాదరంబని గలరా!

## ఆత్మార్పణము

అర్హ్యమెద్ది త్వదీయ పాదాంబుజములకు?
ఏసుమము లభ్యమౌనో పూజింప ననుచు
ఎంచితిని, తుద ననరి, ఏ మీయగలను!
ఆత్మ నర్పింతు గ్రహియింపు మమరనాథ!

అమృతలావణ్యమూర్తి! నిన్ను సుస్థిరముగ
హృదయకలమునన్ ప్రతిష్ఠించుకొంటి.
అలరింపుము నామొర భాగ్యంబు
విలసిల్లును స్వామి! అమరలింగేశ, నన్ను.

అరుగుదెంచితి నీసేవ కతిరయాన
ధన్యతముడను భవదీయసన్నిధమున,
వదలి పోనిక నన్ను గాపాడకున్న
అమరలింగేశ! ఆత్మార్పణంబు నీకు.

ఎవరి కేదుఃఖమైనను నెప్పుడైన
దర్శనము జేసి నిలుచ నీధ్యానమందు
కరుణతో నాదుకొని వారి గాచువంట-
అమరలింగేశ! నాపూజ లందుకొనుము!

శివు డనుచు, రాము డనుచును శ్రీధరుండ
టంచు, నీశ్వర భక్తాళి యనుచు నుగ్రు
సర్వమతముల మిళిత మహాపార మూర్తి!
అమరలింగేశ! ఆత్మార్పణంబు నీకు.

చూచి చూడనియట్లు నీ వాచియుండ,
దుష్కర్తలయాటలు సాగుచుండె,
కాకపోయిన ప్రళయంబు గలుగకున్నె?
అమరలింగేశ! ఆత్మార్పణంబు నీకు.

అపుడు కవిసార్వభౌము డత్యధిక భక్తి
గొలిచి భవదీయపదములు గెలిచెనేమొ!
అతడు కనకాభిషేకంబు నందె ననగ
నీప్రసన్నతె హేతువు నీలకంఠ!

నాకు, అమరత్వ మిత్తువో! కాక, నరుల
కందగా రానిభోగము లమరజేసి,
ఉన్నయస్వాతంత్ర్య మిచట నే యుండ మనెదో!
ఇష్టవచ్చినగతి ప్రసాదింపు మయ్య!

వాల్గిలి పడులేక శర్వరీ రాగవీథి
పులకరించు సుధాస్వామికలవిపంచి

## హ్రీమతీ!

హ్రీమతీ! నీ వొసంగిన పూలమాల
గళము సంధింపలేను త్రుంచికొనలేను
ఇంతసంతాప మింతఆహ్లాద మొసగి
ఏప్రణయశక్తి నేమి సాధింతు వబల!

నే నెఱుంగుదు జన్మజన్మాంతరము
నీవు నాదానవే, యుగాభ్యుదయవేళ
సత్యవంతుడ నేను సావిత్రి నీవు-
మృత్యుగళమున కంఠపాశమ్ము మనది.

నందనవనాల తొలుత వాసంతనాట్య
మాడినది నీవు, పాట పాడినది నేను
వెండిమబ్బులకోట, జాబిల్లిరాల
చలువ మేడలు మననివాసమ్ము అతివ!

హ్రీమతీ! నీవు పాడినపూలపాట
వినగలేను చెవులు మూసికొనగలేను!
నరకలోకంపుటిరుల తొల్గించు నొకట
స్వర్ధునీశీకరాల దేలించు నొకట.

స్వార్థలోకమ్ము పూలవందిళ్ళు గాల్చి
వలపుచింతల చిచ్చు మండింపనిమ్ము,
వదలికోలేను నిన్ను దేవి! మదీయ
కవిత నీవు, గానము నీవు, ప్రాణ మీవు!

## సంకేతమునకు

నీ
కలలపొదవుల ఒక్క చిరునవ్వు విరిసి
హాస్యరుచి నిండ వెన్నెలపూత పూయు
నీ
చరణమంజీరస్వన మిట్టే కదలి
నాయెద సహస్రవీణియలు మ్రోగించు
మంత్రశక్తివు నీవు
జీవనము లంటి
కావ్యహారమ్ము,
హృదయనీరాజనమ్ము
నీకునై కొని వచ్చి యెత్తెదను నేను
ప్రేమమతీ! శ్రీమతీ! సుధాశ్రియుతములు
పరిమళపునీతములు కళాప్లావితములు
అభిసరణవేళ నేల సంకోచ మువిద!
బయలుదేరుము ప్రేమసంకేతమునకు.

## పాలి కాపు

### నేను

కోయిజడలో పూలు రాలి రాలకయున్న
తొలికోడి మలికోడి కూసి కూయకయున్న
చిరియు రాలి కనుముద్ర విడి విడకయున్న
ఎట పోయి నీపయన మెవట పోయి నీవు!

కనుల కాటుక రేఖ కరగి పోనే లేదు
పెండ్లిపసుపుల పూత చెరగి పోనే లేదు
తొలికవుంగిలి పసిడి తళుకు మాయనె లేదు
మునికోల నీ కేల ఈవయాన మేల!

## అతడు

పాలికాపును నేను బందెబానిసను
మంటిలో నా బ్రతుకు మంటిలో పాట
మంటిలోనే వెతలు మంటిలో కతలు
కడుపె డాకలికొరకు కవళమ్ముకొరకు
తల్లిరొమ్ము దిగజారి నడక నేర్చిననాడె
నాతోడు మునికోల నా బ్రతుకునీడ
పాలికాపును నేను బందెబానిసను.

వేకువల పయనమై మునిమాపు దాక
మంటిలో నా బ్రతుకు మంటిలో పాట
పాలికాపును నేను బందెబానిసను!

# శ్రీ కొడాలి సుబ్బారావు

## నతి

ఓంకారస్వరలీనమై విఘ్నసాద్యోపాసనాధీనమై
హ్రీంకారప్రతిపాద్యమై భువనరక్షాదక్షమై తాండవా
హంకారాద్రిరచంద్రమశ్శకలమై శ్యత్రాప్తగాంతవ్యమై
శంకాసంకులమైనది యుక్తి అకాసిద్ధి కల్పించుతన్!

తనపెగకన్న దుంటుంకు దగుకు, కాని ప్రియావిలాపమా
ర్గణపరిలబ్ధనైజకరుణామృతవృష్టి, పునఃప్రభూతతే
వను డశరీరు డాతనిజనంబున కంతయునందు బోగిపో
యినధృతిమూర్తి మిమ్ము భరియించుత కష్టసుఖంబులందునన్ !

తనవేణుస్వనమోహితల్ సకలబంధాల్ త్రెంచి జాబిల్లి వె
ల్గున పాదంబులజాడ లంగనుచు మ్రొక్కుల్ వెట్టుచున్ రాత్రులె
ల్లను బృందావనవీథులన్ తిరుగ దుర్దక్ష యామునతీరతనున్
తనుకుంజంబుల దాఁ, జెట్టి కౌనుధూర్తత్వంబు శంసించెదన్.

## శ్రీ కృష్ణదేవ రాయలు

అకట రాజరాజ మొదలాంధ్రసరస్వతి నిష్టదేవతా
స్వీకృతిలో యుజించి మురిపించి భజించెను : అంతరాంతరా
ర్థ్యాకలనంబులోపల విశాంపతు లెందరో శీర్ష మొగ్గి నా
రీకడ నీవు నిల్చి జెలయించితి వంత్యసమర్చనావిధుల్

అత డొక్కఁడె కవివర్గ మాదరించెను కాని
కవి యన్న పేరు తా గాంచ లేదు
అత డొక్కఁడె కృతి స్వది యిచ్చెనె గాని
తనకాఁడె కృతుల గుత్తగొన లేదు
అత డొక్కఁడె భాషనే అరయఁగల్గెను గాని
దేశభాషల చెప్ప తెలియ లేదు
అత డొక్కఁడె గదయోధఁ జూచెను గాని
అష్టదిగ్గజయాన మరయ లేదు

ఆయన నాతఁడె పూజ్యుఁడై యలరుకతన
ఎన్ని లోపించినను తానె హెచ్చినాఁడు
అన్నికల్గియు చిన్నవాఁడైన నీవు
అతనితో సాటికైనావు ఆంధ్రరాజ!

నీ ఆముక్తమాల్యద వాసనలు వాణీసంధ్యగతోజనా
ట్యాయత్తం బగువీణాతంత్రులవయి పాటించె మాధుర్యముల్
స్వాయంభూ ప్రతిపన్న సృష్టి కవిజీవజ్ఞానవిద్యాగుణ
ప్రాయప్రౌఢిమలంచుఁ దజ్జ్ఞు లిట చెప్పం జొచ్చి రెల్లప్పుడున్.

గండపెండెరముల కవుల కీవచ్చును
  కవిహృదయము పిండఁగలఁడె రాజు?
ఏనుగంబారీల నెక్కించవచ్చును
  కవిమనమ్మున కెక్కఁగలఁడె రాజు?
కృతు లెన్నియైన పెంచి పుచ్చుకోవచ్చు
  కవితారసము పీల్చఁగలఁడె రాజు?
పొగడింతలను వేలు పొందఁగా వచ్చును
  కళయూహ లందుకోఁగలఁడె రాజు?

అది మహాయుగసారస్వతాత్మ పండి
రాజుగా తెల్గుగడ్డియరణ్యములను
పరువమును కాంతి వీగని పారిజాత
పుష్పమయి నిల్చినది జ్ఞానపూజకొఱకు.

పద్దెము పద్దె మొక్కమణి పట్టిన దెల్లను పైడిముద్ద యీ
విద్దె నెటుల్ గ్రహించితివొ వేయికి నొక్కఁడుగూడ నీవలెన్
దిద్దఁగలేఁడు కావ్యకళ తీర్చిన ముత్తెపుపేర్లుగా కథల్
సుద్దులు వర్ణనల్ జతపుసొంపులు నీతులు గ్రుచ్చినావుపో!

కథ నడిపించు ఠీవి, మతఖండనముల్ జరిగించు ధాటి, భూ
మి భరనయప్రసక్తిని గమించెడి చాతురి, కాలవర్ణనా
వధులను దాటనేర్పు, కనువారికి నీ కవితాపితామహా
బుధ ఒకనీటిబుగ్గ అయిపోవద త్వత్కృతవస్తుసృష్టిలోన్ !

అవునా శీతతనంబు, మార్దవము, చిత్తాకర్షణాధారభూ
త పరిష్కారద్భుతగోస్తనీఫలరసప్రాదంబు నీపల్కులన్
కవులన్ లే దనుమాట సత్యమె భవద్ధాటీనిరాఘాటపా
టవసామ్యం బగుప్రౌఢిమం బమర ఘంటాటంకృతం బున్నదే ?

తొలిజన్మంబుల నీకై
సలిపినసాహిత్యపూజ సార్థక మయి మా
తెలుగున ఆముక్తముగా
ఫలియించిన దెల్లకవులపైపై మెరపై !

## తుంగభద్ర

పరిఖావ్యాజముతోన చుట్టుకొని పంపాస్రోత మాత్మీయసుం
దరసీలాకృతి త్వత్పురాద్రిదయబద్ధస్వాంగయై ప్రబం
ధురదుర్గప్రతిబింబితాంబుదళనోద్యోగంబులో పొంగి శ
త్రుతరయుంబుల్ పరిమార్చి నైజబలముందుల్ పొందె నానస్తుతుల్.

నిగనిగలాడుసోయగము నాదే కాని
నీలిమబ్బులకు రా నేర దహుచు
గలగల నడచులాఘవము నాదే కాని
తెలిమబ్బులకు పట్టదే యటంచు.

తళతళలాడెడు 'తర్కా' నాదే కాని
  ముబ్బదివ్వేల నుత్తమాట యనుదు
జిలుజిల్లు మనిపించు చలువ నాదే కాని
  వర్షాభ్రముల రిక్తవాక్య మనుచు
సొగసుల్లో పొరుదలలోన పుట్టువట్ల
చిందుశీకరములలోన జీవనముల
లోన పంపాప్రవంతిక సొంపులను
వేవిలు మేఘప్రవాహాల నేలకొనును.

## రాళ్ళు

శిలలు ద్రవించి రోచ్చినవి జీర్ణము లైనవి తుంగభద్రలో
పల గుడి గోపురంబులు సభాస్థలు లైనవి కొండముచ్చుగుం
పులకు చరిత్రలో మునిగిపోయిన దాంధ్రవసుంధరాధిపో
జ్జ్వలవిజయప్రతాపరభసం బొకస్వప్నకథావిశేషమై.

నునుపులు పోనబెట్టకయె నూత్నము లెప్పటి కప్పుడే శిలా
గణములు, ఒకొక్కటొక్కటి శతంబుల నాటిచరిత్ర నూరిపో
సినయది తత్కళాప్రతిభ జీర్చినదుష్టవిధిప్రధాన సా
ధనములుగూడ విస్మయసుకృతంబులు కించిదుపాత్తదుఃఖయుల్.

ఈ పెనుకొండబండ లెటు లెత్తిరొ అక్కస మంటలాఘన
ప్రాపిత కార్యమా యది సభాస్థలు లైనవి కోట లైన వం
తా పరికాంధ్రకౌశలవిధానమె చూపు బలే నవీనయం
త్రోపకృతుల్ విదేశపువిధుల్ పెను రంతయు నేర్చినా రటో!

కొక్కెముల్ రాతినొక్కులు గాగ ఉయ్యాల
సలిపినా డొక్కకొండపలక తొలిచి
సోపానములు రాతిసుళ్ళు గాగ నుయ్యి
కొట్టినా డొక్కకొండసట్ట తొలిచి
దూలముల్ రాతిబాదులే గాగ హర్మ్యము
కట్టినా డొక్కకొండకటిని తొలిచి
వేదు లెల్లను రాతివిరుపులు గా రచ్చ
దిద్దినా డొక్కకొండదిబ్బ తొలిచి
సర్వనిర్మాణముల సద్విచయమునందె
శిల్పి చేరిసాధనముల చెక్కినాడు
మరలు లేకుండ యంత్రాలమహిమ లేక-
ఆమహాశక్తికిని హేతు వరయ లేము!
సర్వనిర్మాణమును శిలాస్థావరంబు
నాడు హంపీ వెలుంగు విజ్ఞానమునకు
సర్వనిర్మూలనము శిలాస్థావరంబు
నేడు హంపీ నశించినపాడుస్థితి.

# శ్రీ ఊటుకూరి సత్యనారాయణ రావు

## ప్రభాత సుందరి

నీనునునిగ్గు దొంతరల నిండినలేజవరాలి కూరుముల్
తేనియసోకలై వెలుగుదీపలు కల్లుగ నాదుకొన్న లే
పా, నవకమ్ము సోనిసమయోచిత లాలనలందు తేల్చగా
మానవ మారులేదు పవమానుడు ప్రేమరసప్రమత్తుడై.

కన్నులు వేయి చేసికొని కాచి నిశాంతముదాక తొట్టిలో
మిన్నక ఆకుపందులను మే నరవాల్చెనో లేదో నీకునై
ఎన్నిసుమమ్ము లేర్చి హారియించెను ఈమధుమాసయామపు సం
పన్నసుధామిళన్మధుర భవ్యపరీమళితాంగ రాగముల్

ఏమహోవిద్ధగీతి లాలింపబడిన
స్వాదుకంఠశ్రుతి కలాపసరణులందొ
అలపించెడి మధుపశుద్ధాంతజనము
ఈశుభోదయవేళ నీకే గదటవే!

తెలతెల వేకువన్ పికసతీమధుకంఠపు సన్నతంతులన్
పలికెడిచీరలో సుఖము పైకొని నీమృదువృత్తశాఖయల్
తలపులు చూరవట్టగ నిశాంతము పాడు ని దేమి! ప్రేమ వి
హ్వలతయు గానమై రసమునై వివశత్వమునై చెలంగునో!

## భవిష్యత్తు

ఈయుషస్సులమునక లెగసి కాంతుల రేపి
విశ్వజీవనివహహృదయ వీథి పులకింపగా
వెన్నెలలు వెలయించునో — వలపులో
వేదనలు రగిలించునో!

విరికన్నెసిగ్గుతెర మరుగు నూరుపుసెగల
సోగయువాసనగాలి సగమైనమాధవుడు
విధురభావము దాల్చునో — ఒంటిగా
వెర్రియై వెంటాడునో!

ఆపాటునొక్క మునిమాపు వెన్నెలవైపు
కలువకమ్మనిసుధల్ కరగిపారినకథల
కీ జీవితమె మరచునో — స్వప్న
లోకాల మధురిమె వలచునో!
అది పోకుమాత్రనే మదిర ప్రాణసమరవు.
అది యెవరో! చరమసంధ్యాశిరత్నుల కలికి
జాబిల్లిరేకయేమో — మనసు
నీడల నమృతనర్తకియొ!

## కవి : వాణి

### క వి :

మలయతటీరగంధ వలమానవిధూత సమాగతానిల
మ్ముల్లకను తంత్రు లూగి, కనుమోడ్పులనిద్దుర నన్ను తేపగా
పలికెడు వీణ — ఏల పరిపాటిం రాగము మాని, మూగవై
కలత వహించె? ఈ బ్రతుకు కాంక్షలె తా నయియుండియున్ ప్రభూ!

కలకల నవ్వుచున్, దరవికస్వరమాధుకరీసుధారసో
జ్జ్వల కలనాదగేయపరివర్తిత ఝూళిఝుళింఝుళీపదో
చ్చలితవినూత్ననూపురలసన్మణికాంతుల నందగించు నా
యళికచ యీహృదంతరపుటంములకున్ వెలియై గమించునా!

ఏవివివమ్ములందో ప్రవహించెడియేటికరుళ్ళ మబ్బుచా
టై వెలయించువెన్నెల బయల్పద్మోత్పల బట్టిపోవురీ
తిగా విధియించుచున్నయది, తిన్నగ సాగుచు — కాళ్ళజాడలే
కావలె, యెందు కీదురవగాహమనఃస్థితి యామె కో ప్రభూ!

ఎన్నిజన్మలో యోగి సాధించుకొన్న
ఒక్కటే, ఒక్కయుదురేఖ — ఒక్కయమృత
కలశ, మోకమనస్నాట్యసౌఖ్యలయతమ్ము
అస్మదానంద జీవితానంతసీమ !

తానయి వచ్చి లేపి పెరదారుల దైహికభోగతత్పర
ధ్యానము మాపి, సాదుపరిధానము చే పెలపైచి, ఏదలో
నే ననుఁగొని భావరమణీయ సుఖస్ఫురితాచ్ఛలోక సు
శ్రీనత హైమనయాపదము చేరుదలన్ నడపించె నో ప్రభూ!

వాణి :

మనసున కందరాని అతిమానుషమై అనుభూతయోగ్యమై
తనరెడియాకాశ పదవితానము తేనియ లోతుల గాయకా !
అనుపమమైనభావజగదంతరదివ్యమహస్సులోతులో
ఇంకిన నిరామయానంద కదిలో ప్రబుద్ధమైనరసజ్ఞ జీవికిన్.

తొలగితినా కవీ, ఎటుల దోచెను — నీవెనువెంట నుండి, నీ
యుగ్రతపస్సునం గలమ సారడి నూరటపెట్టు కాంతియై
మెలగిన దెవ్వరోయి ! అనిమిషమనఃస్థితి నీవు నాకునై
పలుకవదై కృపించునెడ చాటును పాటును నేరకుంటినా ?

జారె మనస్సు, నీపదవి జారె, సుషుప్తిని జేసి హాయిలో
తీరము చేర్చువాడ కడతెన్నులపోయన కాగలేక చే
జారెను యోగమం దదుగు జారెను — ఈశిథిలప్రసక్తిలో
చేరవు నీహృదంతరమునీదయచే దనియించునంగతిన్.

శ్రీ ఊటుకూరి సత్యనారాయణ రావు గూ౩

# అ ను న య ము

[అర్ధరాత్రి దాటినా నిద్రపోవటం లేదు రాహులుడు. జీవిత మంతా అంధకారమయమై నిర్వేదంతో నానాటికి కృశిస్తున్న యశోధర, తెలిసీ తెలియని అజ్ఞానావస్థలో కుమారుడు ప్రతి దానికీ మారాము చేస్తుంటే తీర్చలేక ఓర్చుకోనూ లేక గడిపిన ఒక నిశాంతము :]

వాలిక లైన యాశకనుల ప్రాలు తమాలపనీ విసిరి నం
చాలిత భావవల్లికల చాయల బాష్పములేల తల్లి! నీ
బాలకు డేదియో తెలుప వచ్చియు రానివి మాటచొప్పులన్
కేలు కదల్చి చూపుచు నొకేవిధి నేడ్చుచు తెల్లవార్చునా...!

ఎప్పుడు చక్కనౌ త్రితనో యీ కురు లందవు కేలుగంటుగా
మెప్పులచేయి తాకి అరమోడ్పుల కన్ను పూవులవాన చిందగా
ఇప్పటి కెన్ని నాళ్ళు గతియించెనొ ఒక్క జటాభుజంగమై
కప్పి మిగిల్చెనా తుది— దుఃఖస్మృతిన్ దూలిన దీనురాలికిన్.

ఈ రాణివాసము లే పురాతన శిల్ప
దోహద కల్యాణ తోరణములో
ఈ యంతిలోద్యాన హేమంత సాయంత
నా లేటి చిత్రవిద్యాలయములో
మెరయించు కోటకొమ్మల పైడిఘంటిక
యూగ సేవిజయ రాగులుత్తుంగకునా
పాలుపుమంచి మాత్రిక మొన్నరసిన రాకష్టి
పొనటి లేపదస్పుర్శ కారకో

ఇరువుగాన నాడు శాక్యసుందరుడు నడచు
పూల త్రోవలలో గడ్డి మొలచె నేడు
ఏమి కల దింక వారల కేడ్వకుండ!
సంపదలు తేల్చునా దుఃఖసాగరమ్ము!

మారా మెవ్వానిపైన సాగు నటరా మాతండ్రి! మీతండ్రి యీ న్నారా, ఎవ్వరితోడ చెప్పుకొన, కన్నా! చిన్ని చే సాచి యీ గారాముల్ పచరించి యేడ్చెదవు? నీకై కాదురా ప్రాణసంచారంబిక గాని చిక్కబట్టి తెపుడో చావుండ దుఃఖమ్ముతో.

బ్రతుకుభారమ్ముతో గుండె పగిలియున్న
ఈ యశోధర కింక దిక్కెవరటోయి
చిట్టి! నీకయి సర్వమ్ము కట్టిపెట్టి
నిన్ను చూచుచు ప్రాణాలు నిలుపు మనిరో
నిర్దయుడో దయాశాలియో నీకుతండ్రి.

దోబూచు లాడుకొందము
బాబా! రావయ్య చిన్నవాడవు కాదా
ఈ బొమ్మలు పాపాయికి
ఈ బోదట తల్లి ఇట్టు లేడ్చుచునుంటే.

చూడు, ఇటు లేడ్చునవ్వాయి పోరు దగున
ఎదిరి మాయాంగనల మోహరింపగలదె
అరిగెదను నేను కూడ మీ యయ్యకడకు
తీసికొనిపోవ వీని నెందేని యనగ—

ఆవురని మంచు చిన్ని భుజబంధము కంఠము చుట్టవేసి, ని
ద్రా వివశమ్ములో [illegible] నా పిడికిళ్ళను బట్టి రాయుచున్

కావలె గోడప్రక్క నంకమ్ములు మూగిన ముద్దుమోమువా
డీవల కాదు, అదుకొన దే మని యన్నటు లంగలార్చుచున్.

ప్రభువుదెస జూచు నాపసిరాధవాని
గోడు నెడఁగాంచెమా కొఱ్ఱరాయి గద!
చిత్రపట మన్న తెలియదు చిన్నతనము
అనుచు వక్షమ్మునకు చేర్చికొనియె తల్లి.

హృదయపు లోతులోన వలపించిన చిన్నయొదంగ నెట్టులున్
పదిలము సేయలేక తల వాల్చెను తల్లి, కుమారరాహులుం
డోడిన వియోగభార జనితోష్ణ నవ బాష్పప్రవాహరుద్ధతాచలా
హృదయ యశోధరా ఘనపయోధర పాలిక తూలిపోవుచున్.

## శ్రీ కందుకూరి రామభద్ర రావు

### స్వప్నము

స్వప్నసీమల సాధుజాస్కంధ మూది
స్వర్ణమయ మైనవాసంతవల్లి వోలె
నవవిలాసంబు తోలుకాడ నాదువెంట
సంచరించెద వవతెవో చాన నీవు!
చంద్రికాధౌతధవళవస్త్రాంచలములు
పాలకడలితరంగాల చాలువోలె
వెన్నుదన్నిరా, వదనారవింద మంగ
ళప్రసన్నమౌ నా భాగ్యలక్ష్మి వేమొ!
అలికకుంకుమతిలక బాలార్కమదికి
అభినవోన్మిషితము, జీవితాబ్జ మలరు;

నిజదేహాభసితమ్ము గజదర్మాసనమ్ము
తెలుగుచీకటిసుడి ముఱిగి నింగికి నిండు
ఒకవంక తాండవ మ్మొకవంక లాస్యమ్ము
అర్ధనారీశ్వర మ్మఖిలబ్రహ్మాండమ్ము
ఓహో మహాదేవ! ఓహోహో నటరాజ!
ఇది సాంధ్యతాండవం బెసఁగు సంరంభమో!

## అశ్రు తర్పణము

(౧)

ప్రకృతి బహిరంతరములు తుఫాను రేగి
నాకుటీరాంతరజ్యోతి నలిగి నలిగి
పడతియును నేను బ్రదుకులు పారదెరచి
యెంతగా దాచుకొన్న కాం దెక్కడోయొ

కరుణ రవ్వంత యున్న నాకమె కరంగ
హృదయమును జీల్చుకొని వచ్చు వెలుగుతోడ
పదివసంతాలన్యోన్య కావ్యము ముగించి
అశ్రువులతోడ స్వస్తివాక్యమ్ము నిడితి.

భావనాసౌధశిఖరాగ్రపంక్తి నాదు
కలలు రేపినచంద్రవదన కాంతు లంత
విహ్వలము లయి కన్నీరు విడువఁదొడఁగ
భావసంశూన్య మైనప్రపంచమందు.

౨

ప్రాగ్గిరికూటపు ప్రభాతకాంతుల
సూర్యుడు పట్టే బాకా లవిగో!
వినబడలేదా! వినబడలేదా!

కన్నులు తెరచే కమలముఖమ్మున
పూర్వుని పెదవుల చిరునగ వదిగో
కనబడలేదా! కనబడలేదా!

పూలకన్నియల బుగ్గలు నొక్కుచు
ఈలలు వైచే బాలానిలుడై
సూర్యుడు పాడేగేయా లవిగో
తెలియుట లేదా! తెలియుట లేదా!

ప్రభాతవాయు ప్రసరణమ్ములో
పయోదమాలా ప్రస్తారములో
స్వర్గవాహినీ సైకతములలో
సూర్యక్రీడలు! సూర్యక్రీడలు!

3

కుమిలి రగులుచు చిరుమంటకోసలు విసరు
అగ్నికుండాభ హైమనవ్యాదంతరమ్ము
జీవితాశయకిసలయశ్రీలు మాడి
మోడువారిడి బ్రదుకిక మోయలేను.

ప్రాణిలోకరహస్యాలు పట్టువడక
నీగనిల్లెడి హృదయమ్ము నిలువలేక

పడుగుపేకలుగా కూర్చి వర్ణ వితతి
భ్రమపటం బేదొ రచియించి పడును కాంతి.
ఇంత యజ్ఞానతిమిరసంక్రాంత మైన
జీవితమునందు కల్పన చేసికొందు
ప్రొద్దుపోకకు కలలసంపుటము లెన్నొ
నవ్వుకొందునొ! యేడ్తునా! నన్ను జూచి.

౪

బుగ్గలు సొట్టలు నిగ్గులు దేరగ
కలలో పొర్ధుముకలకల నవ్వును
బొందుమల్లెజడి విరిసినది
పండుపున్నమయె ఎదిసినది
పాలకడలిరొద పొంగినది
ముత్యాలురాసులై మొలిచినవి.
నిలిపి కవుంగిట నీరయిపోయితి
కన్నులు విడివడె కారుచేయికొస
సుప్తముద్రితము శూన్యప్రపంచము!
నాకపోలముల నయాగరాలై
పొరుబాష్పముల పొగ్పి తడిసినది.
ఎదుటి గోడపై ఏమి రొరుగ నటు
కదలిపోవు నీ ఘటీయంత్రము.

౫

బ్రదుకు నాల్గాళ్ళ పాయసపాత్ర జేసి
నోటి కందించి, నునుపచ్చకేటకేగ

తాలు లూరెడి బాసలపూలదోట
పైని ఉయ్యాల లూపితి పార నన్ను
నాయన న్నింత క్లేశాన నదయకంద
నీయుడంద దేరిననవనీత మంత
పూతపెట్టితి; సుగుణకర్పూరదీప
హారతెత్తితి నాదు నీరాజనమున.

ఎంత పాషాణహృదయమో ఏరా నిన్ను
కూలికామలదేవిక కూర్చుకొనిన
కటికకాపలతో వల్లకాటి కంపి
పత్ని గోదావరీతటి బూడ్చినాను.

స్మృతిపథాకాశవీధులై జిమ్మురేగు
అశ్రువారిప్రవాహమ్ము నద్దుకొనుచు,
మెట్టవేదాంతవృత్తిక కట్టువైచి
సిగ్గు మాలినబ్రదుకు నర్పించుకొరకు.

౬

నా గృహారామసీమ జన్మమ్ము గన్న
తొలివసంతప్రవాళసంతోషమునకు
పురిటిబాలెంతపసుపులం విరిసిపోవు
పుట్టువందువు పేరుక బట్టినడిరో.

పదివసంతాల మొగ్గయి పరిమళింప
“ పారిజాతప్రసూనసంపద జనించె
నందనవనమ్ము అతడు పురందరు” డని
తోట నడుగిడువా రెల్ల తోచి యనిరి.

కడుపులో తేనెసోనలకడవ లెన్నొ
కూడబెట్టుచున్నది కుసుమదళల
హృదయమకరంద మానుషత్వప్రకటమ్మొ
లెంత కీర్తించునో యని యూగసినాము.

కాని కనలేనిమర్వ్యాధిగర్భ మంత
ఏదో విషకీటకమ్మయి రయొర్వి దొలుచు
ఒక్కవేళొక రాలిపో నుడికిపోదు
కడుపుచుమ్ములు చుట్టుదుఃఖాన కాగి.

రాలుపడిరొదుసెలుంగుతో చాలు కట్టి
యురలుకన్నీటిబొదలతో తరుగ కేను
అడుగడుగు మొగ్గ రాలిపలోడిను రాచి
కాడువారినమొదద రక్తమె స్రవించు.

౨

ఎడద తేనియ లూరడినపూలతూల
డోలికలలోన నన్ను నుయ్యాల లూచి
పదిపసంతాలబోదుకా నివాళి యుడిన
హృదయసారథియై యుద్వాసిని తేను.

ఒక్కగడియైని విశ్రాంతి దక్క ఎంత
పెనగులాడిన వివశనై చనెదు కాల
చక్రవిభ్రమణంబుతో సాగిపోయి
యూరకే పుత్తు గట్టినిట్టూర్పు గాడ్పు.

పొగులుచుండెనహృదయాన మిగిలి యున్న
స్మృతిలతావితానమునకు చిన్న పొదు

కట్టి మనసార కన్నీరు కార్చు నాకు
తెరపి దొరకదు నవ్యనాగరకజగతి.

౮

పార్థసారథి బ్రదికినపదిదినాలు
పాలకడలితరంగాలపైని మినిమి
పండువెన్నెలరేకలో పలిపసందు
పైరగాలి హృదంతరపరిమళమ్ము.
అపుడు నే పూలపడవనై హర్షజలధి
నింగి దాకి తూగాడుతరంగపంక్తి
ముమ్మరమ్ముగ రేకులకమ్మదనము
చిమ్ముకొనిపోతి అలలచివర లొరసి.
ఇపుడు క్రాగణకొఘుడా! ఎడదబరువు
నీడ్చుకొనుచు, జీవితపథ మూడ్చి చనుచు
పిడుగుబ్రోతగ నేడ్చెదు బ్రిదిలి దిశలు
అర్ద్రివంకములై పోయి అవని గలియ.

౯

ఈవిరాగవిషాదాగ్ని రేపు మిగిలి
మహితసంసారసాగరమథనజాత
కాలకూటమహానలకీలవోలె
తరుముకొని రేచ్చు జీవితపురము లన్ని.
తోడివారి జీవితపరితోషమునకు
అంతరంతరమును గాల్చు ననలమంత

కరడుగా నట్టి కంఠనిర్గతము గాక
కమిచి లో నడచెదు కాలగతుంభంగి.

నేను నటరాజు నైతిని; నైని దోచు
లాస్యతాండవనాట్యవిలాసములను
లోక మెరుగును కాని, నాలోన నరము
నరము కాల్చునీదుఃఖాగ్ని నాకె యెరుక.

౧౦

పూతగోదావరీదేవి! పుణ్యనదివి
గతశతాబ్దాలకష్టసుఖాల నెల్ల
ఒడగట్టి జీవన వోసుగాతి!
ఆలకింపుము సుంత నీయలలు తెలిపి.

పొంగిపోవుదు గద నీయపూర్వశోభ
కెవ్వడేను, లోన గీర్తించి యెన్నిసార్లొ
నీపవిత్రానగానోన్నిద్రశక్తి;
నిన్ను కేమంచు నమ్మ అపస్మారుడ నయి.

పదిశరత్తులపాటు నా బ్రదుకువెలుగు
గా నటించినరసమయుండను నిన్ను చూడ్కి
నీదుసైకతోత్సంగాన నెదురవోవు
అన్నెపున్నెము లెరుగదు; నన్నయెడద

నీవు శీతలకరముతో నిమురుచుండి
సంధ్యసంధ్యల నాత్మవిశ్రాంతికొరకు
ప్రార్థనలు సల్ప జేయుమ్ము! పాడు డింక.
అమృతపదవివిపాకిత్రమై యెరుగు నమ్మ!

౧౧

బ్రదుకువాకుల కోకిలస్వరముతోడ
బాలికాకంఠమాధురి పాదుకొలిపి
నేను రచియించుగీతు లెన్నేని పాడి
మోదవారాశి దేలితి మనుక లెన్నొ
నేడిరోగానలజ్వాల సెగను బొగులు
హృదయవేదన తీర్చుకో నేర్చుకొరకు
స్మృతివిపంచీగళమ్మునే చిల్చు శోక
గీతు లెన్నేని నీకయి గిలుకు దిపుడు.

ఏయమర్త్యపథాంతర మిపుడు నీ ని
వాసమో! నీదు ప్రేమసుప్రవాహ మింక
మూకమై తెల్లవిరియునా? మాదుకోద
నములు నీ వింక వినగదే? మము దలంతె?

కలుగు జగదంతరము దాటి కనలు నాదు
శోకగీతులు వినుచు నీ శోకనేని
నన్ను నేమని తలంతువో! నాకుమాత్ర
మది తొలంగద ఒక్కింత యాత్మతృప్తి.

౧౨

ఈవిరోగాగ్ని ముండెనా పెదద కింత
చల్లదన మిచ్చు ననుభ్రాంతి దంచన మని
పులుముచున్నాను పంకంబు; పొగులు వోక
రదులుకొనియెదు లోలోన బాజిరాజి

ఏముహూర్తమునం దైన నెగసి మంట
లోకస మ్మంటగా లేచి, ఆడలంనాదు
జీవితాశయహర్మ్యాల జిచ్చు బెట్టి
కాల్చివైచునో జాడతే తానకుండ!

# శ్రీరంగం నారాయణ బాబు

## సంధ్యా వేగము

ఆంధ్రివని పాడు నంబరం బంటి సంధ్య
సంప్రదాయసూత్రమ్ముల జార విడిచి
తెనుగు మీరిన ఆంధ్రపుత్రికలు భక్తి
పూయుడో లాక్షయుకణిమ పోకమున్న.

గాఢదుఃఖతమమ్ముల కాళరాత్రి,
విరియు ప్రేమల వెన్నెలవెండిరేయి,
ఏది నా కిత్తురో మీర లెరుక రాదు
సంధ్య, ప్రియురాలియ ధరంపు చక్రాదనము!

చీకటులు దాగి జీవించు చెలియ జూచి
వెన్నెలల్ కోరి విహరించువెలది గాంచి
సంధి సేయగ మింటను సంధ్య మెరసి
రాయబారగీతాలాపరాజి మ్రోగియె.

సంధ్య చివురాకుదోనెలో చల్లనైన
తుహినబిందువు నా చుక్క తోచెనంత.
విరహదావానలజ్వాల వేడివెతల
పలవు లాలికించురీయనితలపు ఖాంతి.

పరిమళించెడు భావాలపవనుకత్తి
పులకరింపుల తొలికోరుపూల మొగ్గ
దృశ్యకావ్యోర్మికా గీతసస్యఫలము
అధరరుచిలోన మధురంపు సుధల చుక్క.

పాంచభౌతిక దేహంబు పతిత మగుట
పూరితపహుని పూతజిహ్వ నావరీతిగ నిచి
పరమపదశాంతిపర్వాల పరిమళించు
వెలుగుమానినీశీలంపు వెన్నపూస.

ఊడి రేకులుగా పడి వాడె సంధ్య
విశ్వమంత సుషుప్తికై వేచియుండె
అప్పుడప్పుడు జృంభికలట్లు తోచు
మారుతరంగములు మునిమాపువేళ.

ప్రకృతి నవ్యాజమునగ నిచ్చి ప్రణయరక్తి
పచ్చి యారని తాంబూలపాటలంబు
కాలపురుషుండు చీకట్ల గలుపకుండ
త్రాగెనే డని చెప్పవే మూగపికమ!

సాంధ్యరాగసుధామాత్రసంచయమ్ము
కాలపురుషుండు త్రెంచెను గడియలోన
చీదరించెను దుఃఖమై చీకువాలు
ఊహలు స్మృతికణము లయి రేతోడిను దోడుగ

నవ్యతేజస్సు దిక్కుల నారు గట్టి
లేతజాబిల్లి వెన్నెలపూత పూసె
భువన మంతయు నానందభరిత మయ్యె
జాలిదయ ద్వేల సమసిన సంధ్యకొరకు.

## మిణుగురు పీఁటు

మూక సంధ్యామరందబంధూకరక్తి
తెగిపడిన తేటికంఠమై తేజమూడగ
తెగలాబీల జలదాలరేకు తెల్ల
కన్యపోయినరక్తంపుకణము లయ్యె.

పాడుపడియున్న జీవితప్రాంగణముల
పలుకరించునె శిశ్వలవలపురేకు?
కరగిపోయిన బంగారుకలలయలల
తోడునే చుక్కపూవులతోరణాలు?

కాలవాహినికలుషశైవాలజాల
కాలు జారినయీనాటి కాళరాత్రి
గర్భమందున నవయునాక్రమగీతి
తెలిపె నొక్కచిరునవ్వు తెప్ప లేదె?

మస్వపువలపుతారల మువ్వపాత్రిక
నవ్వడులం తేనియానిశాసమయమందు
చెప్పచుందువు ఖద్యోతజీవులకును
వెలుగు పరియింవ నర్తింపకలయు నంచు.

## మిణుగురు పాట

కను పొడుచుకొన్న తార కనబడనియానిశల
మానురుకొనుఘావాల శిశిరంపుబరువుతో
విసరువిషవాయువులకోసల వెగిరెదుబ్రతుకు
ఈమిణుగురుల పాట
ఏదొందదకోసమా!

పూలతోటలో తేనియసోనలు కురిపెడినే
తేనె లానగా మధుబంధురములు దరిపెడినే.

జలజల ప్రవహించు నిర్ఝరిగా
అలల పులకరించు నంబుధిగా
ధగద్ధగిత తారావళిగా - చల
చకచ్చకిత సౌదామనిగా

యౌవనహృదినే దివ్యస్వప్నమొ
కదలినదే చెలి, ప్రిదిలినదే
జీవనపథినే నవ్యవసంతము
మెరిసినదే చెలి, కురిసినదే.

## ఆ వా హ న

కల్లోలపాథోధికడుపు పూచెనదంట!
కరడుపొంగినబిందుకు కడలిలో పెనుమంట!
అమృతభాండమ్మంతరాన కుమిలెడిమంట
అసురలోకమూ భూమి నడుమ తీయనిమంట!

ఓసుందరోజ్జ్వలా, ఓసుప్తమధుకీల!
మేలుకో మేలుకో ఈనవ్యోదయవేళ!
ఏలుకో ఏలుకో నాగుప్తహృద్వేల
హేదీప్తమధుకీల!

౯ ఈవసంత విభాత మీవసుంధరహృదయ
మీజగత్కల్యాణ మీజీవకణభాగ్య
మేలుకో మేలుకో, మేలుకో మధుకీల!

మద్ధద్యంతగ సురభి మందార మధుమాల!
దూరమై దూరమై దృష్టి సోకని నాడు,
నీలమై నీలమై నింగి దాగిన నాడు,
ప్రారంభ జీవిత ప్రాతఃక్షణము నాడు—

ఆనాడు నాహృదయమందు ద్రచ్చినమంట
ఆనాడు నాజీవమందు విచ్చినవంట,
ఈనాడు మధుమాల, ఈనాడు మధుకేళి!

బాల్యజీవనలీల, ప్రౌఢ భావజ్వాల
వ్యథలలో సుఖలో, సంకటాలలో దైన్యమ్ము,
విధుర జీవితములో నిబరించు నాళలో
కదలించి, కవన, సాగరగర్భము విదిల్చి
పరిమళించిన మాల, పరిణమించిన కేళి!
మేలుకో అమృతార్ద్ర హాలాహాల జ్వాల!
ఏలుకో మధుకేళి నాగుప్తహృద్వేల!

అజ్ఞాతజీవని, అవ్యక్త భావని!
అంతరంగాల యాధ్యాత్మిక జ్వాలిక!
ప్రేయసీ మోహయనీ నిరహస్త్ర రాత్రుల
మధుకేళి కాంగురుల విధుర వీణాగళము
హృదయ కృష్ణోజ్జ్వలము మృదుల రాగాంకుశము
మధురమ్ము మార్దవము స్పర్ధులః శోత్సవము!

హేసుధార్ద్రబాల, హేసుప్తమధుకేళి!
మేలుకో మేలుకో ఈ నవోదయవేళ!
ఏలుకో ఏలుకో నాగుప్తహృద్వేల!
హేదీప్తమధుకేళి, లీలా ప్రణయహేల!

## ఐంద్రజాలిక

ఎవతెవు నీవు దూరమున నే భ్రుకుటీనటనమ్ము చేతనో
నవజలదమ్ములందున వినమ్ర గళమ్మున మ్రోగు నిష్ఠురా
రవముల రేపినావు! విను రాల్చినరిక్కల లెల్ల మంటలై
లవము లవమ్ములై తునుకలై చిటి పేర్చెడి నా జగమ్ముపై!

కనబడకే కనుంగవకు గాటపుకోరిక లేల పూన్చి నీ
ధనువున రంగురంగుజలదమ్ముల లేతెర జీల్చె దేల, నా
మనసును ద్రెళ్చె దేల, పరిమాణము లేనికఠోరభావ మూ
నిన మనజాల నే జగతి నీసుమవాస్తమె నిప్పు గుప్పినన్!

దురుసుకటారి నీయురము దూని నిశాజఠరమ్ము గోసి, భీ
కరరుధిరమ్ము చిందినావు నాళికండమునన్ భువి జేరనీక నే
యురు దగు నింద్రజాలము విముత్తున జేసితో! శోణితంపుతుం
పర లయి పేర్చి తారకలు నభస్థలికీలలతోరణమ్ములై.

సుందరవిశ్వమోహిని! రసోజ్జ్వలమూర్తి! వసంతరాత్రి నీ
చిందుల కగ్నికుంపటి మిడి యింధనముల్ రగిలించి, సాంద్రధూ
మాంధములో ప్రజ్వలితహాలాహలామృతకీలికాగ్రసీ
మం దలిరాకుపాదయుగ మంట నటించెద వైంద్రజాలికా!

## సుందర మూర్తి.

నా విరహానుభావము లనారత మాకడి పెట్ట, నీసుభా
భావనలందె నింగిదెస బర్వులు వారుదు నాన గొన్న గీ
తావళి యూగగాంతుల విదిల్చి ధరమ్మయిపోవు నీనివే
దిని! భవత్స్వరూపశుభతేజమె పో విరియుందు జొన్నలన్!

ప్రేయసి! నీసుధామధురఫేనిలహాసము పుచ్ఛపూర్ణతై
పూయగ, మంథరానిలము పార్శ్వదునీవనసీమ చిందుతో
ఛాయల చాటుచాటున ప్రచారము సేసెడిరీతి దోచి యా
మాయసఖీ! కనుంగవకు మాటు బొనర్తు గదే స్వరూపమున్.

భావిసుఖాసుఖమ్ములవిపర్యయముల్ దలపోయు నాస్వభా
వావృతభావనానిచయ మారల ద్రోచి, మదీయజీవన
పావరతన్ మది న్నిలిపి, తావకదివ్యముఖారవిందను
శ్రీవిభవమ్ము నే నభిలషించితి నంతియ సుమ్ము నెచ్చెలీ!

భావనలం జరింతువు, విభాతవిభావరులం బ్రశాంతతో
భావరణీయమూర్తి వయి భావన మాడెదు నాయెదన్ మధు
ప్లావితగీతమై కరగిపారగ జీవిత మెల్ల, కాని లో
కావరణమ్ము నంటనిత్వదాదరణ మ్మెటు చూరగొందునో!

నీనవకారమే కలుగనిచ్చితివో, ప్రణయాలయంపుజ్యో
తీ! సువిశాలవిశ్వపరిష్కృతిప్రమదావనదీప్తి! నాసము
ల్లాసితగానవాహిని, యిలాతలి తెప్పల దేల, ప్రేమవి
శ్వాసవికాస మౌహృదయశాంతి ధ్వనింపదొ దిక్తటమ్ములన్!

నీకొరకైనయీవిరహనిర్భరవేదన నాయెడంద చే
రాకలి రేవ, దేవి! భవదాకృతి నూహలరేఖలందె లిం
ఖీకృతముం బొనర్చి, వినిపింపగ నాశయ మూని నేటితో
భాకరమైనవిన్నలవిపంచికతంత్రుల మీటి పాడెదన్!

సుందరమూర్తి! ఈరజని శుభ్రసుధూవసనమ్ము దాల్చి జ్యో
త్స్నాందిరవై భువిం దిగి, యనిందితకాంతివిరాజమానహృ
న్మందిరమందె మద్గళసుసంగళగీతరవమ్ము నిం దిశా
భ్యందెలవిక్వణమ్ములయున్ నటియింపుచు సమ్ముఖమ్మునన్!

అనఘా! శౌరిహితంబులో గల రహస్యం బింత గుర్తింప జా
లనిమూఢుండవు కావు గాని, మఱి మాలన్ జేవ కాయుంత చా
రిత్రని నీబుద్ధి నిమిడ్చు దానలుక! మూర్ఖుల్ కోవి నిన్ బందిగా
గొన భట్లాకృపసట్లు బట్టిన కృతఘ్నుల్ ద్రోణు మన్నింతువా?

"తాతా, మా కెదు కింతిరయోః?" యని సంతాపించు పాపై గృపా
న్వితుండై తనసావు దా దెలిపె గానీ భీష్ము, డాచార్యు డా
రీతిన్ గుండె గరంచకోడు; తనబాణం బిక్కుమీఱెత్తుటన్
బోతం బోయును గాని కౌరవయశంబుల్ నిర్వికల్పస్థితిన్.

ఏమీ! ఏ మనుచుంటి! "నేడుగు రాణీ, ఖుద్ర పోనీ, యశః
శ్రీ మాయించు నలీకవాక్పటిమ స్వాశ్శ్రేయార్ధినై మద్గురు
స్వామిన్ మోస మొనర్ప జాల" ననియా! స్వర్గంబు నీరాక క
త్యామోదంబున ద్వారము న్దెరచె నయ్యా, పాపన్న ధర్మాత్మజా!

# మనవి నేత

## (రాణీసంయుక్త—స్థానేశ్వర యుద్ధరంగము)

తొలంత నసూయ నావలకు ద్రోసి వినిర్మలచిత్తవృత్తి బా
దృక్కులు మరలించు నీవగటు గూరుచు నల్లనిపైన దండ్రి! స
త్కుక్కలజాడు కాడొ? త్వద్దహితకుం దగు నీకనుజోడు కాడొ!
త్తులవిభవంబుతోడ దులతూగడికోటియె కాడొ చూడుమా!

అహరహంబులు దేశకల్యాణవాంఛ
దపిలి శ్రమియించి, శత్రుసంతతి నడంచు
ఘనుడు "నా యింటి యల్లు డయ్యె" నని గర్వ
పడుదు; వాడు మప్పు! చిడుసుడిపాటు నింక.

ఇందు రహస్యమేమొ గ్రహింపంగలేనివాఁడను తా శరణ్యమున్ బొందఁడొ యేడుమార్లు శతహాబద్దిను నాపతి చేత జిక్కి; అ పందమొ ప్రాణరక్షకుఁడై ధ్వజ మెత్తె నటన్న, నేఁడు ని న్నుం దిగఁ ద్రోయువర్ధ మెట నన్నది? కన్నులు విచ్చి చూడుమా. కాదని నిన్ను నే కలతిగా గ [illegible] ట్రస్య నుంచరాన ధి క్లి దయుతుఁ డిలాకృతి హరించుట లీపగ కాదికారణం బై దయివారు నేని జనకా! నను గ్రాచుము, కాని దేశభా గ్యోదయ మైన స్వేచ్ఛను దిలాంధకమూల్ విదళింపు మ్రొక్కెదన్!

## వేడికోలు

జ్ఞానమున కెక్క నరజన్మ దుర్లభ మేమొ
కాని, యాసల నీను కల్పతరు వగుట
నే నిద్ది మెచ్చనో దేవా! వడి నన్ను
దీనికిన్ వెలిజేయుతేవా?

క్రొమ్మావి చివురుజొంపమ్ములన నెక్కి నా
కోర్కి తీరగను పుంస్కోకిలమునై నీ
ప్రేమగీతము పాడుకొందు— పొరపొచ్చె
మేమి లేకను హాయి నుందు.

అంద మగువిరితండమం దొక్క సుమమునై
చిందిలుచు సౌరభము చిరుగాలి గలిపి నీ
మందహాసము బందుకొందు, సామి, నా
మున నెంతో పరితృప్తి జెందు.

కుసుమాసవద్రవము గ్రోలి మత్తిలి మధుర
రసమూ ఱిప్పిలు వేణురాగంబునకు శ్రుతిన్

విసరనిమ్మా షట్పదములై పాడి, నా
యాసమయూరాంకృతులలో లయమై.

నే మాలతీలతారామమై నీకు గున్న
మామిడిగ బోల్చి నాకోమలకరాల
ప్రేమ మీరగ కౌగిలింతు — నా ప్రణయ
సామర్థ్య మేమెం చూపింతు.

నీలాంబుదం బీవు, నీచాటునన్ తటి
ల్లతనై దాగి, సువిశాల మౌ నీసృష్టి
జాలమున దోబూచులాడ, ముచ్చటలు
జాలువారెదు నెడద తేప!

పేరిములు వారు సెలయేరునై, నీదివ్య
కారుణ్యలహరి జెలువారుసత్యము జగతి
కోరూర విన్పింతు జూడు— నా జలజ
లాలావనాళ్పటిమ నేడు.

## శ్రీ కొమరవోలు నాగభూషణ రావు

## కవి మోసము

భావనయే గాని జాగ్రత్ప్రపంచవిషయ
జ్ఞానము పెరుంగకయే వ్రాయు కవులకావ్య
ములను బఠియించి యెంతయో మోసపోతి
మనుగడ విలాసమాధురీమహిత మనుచ.

బాల్యకౌమారముల వీడి బహుళసౌఖ్య
భరిత మని పేరు గన్న యౌవనమునందు

సంస్కృతిక్లేశములం దన్ను జడుని జేసె
పులక లొదవించు మనితూపులకు మూరు!

నేను గా కింక నెందరో మానధనులు
గోప్యముగ నేలా సతతము కుమిలిపోవు
టంతయును జూడ సందేహ మంకురించె:
సౌఖ్య మొందెడిమనుజుడు జగతి లేడు.

వాస్తవమునకు కవులకావ్యంబులకును
నంతరంబున నెంతవ్యత్యాస మహహ!
ప్రకృతి ప్రతిబింబితము కాని రచన లెగయ
జేయుచుకవుల నెల్లర రోయవలదె!

## చరణ సన్నిధి

[౧]

నీవు నాయెట్టయెదుట గాన్పించు నిముస
ముందు ముద మంది పారవశ్యము వహింతు.
భక్తిదృష్టిని నీసుధాంబదనరుచిం
దనివి తీరగ గడుపార గ్రాగిచైతు.

సహజదరహాస మృదువచస్సరణి నీవు
స్నిగ్ధసౌహార్దమునను బ్రశ్నించునపుడు
నెదియొ ధ్యానంబు గలిగెను; నెరుక వడవు
శ్రవణయుగళి యుష్మత్ప్రసంగతతులం.

ఎంతకాలము నీవు నాయెదుట నుందు
వంతవరకును మామకస్వాంతమందు

సర్వసాచారసంప్రదాయానుకూల
భావములు రేగి నన్ను విభ్రాంతు జేయ
అపుడు నీవిగ్రహముసందె యాత్మ నుంచి
సప్రమభావన నీస్మరణ మొక్కసర్తు
నమితమధురము లైన స్వప్నములలోన
మనుజలోకము మరచి తన్మయుడ నగుచు.

ఒక్కమాటకు బదులు మరొక్కమాట
చెప్పబోవుచు దిన్నగా జెప్పలేక
అమితమూర్ఖశిఖామణి నగుదు; నీదు
ముగ్ధవిభ్రాంతి లోచనములకు లొంగి.

ఈవు వెడలుమనుక్షణ మేను లేచి
నీపదస్పర్శచేత నిర్నిద్ర నైన
తావు కన్నుల నొత్తి సంతసము గందు
అశ్రుబిందూద్గమన మెట్లొ యాపికొనుచు.

## ఆశా వాణి

సతులదివ్యప్రణయహృదయ
స్థితమనోజ్ఞ విలాసశేఖరు
లతివిలోలము లైనదృక్కుల
గతుల చూపెదవు.

సలలితము లగు లేతహృదయం
బులను గలచుచు జేగిరించెడి
కలపుతలపులలోని రుచులను
జిలుకరించెదవు.

పరుషలోకవిలోకనములకు
కరగిపోయినప్రణయదీపిక
చిరుతహాసములోని బాధకు
తెరను లాగదవు

వంచనకు గాలూను కపట ప్ర
పంచమును నే నెదుర్కొననీ
పంచ జేరినతోడ నే కిం
రించి పోయెదవు!

# నిట్టూర్పులు

(౧)

సలలితమనోహారసుందరసాంధ్యమ్ములలో
మలయానిలంపు నిర్మలప్రశాంతముల్లో
ఎనలేని దిగులుచే
మనసులో నిలుపకయో
అంతరంగాబ్ధి బడబాగ్నికీలలతోడ
అనిశము ధ్వనించెడు మహోర్మిఘోషలతోడ
వెలువడిన కనరాని
వేడినిట్టూర్పు లివి.

(౨)

ఈ వేడినిట్టూర్పు లెందాక మసలునో
ఈవిశ్వ మవ్వాని కెందాక మలయునో
అంతవరకే నే ననంతసామ్రాజ్యంపు

టానందరేఖలలో హరియించి పోగలను.
కానిచో— విశ్వవీణానిస్వనమ్ములో
కనసి నా నిట్టూర్పు తెగయించి పొగిలించి
మసృణమానరసార్ద్ర
మాధురీలహరిలో
ప్రాణవాయువులను వి
లీన మొనరించెదను.
నా కేల కా కన్న లోకాన వెనుబాధ!

3

నా కేల వ్యర్థముగ నీలోకవైక్లబ్య?
మేకాకినై సదా నాకే కనంబడని
అవ్యక్తమధురసుశ్రావ్యగీతాలాప
మార్గస్రవంతిలో మునిగి నై మరచెదను.
దుర్భరదురంతదుఃఖాగ్నిహోత్రంబులో
మందస్మితంబుతో మాడి మసి నయ్యెదను.
శారదశశాంకజ్యోత్స్నాప్రపూరంబులో
విహాగంబునై మింట విహరించి పాడెదను.
శ్యామలాకాశవిస్తారతారకమణీ
కోమలకపోలకు చిరామృతము గ్రోలెదను.
ఎందొ చరియించెదను— ఏమిటో సల్పెదను.

౪

ఎందొ విహరించెదను—ఏమిటో సల్పెదను.
మనసులో నాపద మను మాట లేనపుడు.

ఏలితివి నన్ను నీ యిహలోకవాంఛలకు
బంధించినావోయది భస్మీకృతం బయ్యె.
ప్రస్ఫుటవినీలంపు విస్ఫురన్నయనాబ్జ
దృగ్బాణసమితి నా హృదయాన సోకవిక
ప్రియా స్వర్గసామ్రాజ్య ప్రేమమూర్తులు లేదు
కనుల కింపెనయు దర్శనము గూర్పగ రారు.
నాకు సౌఖ్యంబు స్వప్నప్రాయమే గాక
జగతి జీవితము నిస్సారమై కన్పట్టె
ఏమి చేయుదును — ఇం కేదారియును లేదు.

## ఆత్మనివేదన

మాయాప్రపంచాన మధురస్వప్నము లెంచి
మామకీనార్ద్రహృది మమతతో తపియించు
మందారకుసుమగతమధుకరీఝంకార
మంజులస్వనములే మానసము హరియించు
ఏనాడు కలుగునో జ్ఞానోదయము స్వామి!

రాకేందుహీనమౌ ఆకాశవీధిలో
నేకాకినై యుంటి లోకాధిపా! నేడు
స్వాగతము పలికించి ఏకరణి బ్రోచెదవో
వికటాంతర్గూఢప్రాకారమధ్యమున
ఓ ప్రభూ! ఎప్పుడగునో సుప్రభాతము నాకు?

నీమనోహరవేణునిస్వనము దాపులనై
నిష్కళప్రేమతో నిరతము న్నను బిలుచు
నిన్ను గానగ లేనిస్పృహ నే విడనాడి

నీవె వత్తు వటంచు నిలిచియుంటిని దేవ!
నీదారి జూపవా! ఔదార్యము వహించి.

అనుభగము శూన్యమై — ఆలయము జీర్ణమై
ఆశ లన్నియును నా కడుగంటి పోయినవి.
పావకపదస్పర్శ ధన్యతం బొడగాంచ
నెపుడు వర్షింతో సత్కృపను నాపై దేవ!
ఈవు కాదన్నచో నెవరు నా కిక దిక్కు!

# వర్ష ఋతువు

## శ్రీ పెనుమర్తి వెంకటరత్నం

ఈ కాలంబున కీనిదాఘము శమించెన్ తక్షకస్వామిదం
ష్ట్రికీలాగరళప్రూతప్రకృతానిలము లోజన్ వీచి, యీగ్రీష్మమే
మాకున్ శాశ్వత మేమొ యందు మది సంభావించితిన్ దిగన్ స్రోత్రసి
ద్ధా కాలాంబుదపంక్తి! నీకరణ తేరం జూడు సంతప్తులన్.

చటనో విశ్వగర్భమం దిమిడి యుండి
శాద్వలకిశోరములు వికాసములు చూపె,
నణగియుండిన ప్రణయరాహాస్యవీణ
ముగ్ధతంత్రి దనంతన మ్రోగ జొచ్చె!

ఓయి జలదకుమార, పోవోయి, సాగ-
రాధిపతికి నదీవియోగాధిబాధ
తెలిపి కరుణాంబువర్షము లొలికి రమ్ము,
మందగిగర్జల నూరడింపంగ బొమ్ము!

అది కిల్కిరించు తీయని స్వప్నశకలమై
మది భ్రామి పుచ్చి సమ్మద కైతవచ్ఛాయ
తొలచి కల్యానుభూతులు నిజప్రాభవో
చ్ఛల తరంగితకాంక్షయును మానుక పోవు!

## ప్రకృతిలాస్యము

సతత నూతన మృదు విలాస ప్రభూత
భావ మనోజ్ఞ లాస్య సందర్శనమున
నాదు భావము మధుర గానమ్ము సలిపె
ప్రకృతి, ఆనంద తన్మయత్వమున మునిగి.

క్షణములో దుఃఖ చయ మెల్ల సమసి పోయె
ఎన్నియో లాలసలు హరియించి పోయె
స్మృతులు మెల్లమెల్లన సొమ్మసిల్లిపోయె
నీయెదుట విశ్వలత నేన నిలిచి పోతి.

అదయాశీర రసాంబ మాపవిత్ర
విశ్వమోహాన మైత్రి, ఆప్రేమమధుర
మంగళాకార మాతపోమహితముద్ర—
అహహా ఎంతేని కానుక లబ్బె నాకు!

నీ జగన్మోహనం బైన నృత్యమందు
మెప్పులలనిపో, నేత్రనిమీలనమున
దవ్వులను వినవచ్చె నెంతయు పునీత
విశ్వసందేశతతుల గంభీరరుతులు.
ఎవరికొరకు నీ నాట్యంబులు? ఏ ప్రభూత
గాన సంచార ఘనితు కేకాంత కాంత

నృత్య వైదగ్ధ్యము ను బ్రసాదించె నీకు ?
అనుచు ధ్యానించినా నప్రయత్నముగను.

ధ్యాన మది గాన మైపోయె, తావకీన
ప్రణయ సౌభాగ్యమహిమ, నా ప్రశ్నములకు
నేన మూపట్టితిని సమాధానమ వయి
నీవలన నాయనంతత నేర్చికొంటి.

## రవీంద్రునికి

నీ వేదప్రథి లాక్కొలించుకను లున్మిద్రాఘ్గ నంధాన దీ
ప్తు వైదగ్ధ్యము గ్రోలి పట్టు, నొకచో చైతన్యముల్ విచ్చి, వి
శ్వావేశమ్ము గుణించుకో దివ్యగ చిత్రాంశమ్ము నాకంద్ల నీ
భావాలోకము నీకు నాకు ముడిగా పండించుకో జొచ్చెడిన్.

ఒక లయకట్టు విశ్వమున కూపిరిపట్టు అది కెన్నతీయునే
సకలకళాతపస్సు లని జన్మములై చను తత్త్వబోధ ఆ
కకు మది గందళించక విశాసము లిచ్చు తలంపు తీపు ల
ల్లిక వడు నీను సృష్టి కదలి చెడు దాతను గుండె తేవుదున్.

నీచెయి సౌన ఒక్కొక వినిద్రము లేకను కల్పసూత్రముల్
పూచియు ఒక్క పొందిక తవుల్పగ లేక తపించు తత్త్వపుర్
వీచులు పాయ లిచ్చి తమ వేసుకు పొంగుల కాత్మవాటికన్
వీచిన అమనుల్ పడి దవిష్ఠము దారులు కట్టిపోయెడిన్.

ఎన్నియు పూలు లిచ్చి తల కిడ్డ కదుల్పద బోదు నీను భా
వోన్నత క్లుప్తి నాకు మది యూర్చెడి వేడి తలంపు సోగలన్

క్రొన్నిడు చల్వరేక కొనకొనకు నిల్పక వచ్చు కానవో
తెన్నెర మబ్బులింటను తొలంగిచి చక్కని ప్రొద్దుచూడ్కియై.
నీ లయకట్లు నా యెడద నిండిన నీవయు నించుత్రోవలన్
నే లిఖ పట్టి నీయడుగునీడల నానడ తేలికొందు నన్
లాలన తాకి, సక్తి విడనాతొలుపూనిక అనతుల్ స్మృతిన్
నా లిన, దైన్యముల్ విరియఁ డ్డవ నాజనురర్థమై చనున్.

## ఆవాహనము

నా భావిపథము పంచల నెందు నొదుగుచును
వేచియుందువో కాలపథు చోదనము లెంచి!
అవతరింపుమి దేవి, ఆవహింపుమ నన్ను
నాగుండె లివియు ఈనాడె అశుభ వేళ
ఓ విజయలక్ష్మి!

ఆకలింతలు మెలగి ఆవేశమయి పొంగి
నీకమ్రపద తపోనిరతి పెంపు కలిగి
ఏ వనంతపథాలకే చాగికొని నిల్చి
ఆల దివ్యవాణి ఆజ్ఞలు మీటుకొన్నాను
అవతరింపుమి దేవి...

వింతలా నొక స్వప్న వీధివిహాయస
ప్రాభవశ్రీలు కంపలు లోన నిలబోని
ఇటు మేలు కొల్పు జాగృతినే హరించియును
విశ్వమున్ నా స్వప్న విజయమే నరియుంచు
అవతరింపుమి దేవి...

అరుణభానూదయ శుభోత్సవ
వరత బింబె పద్మినీహృద
యావ వొంగనె తేటిపాటల
వలపె తలచూపున్.
చిగురుబద్యాదమరుగు తెరలో
సిగయు కోయిలవగరుగొంతుల
వలిగిపోయే తీయదనముల
వలపె వికసించున్.
మరుగుసంజలి రేగురంగుల
మెరగువారే మొగిలుకన్నుల
చీరచెరగుల వన్నె వన్నెల
వలపె నటియించున్.
బరువువారిన వార్షు కాంక్షో
ధరశ్యామల గర్భపథముల
మెరసిపోయే మెరపు నిలువున
వలపె పులకించున్.
పాలబుగ్గల లేయునవ్వుల
కన్నెపడుచులవన్నెసిగ్గుల
యౌవనాంగుల కావిచూపుల
వలపె మొలకెత్తున్.

తోకమూర్తి

శ్రావణచంద్రికామధురకాలల, నీతెలివాలుకన్నులా
గావిలమై చలింప, కుసుమాంసుశిలాలుల వాలువార్చి, లా

# శ్రీ పురాణం కుమార రాఘవ శాస్త్రి

## వీణ

౧

ఏవో నిన్ను గురించి గీతికలు గానంపంగ వాంఛింతు నా
ది, నే శ్రావ్యమవు, పాట బాలికవు రాదే రాదు, నీ గ్గానము, దుః
ఖావేశంబున క్రుంగిపోదును, కళా గాంభీర్యమూ లేదు, దే
వా, వాయింపుము నీవ, వీణ యిదె నీపాదాలపై నుంచితిన్.

౨

కవిహృన్మాట్టువు నీవు, నీరుచిరవాక్ప్రాగల్భ్యముల్ చూపి నా
దు విపంచీశ్రుతి మేళవింపుము; నవోత్ఫుల్లాబ్జముల్ వోలె భా
వవికాసంబు, మరందబిందురసమున్ పండించి నీగీతికల్
దవ్వులూరించి రసైకజీవనుల కుల్లాసంబు గల్పించుతన్.

3

వీణియ నీవె యందుకొని విశ్వమునే ప్రతిధ్వనించి పోవగా
నీనవగానమాధురులు నింపుమి; అర్ధనిమీలితాక్షుడన్
నేను సమస్తమున్ మరచి నిశ్చలయోగసమాధిలో మహా
మౌనివిధాన చూచెద సమంచితమంగళసుస్వరూపమున్.

# శ్రీ తుమ్మలపల్లి వేంకటరత్నం పంతులు

## వ్యసనరసికుడు

బహ్వంగనాముఖ ప్రస్యంది నవమధు
గ్రహీత పుష్పంధయాగ్రసరు డగుదు
తలిప్యమాన హాలాప్రియా కారణ
వ్యాఘూర్ణమాన నేత్రాబ్జు డగుదు
సంతతాననగుహా సంత్యక్తబహుళధూ
మౌఘకల్పిత మృషామేఘు డౌదు
చటులతమన్వీవీ కుటిలనీలాలక
గ్రథనాపవిత్రితోత్కలిక నౌదు
ఆగుము గా కేను; నీవు న న్నవగ రాదు
జారు డనియు, సురాపుడు, చోరు డితడు
ధూమపాయి యటంచు: నుద్దామదివ్య
వాఙ్మయోత్కృష్ట కద్రైకవర్ణ్యు డగుదు.

నాకరస్పర్శకై లోకమ్ములో నున్న
ప్రతిలీవయును బూత వట్టుచుండు
నా కంటి రక్తిలో దూకని హర్షోద
బిందులకై నోరు విచ్చు బుడమి
నా నిత్యధూమధూపానకే తడియారు
ఖచరకాస్సార్ద్రకైశికములు
నా వికావటదంఘ్రి నవ లయబ్రహ్మకై
చిరప్రకృతి ధ్యానించుచుండు

## శ్రీ తుమ్మలపల్లి వేంకటరత్నం పంతులు

లోకకళ్యాణఘంటావళీ కలకల
వితత గైరికేయయుత నివాంపతిని నన్ను
అనగ వచ్చునె కేవలవ్యసని యనుచు!
ఆగ వచ్చునె నా యథేచ్ఛావిభవము?

అతిభూమింగత మామకీనరతి హేయం బైన కానిమ్ము; నీ
యతిమాకంద వచోమరందలవసేవానంది నా నన్ను, నో
కరి! నీ పేలవ తీవ్రతిక్తలఘువాక్యం భావవారిధి నే
ఛితిసేని క్షమియింపజాలను బయిటై చిచ్చిత్తి ప్రత్యంగమున్.

అతికోపాయిత మామకీనమనున వ్యాళీధరక్తచ్ఛవిన్
జితి నంటించి లయించుకొందు తవరాశీభూతసౌందర్యసం
గత మైత్రీనిలయాయమాన మగు మద్గాత్రంబు నిర్వ్యల్ల నా
చితిలో రగడి విస్ఫులింగవితతిన్ జిల్లెత్తు నీ మోమునన్.

కుపితభావత్కటిత దృశాంకోణవిశి
శిఖిశిఖాదార్చిలో ప్రవేశించి కడలు
సాహసము బట్టె నా ప్రేమసరణిలోని
సత్య మెరుగవో నా గాఢ వత్యఫలము!

మెలతరో! నీ కనుంగొనలు మెత్తని కత్తులు: కాని నా తను
త్రిలకితబుద్ధికిన్ జిదిమి దీపము పెట్టగవచ్చు నీ తనూ
విలసనమందు, నీ కడలు వీధుల బువ్వులు పేరు లెత్తు, నిక్క
దలచిన భావముల్ పులకితమ్ములు ప్రత్యహనూతనమ్ము లై.

తేపతేప లీలాశుకాలాపఫణితి
పాట పాడుచు పూపికల్ వైచి యింక
కొన్ని కాలాలపాటు నీతో ద్దుకొను మోసి,
చిరతరం బైన నా ప్రేమ జీవితమును!

# అ ప క్వ గో స్త ని

వెనుకటి కొక్కుద్రాక్షలత వేముల వాడ కులీను లైన శ్రీ
మన కవిగారి యిల్పెరటియం దుదయం బయి తద్రసంపు తెం
జినుకల కోరునన్ దెనుగు సీమల దియ్యదనాల మంచిరా
జనపు జిలుంగు గబ్బవు బసందులు, పాటిక లెత్త నర్థిలెన్.
అవయి దాని యం దొకటి యాంధ్రమునన్ గవిసార్వభౌముడై
ప్రాపిత నైషధీయమగు వాక్పరిభావ దెనుంగు దేశలో
కోపిడి నాతనింటికిని ముందరి పందిరిపైకి బ్రాకి యా
రోపున గావుకట్టి రహియించెను గుత్తులు దిగ్గ జారగన్.

దత్తువాటీ పురాధివాస్తవ్య శ్రీమ
న్నాయక జటావళీ విలగ్న శశిబింబ
సంస్కృతసుధా ప్రపూర నిష్యందమునను
కల్లరిద్వంద్వ మది ప్రవర్ధిల్లె మున్ను.

కనుగొన నేడు మద్గృహ ముఖంబున కాలము దాటి దానివి
త్తన మెటు వచ్చి పడ్డదొ కదా యొదిరయే తెనుగాలి పాటువన్
గొనకొని యింతదూరమును గొట్టుక వచ్చెనొ? కాక యాకసం
బున బరతెంచు నేదిలుక ముక్కునసుండిలపైని రాలెనో?

విత్తు మొలకెత్తె; తీయివు ర్వ్యాప్తె; దిగ
కొనలు సాగెను ప్రాకులాడను దొడంగె
నంత నల 'చెక్కపిక్క వెంకన్న' యొక్క
డెవ్వు గట్టె నద్దానికి నెడప దడప.

పలిలా నేకం బాదిద
గరిగిన సకలోపచారగతులున్ చే సా
లలిత లతాబాలికకును
సలుపుచునుండుదు నపత్యసంభావనమై.

చాలంగాలము నుండి లౌకికపు బంచారమ్ములం జిక్కుటన్
జాలింపంబడె నాపరామతిక తేజాయుక్ ప్రవర్ధిల్లెనో?
గాలిం బుట్టుట, ధూళికిం దెగుడుటే కా కెంత కాలాన కా
నాలంబాడున నింత దోహాక మిదే పాపాన బో కెవ్వరున్.

నారుం బోసియు నీరు బోయుడె ధరన్ నారాయణుం డన్న నా
చారోక్తిం దెనుపొందె నేటికి గురుద్వారం బొందు ప్రాపించెదవి
స్తారం బయ్యెను ఛాయమానగతి హస్తప్రాప్యతన్మంజరీ
నీరంధ్రీకృత గోస్తనీమధుర పానీయ ప్రపాకారమై.

గిల్లినచో రసం బురలం గించిద పక్వాక దియ్యాతియ్యగా
బుల్లగ బుల్లగా జవులు పుట్టగ జేసెడి పచ్చి దాక్షవం
ద్లల్లవి నావిలోని రస మానిన బాలకవిప్రపంచపున్
బెల్లిద మాని యున్న తృష వెల్లు కదున్ శమియించి పోవదే?

కవనపుగ్ దప్పి గొన లోకమ్ము కొరకు
బచ్చి పూవలు పుణికిన పాపమునకు
గరుణమెయి నాదు ముదురకరరుజాప
కారము క్షమింపు మిక పల్లి కాకుమారి!

△

౧

కంజాతప్రసవోదరోద్ధుర మధూద్గారైక ఘుంజానత
త్పుంజానాతను శింజినీరవముతో నృత్యమ్ము నాటించు ని
కుంజీరద్వ్యయమంజులధ్వనులకున్ మంద్రోద్భలన్మ్రన్నన
కింజల్కమ్ములు రాలి వడ్డ విదగో కించిద్వళ గ్నాకృతుల్

౨

కాలిన చింతనిప్పుకలు కన్నులు, వల్లిగ దేహ మెల్ల ఇం
గాలము లైన రేయి యశనిఘాతపు ఘోష ఘూర్ణితమ్ములౌ
కేకలు వేసి నన్ను వెలయింతువొ కాని దృగంచలమ్ములన్
కీలుకొనెన్ విలోలకలికాంచిత వారిపృషత్కదంబముల్

౩

బలబల రాలి యీ వసపుపచ్చని పుప్పొడి తిన్నెమీదటన్
నిలుచుత చిహ్నితమ్ములయి నీ పదకోకనదద్వయాఙ్కముల్; త
ద్విలసదనమందు నీ వతిదవీయసి వైనను గాక, మద్వచో
విలలితపుష్పమంజరులు విచ్చి కడుగ కబలీకరించుతన్!

౪

ఓసి! ప్రియా! కపోలఫలకోపరి శ్వేత గులాబి వన్నియల్
సోనలు వెట్ట నీ యధరమూల మదే గదియించు మంచున
న్యాసములో సుషుప్తిగత మైన యనుస్వరమ్ము కోటి కిన్
శ్వాసవగర్జితధ్వనితమ్మున తాండవకేళి సల్పెడిన్!

## శ్రీ కొమర్రాజు వినాయక రావు

## చుక్కలు! చుక్కలు!

చుక్కలు! చుక్కలు! దక్కని చుక్కలు!
వ్యథల ముక్కలు, వలపుల రెక్కలు,

ప్రేయసి పిలుపులు, శ్రేయసి గుసగుసలు,
చుక్కలు......
అందపుదీవులు, అమృతపు బావులు,
శోభావహములు, సుభువనమ్ములు
చుక్కలు......

ముత్తెపు నగలూ, ముద్దుల నగలూ,
తెలుగు వెలుగులూ, వెలుగు తెలుగులూ.
చుక్కలు......

తళతళలాడే మిలమిలలాడే
కన్నులు కన్నులు!
అచ్చర మిన్నలు, అందపు మిన్నల
విరిసిరి విలసన్నవ మాధురితో
చుక్కలు......

ఆరని ఆశలు! అంధరజనిలో
దీప్తులు దీప్తులు, దివి నా కోప్తులు
చుక్కలు......

చలిచికురములో చెదరినమల్లెలు
తీరని తేనియ తీయని వాంఛలు
చుక్కలు......

జృంభిత నవయుగ కీలలు, జ్వాలలు,
తారుణ్యపు కరుణారుణ లీలలు
చుక్కలు......

నీ చిరునవ్వు పువ్వు లయి నీకయి ప్రేమ పయినట్టి నాకునై
పూచిన గాని నీయెడద మూగినకోర్కెల తావి నాకునై
వీచిన గాని నీ వలపు వెచ్చని తేనియ నాకు నై
తోచిన గాని, యీ బిగువుతో పలికేవు గదోయి, మాధవా!

## నిరాశ

త్వరగ రావోయి ప్రాణప్రియా! తరుగు నేమొ,
వాడు నేమొ, ఆ దయము నన్ను వీడు నేమొ!
నీకొరకె, వెల్గు లిచ్చునీ రాకకొరకె,
ఒంటిగా చీకటుల వేచియుంటి నోయి!

దినదినము జారు నా దర్పదనము చూచి
నేను నాలోన కుములుచున్నాను గాని,
రాత్రి ముందే కాలము వండిపూత పూయు
నాక్షరుల; కింక తడయంగ బోకు నాథ!

ముసలిదైన యొక గులాబిపూవు నిండు
వలపుతో తేటి విటు నిట్లు పలుకరించె:
"రాలిపోవునో నా రేకు, లేల జాల
మోయి? తుదికౌగిలింత లీవోయి దేవ!"

వేడుకొను గులాబీమాట వినగ లేదు:
పదుచుపూలకై పరువెత్తె దుడుకు తేటి.
ఒక టొకటి గాగ తనరేకు లూడి రాగ
నేలపా లయ్యె నా గులాబీల ముసలి.

ఆబ్రికుకు కూడ నటుం లాదొ నేమొ సామి!
నీవు నను జేర రాకున్న నీయెలుంగు
వినబడకయున్న, నీకంటికొనవాలుంగు
కనబడకయున్న, నే నింక మనగలేను'

## తెలుగు తల్లి

ఏనాడో భోగాల తేలిందిలే! —తల్లి
ఈనాల్గుదిక్కులా రాలిందిలే!!
దాసిగా నీనాడు తల యొగ్గనే లెమ్మ
నిరుపేదనై నేను దురపిల్లగా నిమ్మ
ఏనాడో సంపదల కురిసిందిలే! —తల్లి
ఈనాల్గుదిక్కులా విరిసిందిలే!!
చిరునవ్వు నవ్వినా వరము లంపించేది
ఎరువుచూ పొరసినా ధరణి వణికించేది
ఏనాడో గరువాన తిరిగిందిలే! —తల్లి
ఈనాల్గుదిక్కులా పెరిగిందిలే!!
తనమాట తనపాట తనతపను తనమహిమ
ఇరుగుపొరుగమ్మలకు నెరువుగా నిచ్చింది
ఏనాడో అందాల పండిందిలే! —తల్లి
ఈనాల్గుదిక్కులా నిండిందిలే!!
పేరుపెంపులు లేక దారితెన్నులు కాన
రాక యీనాడిట్లు శోకించు తెలుగమ్మ
ఏనాడో భోగాల తేలిందిలే! —తల్లి
ఈనాల్గుదిక్కులా రాలిందిలే!!

# నగారా

మసకమసకగా దెసలంట ముసురుకొనిరెం
వెలుగు గాని చీకటి గాని విడనిసంజ;
హోరుగాలిలో వలగా నగార మ్రోగె
అవనిపతి కొల్వు తీర్చుసౌధాంగణమున.

అప్పుడె హాయిగా పూదోటలందు తిరుగ
తరి యటంచు మురిసినాను సిరిగలాడు;
అప్పుడె సంజబిచ్చాక్షైర యెద నటంచు
కడుపుమంటతో నిరుపేద కదలినాను.

అప్పుడె వెలయాలిసింగార మంత ముగిసె;
అప్పుడె యిల్లాలిపనిపాటు లన్ని బిగిసె
పులిపడంతి యాకలిగొంతు మొరసె నప్పుడె;
అప్పుడే పాలు కురిసె నావమ్మపొదుగు.

కనుల నెరుపు రాపాడ లేచినది గూబ:
మనసు వెరపుగొని నాడ మూచినది గువ్వ;
ఎగసి రొగసి యూర్చినది గొంతెత్తి కపిలి;
ఒదిగి రొదిగి యూర్చినది నెమ్మదిగ వాగు.

అప్పుడే రాజుగారిసౌధాంగణమ్ము
లో నగారాలు నాగుండెలో నదించె
తరతరాల భూపాల గాథలో, యుగాల
దాస్యపుంజీవితాల బాధలో...

# శ్రీ శ్రీ పిఠాపురము యువరాజు

## నిదుర పో వేమి?

నిదుర పో వేమి, ప్రియసఖా! నిదుర పొమ్ము.
నిదుర పోవుచో మరచిపో నీకు బాధ
లశ్రుజలపూర్ణ మౌనీ నయనయుగళము
వంత బొందెడి నీయాత్మ లయను తెల్పె
గంఠమందలి నీదుఃఖ గాద్గదికము
మనసులో నున్న బాధను గనుపరచెను.
దుఃఖమయమును మరి రోత తో దుర్భరంబు
నైనసంసారయాత్రచే నలసినావు
కష్టము లనెడి కెరటాల కలకరంబు
నొందు జెన్ని నాళ్ళ నీవు కుందినావు
మల్లెపూవును బొందంగ మనసుపడుచు
దదనుగుణమైన త్రోవ నే తప్పినావు
వేణుగానంబు నాలింప వేడ్క నవుడు
భీకరాక్రోశరావము వింటివయ్య.
మేరునగరాజ శిఖరాగ్ర మేఘమందు
నింద్రచాపంపురత్నాల నేర నెంచి
కాలవశమున నజ్ఞానకాననాంత
ర నిబిడనిశీథవీధి బరచితి వీవు.
కంటకలతో నీవు కేదారకు
ఉత్ప్రవృత్త్వము మూర్ఖ్యున బూనినావు

వంపుల జొక్కి చొక్కి తమి పాయగలేక తదేకదృష్టులన్
సొలపుల జూపి కేపిక దుజొక్కుచు జేయుచు మోవి యానుచున్
వలపుల కేడ! చూడగదె వంతల బెట్టెడిచంద్ర కాంతినిన్
వలపున జేరగోయన ప్రక్కనుప్రాలికంగుకవ్వగా.

జలసామీప్య విశాలసైకతమహా సామ్రాజ్యసింహాసన
స్థితిపై మన్మథరాజ కార్యకవణోత్సాహప్రమాద్యద్భరీ
రుల మమ్మంగని కాక లూరకయె యాలోలంబులై పోవ నా
మలయాద్రిప్రభవానిలంబులు పలికెన్ మాతో డనే దేదియో.

"ఈలోకంబునయందె కొక్క మరి యీయీలోకసంఘంబులో
నేలోకంబున నైన దథ్యముగ నిన్నెల్లప్పుడున్ గూడి రేయి
పాలన్ మున్గిన నీట మున్గినను, నా ప్రాణేశ కత్రింతు" నం
చాలోలాక్షి వచించె నాడు జగముల్ సంభ్రాంతి గంపింపగాన్.

ధారావర్షమునన్ మహోపలచయప ధ్వానాంధకారంబులో
నారామామణి వింతచెల్వమున నన్ డాయంగ నీక్షించి నా
తారానాథుడ! నిన్ను వీడి క్షణమున్ దాళంగ లే నంచు దా
మారాలాడెడు నాటియాస్థితిగతుల్ మా కిచ్చు సౌఖ్యంబులన్.

పదముల్ తొట్రిల వచ్చి స్వేదజలముల్ పైగ్రమ్మ కంపింపుచున్
వదనం బెంతయు వాడ నేత్రయుగళిలో బాష్పంబు లుప్పొంగగా
వెదవిన్ నొక్కుచు కౌగిలించుకొనుచున్ వేగంబ రమ్మంచు నన్
వదలం జాలక రేయి నమ్మగు వయున్ బ్రాణంబు లల్లాడగాన్.

విరహావు వేడి గూడికొను వేదనకుం గడు నోడి సోలుచున్
కరముల మోము నుంచి పలుకన్ బలుకొక్కటి రాక జాలిగా
స్వరములు గద్గదంబులుగ సారెకు బాష్పము లుప్పతిల్లగా
మరణము జీవనంబును సమానమె యీరొక్కను మాకు నియ్యెడన్.

శోధన లేనివిద్య, రవిసోముల గాంచనివాసరంబులున్
సాధన లేనిపాటు, రసపోషణహీనము లౌ ఫలంబులున్
మాధవుపొందు లేక వగ మ్రగ్గుచు నుందుచు నుండు రాధయున్
రాధను వీడి దగ్ధుడయి క్రాగెడు మాధవుమున్ హాళార్థులే.

మాధవుం డిట్లు రాధకై మనమునందు
వంతలను జెంద గన్నీరు వారదొడగ
విశ్వ మంతయు శోకమూరు వింత నొంది
భీతి వణకుచు గరగుచు విరిసె దయ్యొ.

## ప్రే మ లే ఖ

## స్మృతి

మధురరసముద్ర మరపించు మగటి నిచ్చు
నధరవీధిని నే గ్రోలు నవ్యమృతరసము
ధన్యధవదీయ పరిరంభ బంధనమున
మేను మరతును నిత్యము నే నిటాన.

## సందేశ సన్యాసము

చిన్ని పూదేవసాన నిను శ్రేమొ
కోన జనవాని పీఠరాజ్ఞి కూతు రేమొ
భద్రగోదావరీజాత నాయు శేమొ
కాంతి, భవదీయ సందేశగాన మహిమ.

## ఆ రా ధ న

కళల జెలరేగు వలపుల చిలుక వంట
దివ్యలోకాన విహరించు దేవి వంట
గగనవీథిని విహరించు కలువ వంటు
ఆత్మహృదయా మానసరాజహంసి వంటు.

## వార్త

తెలియలేదా నీకు వలపు దీపకళిక
విశ్వాలలో కాలు వింతతో వెలుగు నొంద
ప్రళయకాలాగ్ని జిహ్వాల ప్రజ్వరించి
ఆదితేజములో నేక మయ్యె నంచు

## ప్రశ్న

చాలు నా! భూమి మనకు సంచారమునకు
మాయనా యిది మన ప్రేమమాత్ర భార
మోర్చునా యింకను మనమహోగ్రతృష్ణ
తెలియ నగునా మనదగు సందేశ మిచట?

శ్రీ కామరాజు బాపయ్య

## సౌందర్య హాసినీ!

మెరపులై తారలై దరిదాటు తరఁగలై
సంజకెంజాయతో స్వామగాఢతో
తళతళని మెరయు నీకరవలయజాలతో
లేమబ్బులో దాగి లేనవ్వు మెరపునే
చల్లగా మెల్లగా ఉల్లాస మొలకగా
విసరినై చిరునవ్వు వింతరమ్యాకృతినై
పిలపించు హృదయమే విరియగా విరుగగా
ప్రణయినివి నీవె, సౌభాగ్యరేఖవు నీవె!

సంధ్యాతపస్విని, సౌందర్య హాసినీ !
ఎన్నాళ్ళ ప్రేమ ! ఎన్నాళ్ళకో సుఖము !

## విధి.

ప్రేమపిపాసచే నిటు తపించి కృశించి నశించిపోతినీ
మామకశుష్కజీవితము మౌనముతోనె సహింతు గాని నీ
కాముడు తేఱు స్వాగతంపగన్నుల బాష్పకణమ్మె నిల్చెనా—
జీవితమల్లికా ప్రసవసిద్ధి లభించిన యంత యాశతో
పావక రాగపూరితహృదంతరసీమ నలంకరింపగా
అవిధి శాసనానుగతి నంతము చేసిన మారుతాహతిన్
పూవులు రాలకల్ కలిసిపోయిన వీ నవసాంధ్యవేళలన్.

## నిర్గమనము

కడగంటిచూపుల కడ లంటగానె
మింట క్రొమ్మించులు మిలమిల మెరసె
కొలనిలో కుముదాలు కిలకిలనవ్వె;
బ్రతుకెల్ల నొకసారి పరిమళించినది !

నింగికి నెగసెను నీగానసుధలు
తరళించి నటియించె తారకాకాంత
అలలతో మువ్వంగ సెలయేరు లన్ని
బ్రతుకెల్ల పాటగా పరిణమించినది !

ప్రణయినీ, నిను గాంచి భ్రమయుచునుండ
బ్రతుకెల్ల నొకసారి భగ్నమానవుల
మృత్యురేఖలలోన మాయ మైనావ !
కల్లయేటి రొదలలో గలసి పోయితివ !

ఇది మనోజ్ఞ ప్రకృతిధామ మిచట జేరి
అమృతపేశల నవమాధురిమను గూర్చు
విహగకుల కూజితధ్వని విధములందు
స్వీయకంఠారవము మేళవించుకొందు.

అత్యంతప్రమదప్రదం బగుచు నత్యాశ్చర్యముం గూర్చు నీ
ప్రత్యూషస్ఫురదభ్రకుడల విభావైచిత్ర్యముం గాంచి ప్రా
కృత్యారాధ్య మహాద్భుత ప్రతిభకున్ హృష్టాంతరంగుండనై
నృత్యక్రీడల దేలిపోదు నను నేనే విస్మృతిం జెందుచున్.

ఇది నవోజ్జ్వల మమృతరసైకమధుర
మిది మనోహర మానంద సదన మిద్ది
ఈ ప్రకృతి గర్భకుహర కాంతి ప్రసార
వీచికామార్దవమున నకు వివశమతిని!

సృష్టిప్రేమ రసార్ద్రవీచికల నశ్రాంతమ్ము దేలించు నీ
సృష్టిప్రాభవమూర్తికిన్ హృది సమర్పింతున్ కృపామాధురీ
వృష్టిం జిందెడు దేవిగా ప్రకృతిమూర్తిం గాంచి యర్పించెదన్
సాష్టాంగప్రణతుల్ నిరంతరము సాహస్రీతిరేకంబుగన్.

## స్వర్గ దేవతలు

ఆకసమందు మోహనము లైన పయోదము లచ్చటచ్చటన్
ప్రాకుచు తేలియాడి చెదరన్ వెలిగించితి రెవ్వరో తరం
గాకుల దీన గానచలితాబ్ధికి నాట్యము నేర్పు చంద్రమః
శ్రీకమనీయదీపశిఖ; నెవ్వరు వెన్నెల లిట్లు నిల్పినా!

మీ తెలివెన్నె మోము కనుమీకృత నాకహృదంతరాళ ని
ర్యాతపరీమళ మ్మయిన రమ్యశశాంక మణీ చిరాలితా

తారాలలో నివాస మిక నుంచుదు నేటినిశీథచంద్రికా
స్నానము మానినా, గగనసింధు సుధాపరిషేచనోజ్జ్వల
ధ్యానములన్ మదీయహృది దాచిన యాస్యప్రతిభావనాగరు
గ్నాత్రిహితమై చరించెదను దారవనుదాగవు కాల మెల్లడన్.



నిజంగానే నిఖిల లోకం నిండుహర్షం వహిస్తుందా!
మానవాళికి నిజంగా నేమంచి కాలం రహిస్తుందా!
నిజంగానే నిజంగానే నిఖిలలోకం హసిస్తుందా!
దారుణద్వేషాగ్ని, నిండే దానవత్వం నశిస్తుందా!
బానిసల సంకెళ్ళు బిగిసే పాడుకాలం ముగుస్తుందా!
సాధుతత్త్వపు సౌదాత్త్యం సాధుసత్త్వం జయిస్తుందా!
జడలు తెగిన సుమాలు క్రమ్మిన కడలి నృత్యం రమిస్తుందా!
నడుము తడబడి సడలి ముడుగక కడలతీరం క్రమిస్తుందా!
నిజంగానే......................

## అద్వైతం

ఆనందం అర్ణవమైతే
అనురాగం అంబరమైతే
అనురాగపు టంచులు చూస్తాం
ఆనందపు లోతులు తీస్తాం.

నీ కంకణ నిక్వాణంలో
నా జీవన నిర్వాణంలో

నీ మదిలో డోలలు తూగి
నా హృదిలో జ్వాలలు రేగి
నీతలపున రేకలు పూస్తే,
నా వలపున శాకలు మూస్తే
మరణానికి ప్రాణం పోస్తాం
స్వర్గానికి నిచ్చెన వేస్తాం.

మానసానికి రాణివి నీవై,
వ్యసనానికి బానిస నేనై
విషమించిన మదీయ ఖేదం
కుసుమించిన త్వదీయ మోదం
విషవాయువులై ప్రసరిస్తే
విరి తేనియలై ప్రవహిస్తే,
ప్రపంచమును కరిమాగిస్తాం
భవిష్యమును పరిపాలిస్తాం.

వాసంత సమీరం నీవై
హేమంత తుషారం నేనై
నీ ఎగిరిన జీవ విహంగం,
నా పగిలిన మరణ మృదంగం
చిగురించిన తోటలలో నో,
చితులుంచిన చోటులలో నో
వలయములై చలించినపుడే
విలయములై జ్వలించినపుడే
కాలానికి కళ్ళెం వేస్తాం
ప్రేమానికి గొళ్ళెం తీస్తాం.

# ఋతుపరిదేవనము

మావిచిగుళ్ళు మేసి రసమంజులగీతము లాలపించి పే
మావిలముం బొనర్చు నగ మంతయు కోకిలబాల, పూలవా
త్సల్యతో వసంతము సుధామధురంబుగ దోప, మున్ను నా
జీవిత మిట్టి శోభల హసించిన దంచు దలంచి యేడ్చెదన్.

లతికాపుంజము శోషిలన్ దీవలు గాలన్ వృక్షశాఖాగ్రసం
తతులున్ కాంతివిహీన మొందగ సమస్తం బైనలోకంబు నీ
గతి నార్తిం బడద్రోయు గ్రీష్మముఖమున్ కన్నారగా జూచి నా
బ్రతు కీనాడు తపించు నిట్లె యనుచున్ భావించి నే నేడ్చెదన్.

ఘనులం జీల్చుతటిత్ప్రభాకలితమై గంభీరగర్జాప్రతి
స్వనఘోరమ్మును మోహనమ్మునగు వర్షాకాలమాధుర్య మెం
య్యన దోపంగ, వియోగభారభరితం బై మంజులం బైన జీ
వనమున్ ద్రోసినయాదినంబులు మదిన్ బాధింపగా నేడ్చెదన్.

శరదజ్జ్యోత్స్నల రాల్పు జాబిలి, లతాంతశ్రేణిశోభల్ మనో
హరతాసౌరభయుక్తమౌ కసము నిండారన్ శరత్కాలపు క
న్వారు తేతేరగ జూచి మోహకలితన్ రాణించు నాజీవిత
స్మరణానందము గొంత బోల్చి విఫలాశన్ మగ్నుడై యేడ్చెదన్.

ఎరకలు మోడ్చి గూళ్ళ వడి డాగక పక్షులు తల్లడిల్ల దు
ర్భరతర శైత్యబాధకు ప్రభాతము లేలు, సమస్తలోకమున్
కరము వడంకిపోవ హిమకాలము గాంచి భవిష్యదర్థముల్
స్మరణ మొనర్చి దుస్సహవిషాదము నొంది వడంకి యేడ్చెదన్.

ధరణిని రాలినశుష్కపత్రవితతిన్ శార్మ్రరు గావించు శీ
తస్మెరలన్ శైశిరవాసరోదయము లాగా, మిథ్యాప్రపంచంబు న
శ్వర మీ కాంతులు రాలిపోయెడును సమస్తం బస్థిరత్వంబె యా
తరవీథిని గలిగింప జాలునని కాపించి శ్రీ శేద్భవన్.

## గాఢ యత్నము

ఒక్క చినుకున కావించి యుర్వి యెల్ల
ప్రతినినద మిన్ను సుకుమారతలు సల్పి
ఎంత కాలము గాఢనిరీక్ష చేసె
జలద తతి చూచి వానకోయిల యుత్కంఠ!

నవ్యలావణ్యములు చిన్కు ననలు గాంచి
మధుర మధుపాన కాంక్షమై మరచిపోయి
శూరిర కంటకశాఖలు గుచ్చుకొనగ
యతన మొనరించు భ్రమర మేగతి శ్లాఘింతు.

ప్రబల గ్రీష్మాతపంబు సైపంగ లేద
వానదెబ్బలు సోక సోల్వంగ లేద
శీత వేడ్కల తాపము పండించుకొరకు
కర్షకుండెంత వెంతలు గాని పొందె.

ధూళిసర్పంబు బుసకొట్టు పొదలయందు
ముద్దులొలికెడు కేదంగి మొగ్గ చూచి
అందుకొను వాంఛతో నొకయధ్వగుండు
ప్రాణములు సైతమెంతటి హానికోర్చు!

# శ్రీ గణపతి శాస్త్రి

## వాసంత స్మృతులు

ఇమ్మధుర వసంతపరిమళ మ్మలమిన తెమ్మెరలో,
జన్మని తీయనితలపుం దుమ్మెద లెద రేగ నోహో!

భారతారుణోదయ మందార కుసుమ వర్షములో,
దూరగౌతమీ తరంగ వారి మృదంగధ్వనిలో,
అరుచిరప్రథమ మధు కుమార పికకుహూరుతిలో,
ఏ ఋషివరు లుపనిషదోంకారమహాశ్రుతి వినిరో!

కోరకితనూశీతల సహకారభృంగ ఝుంకృతిలో,
ధీరరాణ్ణరేంద్ర సౌధపారావత గళరుతిలో,
పారిజాతవాసిత వరనారీముఖ మధురుచిలో
ఏరసికవతంసు లాంధ్రభారతామృతము గ్రోలిరో!

శ్రీరమణీయాంధ్ర రమాధూరి మధుమహమ్ములలో,
వీరారెడ్డినృపతి నౌవిహార వారిపూరములో,
వారసుందరీ వదనము లారతిడిన సంజెలలో,
ఏ తెలుఁగుభూపుల గోదావరి వెలుఁగు కలగనెనో!

దూరదూర భావికాల భూరగభీర శ్రుతిలో,
తారాహారాంచిత సంధ్యారుణ గోదావరిలో,
వారి విహారోత్సుక నరనారీగళ హసితములే,
మారుమ్రోయు మందబలాకి రవకలకలమ్ములై!

ఇమ్మధుర వసంత కలకల మ్మలమిన తెమ్మెరలో,
జన్మని తీయనితలపుం దుమ్మెద లెద రేగ నోహో!

లలితపు నీలివెన్నెల వలాహకసౌధమునందు దేవక
న్యలు సెల విండిపోసిన రయోయాటపు ముగ్గు లనంగ తారకా
వలులు మినుక్కుమినుక్కు మని పర్వుచు పోరాడి కాంతులం దృగం
చల సుభగంబు లయ్యె నిమిషద్విరజీవనసారసంపదన్.

చనవు లొసగిన పుణ్యదంపతుల స్వచ్ఛప్రేమచందాన, జీ
వన సారస్య సుధామయాంతరవరీవాహంబులం బోలి, పా
వనదీక్షాంతఫలప్రశాంతిగత సత్త్వస్ఫూర్తి యున్నట్లు మో
దినిపై తెల్లని కట్టె చంద్రికలు ప్రీతిన్ వ్యోమభూమీచ్యుతిన్.

మూకసుషుప్తిలో మునిగిపోయిన నా హృదయంపువీణియన్
సోక మృదుస్వరప్రణయచోదితరాగఝరంబు లేమ వి
శ్వాశ్రితిముగ్ధగానసరసత్కృతు లేవో వినంగవచ్చె నా
చీకటిరెమ్మల న్నడుము జీల్చి యఖండత పిచ్చిలింపగన్.

భారతయుద్ధము న్భగించుతుండు పార్థు ననుగ్రహింపగా
గోరి వచించినట్టి హితకోమలగీతల యార్ద్రవృష్టిచే
జేరల సామనామధురచింతనగానము నాపభావతిం
జారిన రేయిరేడం యఖండస్థితి నాలపనం బొనర్చెనో!

ఆమధురాపురీనవవిధమందున వచ్చికబీళ్ల వల్లవీ
భామలతో జగద్గురుడు పాడిన పిల్లనగ్రోవిపాటలే
నేమొ, చిరంతనస్మృతి వహించిన యామినివాధిదేవతల్
ప్రేమమెయిన్ నిశాంతరపులీలల నీగతి పాడుకొందురా!

## పశ్చాత్తాపము

తెలియక యెన్ని యేండ్లకాలదిన్ దృఢనిష్ఠల కిల్బిషక్రియా
కలితుడనైతినో; ఇరులకంపల బూచిన నల్లపూలరే
కుల నిబికల్ ప్రియాణమునకు న్వెకరించెను దండధారులన్
గలిపిన యామినీప్రకృతి కన్యక తారల దీపకాంతులన్.

మను నొక్కకసారి నా నడచిపోయిన దృప్తపథంబు జూడ నే
మ్మన్నది యేయెలుంగో? మతి నాచిన తీవ్రవిషాదకీలలు
త్పన్నములై దహించినయెడ న్గనిపించును! కొండగుట్టలె
న్నెన్నిటినో తరించితి మహిన్ ప్రతియుద్ధకదర్పచారినై!
పెరుగక యుండె పండయిన పిండివిధంబున జీవనప్రభా
త రుచులు దోచి తోచక నితాంతవిచంచత నాక్రమించి యా
వ్యరికి నపార్థమైన యెలబ్రాయము పొంగు లడంగిపోయె ని
ష్ఠురపరితాప వహ్నికణ శుష్కతనూ పరివేషణంబులై.

గాలికి నల్లలాడు లతికం గను మున్పట బోవనోవ; ఇ
ల్లాలి పవిత్రమానస విలాసరుచుల్ చవిజూడనైతి, నే
కాలమునందు పేరగతకర్మల వాసనలైన జూడ; చి
త్తాలయమందు నీశ్వరపదార్చన చింతన సేయ నెప్పుడున్.

మాలిమి గన్న తండ్రి యుదమానభరంబున కోడి యేమొ పి
త్రాలయమందు పెంచెనటు భాతృశిశుత్వ లవి తారకంబులై
శ్రీలె నభంబునం దడ చితేయునె నాకలు పాంధకారకం
కాలములన్ సుఖానుగత కాంతికరంబితపావరేఖలో?

చీటికి మాటికిన్ వెతల జిమ్మ గతంబుగు జ్ఞప్తి చెప్పు చి
త్రాటవి యీవిభావరి, దయాస్మృతికూన్యము! పాడుకొందు నే

# శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

## జీవిత కావ్యం

ఒకవరి దీనమానవుం డొత్తెడి జీవనభారతీవ్రబా
ధకు, దురదృష్టరాగ బహుధాద్భుత చిత్రవిషాద గాథకున్
సకల జగమ్ము నంటిన ప్రయిశాంతికి విప్లవరక్తకాంతికిన్
తుకతుక వేగిపోవు నవ దుఃఖమయమ్మయి పల్క నేదిరా!

ఆమని జాజిపూవుల రయిబ్బారము నావయి చైత్రమాసపు
భ్రావ్యమృతచంద్రికా మధుర యామినులన్ కలకంఠగీతముల్
కోమలినీ నేత్రములలో విలోలితమాల్య మాధురుల్
ఏమియు నివ్వలేవు రగిలించుము నాయెద క్రొత్తపాటకై.

గతము, పవిత్రమానవుల కొంతకాలము కాంతిహీనమా
బ్రతుకున మాత్రుదుందుడు నొక పాటయె గానవేణుగీతమై
వెతల గరంగి లోకములం దీడు మనోరథ దివ్యయాన సం
గతులకు ఆత్మజీవితమె కావ్యము సిద్ధపదయ్యెక జీవమ్మమున్.

## ఆత్మకథ

శరత్కాంతుల మెత్తని చిన్ని యెదల
లోన ననురాగ వేదనాష్టాంశముగ
సుందరి నిశ్చలాప్రాంగ శోధముంచు—

బాల భానుని, లేకిరణాల చిరుత
పద్మదనముల కన్నులు విప్పి నవ్వ
మృదుల సుమబాల సుస్నిగ్ధ వదనమందు—

బ్రిదుకులో తెగపోసిన బరువు దించి
నడువలేక నడువలేక బడలివచ్చు
మానవుల నాదరించెడి మననమందు —

చెదరు మానిమాపు వెల్గులో చేరవచ్చి
హృదయమున కొత్తుకొను తల్లి రెక్కలందు
పొరలి కనుమూయు చిన్నారిపులుగునందు
విశ్రమించిన శాంతిదేవీ! "నమామి"

కరము హృన్మర్మనిర్భేద కారణమ్ము
ఆజవంజవ పరివర్తానుభవము
రాచి రంపాన బెట్టినదోసి రూపుడు
శాంతి దేవత మృదుపద స్పర్శ లేక.

కర్షకుండయి కేదారఖండములనో
పేదబానిసయై ప్రభు పాదములనో
అడగి పడియుండబోక యీరొండెడ కేల
తరిమి బ్రదుకెల్ల కాల్చు సౌందర్యచింత?

అసలు నాకీ ప్రపంచమే అర్థ హీన
గూఢ మూఢ కావ్యమ్ముగా గోచరించు
విషపునవ్వులు కంటక వీక్షణములు
ప్రతి పరిచ్ఛేదమున అడ్డుపడును నాకు.

## జ్యోతిర్గీతి

నవ్య జ్యోతీ, దివ్యజ్యోతీ!
తెలుగుము వెలుగుము విరాజు మెరుగక
మూఢ గాఢ విశ్వాసము కాల్చి
శ్రిత హృదయముల బలి గావించి

# కృష్ణవేణి

పర్యంకమందున కృష్ణవేణితో
చేయి తలాడగ శయనించిన నా
ప్రియని చేరితి ప్రేమాతురతన్.

పెదవుల తృష్ణల్ మెరసెడు హాసము
ముగ్ధతయాస్వేసుమ మృదుహాసము
మార్త్యవముడిగియు నిర్వాణ సుందరీ.

దేహాసక్తిపై దృష్టి లేదు
మన మూరకయే వేణి వహించగ.

నేత్రద్వయమే యొక భృంగరాజమై
కుంతలాళిమధుపానము చేయున్.

అవశం బగు నా పాణిద్వయ మా
కృష్ణవర్ణ మావేణిక నిమురుచు
కేశబంధనము విదళించెగ.

వేణిబంధములోని పాణిద్వయము బట్టి
నిదుర తొగేకనుల వాల్చుచున్ నను జూచె
మందస్మితాస్య అస్మత్ప్రేమరాజ్ఞి.

చిగురించిన చిరునవ్వు మోముతో
జీరాడెడి శైవాలపాశముతో
నా మోము కప్పి తనమోము చేర్చె
ననురాగరక్త నా ప్రేమశక్తి!

# అనునయము

చీకటిదారులందు వికసించిన వెన్నెలరేకవోలె నీ
కూఁకటివేణి మల్లియల గుంఫనముల్ సొగయింప ప్రేమ బి
బ్బోకవతీ, నిశాంత తమముం హసియించుచునుండె నిప్పు డీ
చీకటిలోకమందు విరచించెనటే సుపథమ్ము నాకునై!

వీణియ మీటినట్లు వినిపించె త్వదీయ మనోజ్ఞ కంఠమున్
తేనియ బోలు గానమున దేల్చిన నీ మధురాధరమ్ము లో
కాన అనన్య లభ్య మట, కాంత! స్ఫురించెను నాయెడంద నే
డో నవకమ్ము ప్రేమమయ తోయజనేత్రి, విచిత్రరీతిగన్!

త్రెంపగబోకు నావలప్రతీవను ప్రేముడి బెంచుకొంటి, నా
లింపు. ప్రశాంతి విన్నపము లేమ, మదీయ హృదంతరమ్ము గా
వింపు తృతీయ మందిరము వీసరవోవునె యీభవమ్ము! ఓ
చంపక గంధి, నీ హృదయశాలిక కీలిత మాతనూలతన్!

నీ వొక పూవువోలె హవణిల్లిన నాడె స్ఫురించె లోన నా
జీవనశోధ నవ్యమరసీమల నందనవీథులందు సౌ
ఖ్యావధి గోచరింప హృదయమ్ము నొసంగి సువాసనా మనో
జ్ఞామృతులందు దేల్చి సుఖమందున బిందులు చిందు సంగముల్.

కంపను జూచి నీరదము చాచిన చేతిని జూచి నేను నీ
వంపులు దేరు దేహమున వన్నెల చిన్నెల కన్ను బెట్టి నీ
చెంపను చెంప జేర్చి మరి చెప్పగ నెంచితినే రహస్యముల్
'ఇంపును సొంపు నింపు హృదయేశ్వరి, విశ్వము నశ్వరమ్మటే!'

శ్రీ దేశిరాజు కృష్ణ శర్మ

# శ్రీ దేశిరాజు కృష్ణ శర్మ

## నీడలు

౧

ఛాయాజీవిత సాంధ్య దేహులము
సందేహాస్పద మందేహోజ్జ్వల
నిందాగర్భిత నీడమార్గమున
చల్లని రోజున సాగి వచ్చితిమి.

౨

చావు బతుకులకు సంధి మెరుపులకు
చల్లని దృష్టికి మెత్తనిమాటకు
ఇల్లయి మెరసిన యిరుకు మేడలో
నాల్గుదిక్కులను నగద్వారముల
ఎక్కడ చూచిన ఇరులు క్రమ్మగా
దారి దొరకదని తల్లడిల్లితిమి.

౩

సుందరరూపము సురుచిర కాంతులు
సవ్యాకర్షణ దివ్యోజ్జ్వలములు
స్వర్గ మార్గములు మూడుచాయలుగ
లోకా లోకపు జ్యోతిర్గతులలో
మా భావోన్నత దీప్తులు నిలవగ
మేమే సత్యము మేమే సర్వము.

౪

క్షణిక భాగ్యములు
ఛాయా సౌఖ్యము

ఏ మహాపూర్వ సాంప్రదాయంబు కొరకు
వెలిగి మాసిన మహాశయజ్వాలల.
యుగ యుగమ్ముల తీర్థయాత్రికుల కెపుడు
దారి చూపెడు మహిత తేజంబు గాక
వెలిగిన దీపంబు వెలిగినట్టే యుండ,
నీ శిఖర దీపాన నిశ్చల ద్యుతులలో
మానవ తేజంబు మాసిపోయిన దేమి?

౨

ఓ సామి, నా సామి, ఇన్నాళ్ళు పిలవుగా
ఈనాడు నాకింక కను విప్పినావయ్యా!
జారిపోయిన వయసు చేవపోయిన మనసు
కరగిపోయిన ప్రీతి, పట్టు తప్పిన నీతి,
నిలిపి వెలిగించినా నిర్మలజ్యోతులా'
సఫలిత ప్రేమలో సంతోషదీప్తి
విజ్ఞాన మార్గాన వినయ విశ్రాంతి
కైవల్య పరికృతికి కామ్య మనోహారికి
మంగళారతు లెత్తు కుందు ముత్తయిదువుల్
శిఖర దీపపునీడ చిందించునట్లుగా
నా హృదయ వీధిలో నవ నవానందంబు
నాట్య మాడే నిపుడు! .........

## సంధ్యా రాగిణి

వ్రాలిన కొప్పులో సుమపరాగము నిత్యమనోజ్ఞ సుస్థిర
శ్రీలలితంబు, నీవలపు సింధువులో చిరుగాలి తెప్పనై

తెలిదుమోహానాకృతిక తీరనిదాహవిముక్తి సేతు, సం
ధ్యాంశులీలాంగి, నాకొరకు వార్పుకుమీ విడబారుక్రొమ్ముడీ.

నీ తెలిచెక్కులంటినవనీలిక కేశములావిరంగు క్రొం
బూత ప్రపంచఘోషకును మూకత దిద్దును లేతలేతజీ
మూతము లెల్ల సైకొరగి మూగెను నీయొడియందు, ముగ్ధవై
పాతరలాడు విభ్రమయభావమునన్ పరితృప్తి నైతివో—

చీకటిదోసలో ప్రణయజీవవిముగ్ధులు దోర్వధునీప్రపత్
పేటము జాలుగట్టిన గ్రిదించిన సంస్మృతిసాగరంబులో
పేర్కొని మెల్లమెల్లగ గమించెడి వేళ, మనోజ్ఞ సైకత
స్థిరత కొప్పువెట్టకుమ, చేర్పకు నల్లనిపైటవాటులన్—

ఆచరమాబ్ధిలో ఒకరిహాస్యసుధాపరివృత్తి చూడు, సం
ధ్యాచరమావధిన్ పరిణతాకృతి పూచెను, ఆమనోజ్ఞ రే
ఖా చిరభాగ్యముల్ కలల గాంచి తపించెదుమానవాళికిన్
దాచక పంచిపెట్టు మొకనాదును తీరనిజీవితాశలన్—

ఈ తెరచాటు సౌగంధ్యవలయాకృతినై మురిపించు వాసవల్
లో తపియించుటన్ మధువ మోహినిసిగ్గుల వోలె, రెమ్మ సం
ధ్యాతరుణీమణీ, ప్రణయతల్పము నుండి, మనోజ్ఞ వాసనా
స్థితిని నీలనీరదకరీయులు కూడిరి పల్కరింపగన్—

చాలదిగాం మీగగన వైవలినీకటియందు సైకత
స్థలపీఠమ్ములో పరియజిమ్ముద నీవొ విమోహదృష్టిలో
భాంషితమ్ములన్ మరియు వ్రాసెద నీవొ ప్రపంచదోషని
ర్మూలన కావ్యసంతతుల మోహనరాగవిశుద్ధగీతికల్—
పాశలుపారల్ మోయి ల్గగనభూమిని జారుచునుండె జీవిత
స్థిరత వహింపకే కరుగుతీవ్రవిమోహితులట్లు-నీదునుం

దర–అరకంకలనంబు విడవాడి ప్రశాంతిపురీశ. పేరుకుం
చరితము పుణ్యభావము ప్రసాదముల్కై వినిపింపు కూటికై —
పరువిడిపోవు ఈభవనభావుకమూర్తి అనేక దేశముల్
తిరుగుచు వచ్చి దీకడ పతించును లోకములోని ప్రేమకుం
శరణమునకై విరాగులగు సాధులపుణ్యచరిత్రలన్ మహా
పరిణతి నందుజీవితశుభాకృతి ఒక్క—తె రీతి తెల్పనా—

## శ్రీ నాగరాజమాహాత్మ్యము

### ఉత్ప్రేక్ష

అకవమ్మంటుకొన్న దదే కవోష్ణ
రక్తరాగరంజితనిశారంభ వేళ!
పావకార్చులతోరణవంక్తు లగుచు
సామిదగ్ధవరాధరచయము నాగు;
అలముకొను సేలకై వాలి యార్చి చిచ్చు
లగ్ధిరాజార్ద్రిమృదువీచికాధరముల
నీలి పొయి వంగి నింగి చుంబించు కడల!

నాయెడద నడఁగు విరహనాసలన గాలి
గాలి బ్రదుకొన్నదో స్వప్నకథవిధాన
శిథిలమై మ్రగ్గి భస్మావశిష్ట మయ్యె,
నార్పరాకివ్వ తిత్తు దయా, అగగలనె,
ఇమ్మహాపహ్ని కూడ వన్నె చొరంగ?
ప్రత్యహాకృత్యనిత్యవ్యాపారపరితప్త-
కష్టజీవి సర్వరాగామితత ని-

తెల్పెదవ దేని యిక నా ప్రతిజ్ఞ వినుము:
లోకమందు గురూపమ్ము రూపు మాపి
చూచుచుండగ సర్వాంగసుందరముగ
నమరజేతు, ముహూర్తమాత్రమున దీని!

## శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి

### ప్రాభాతి

రేగినముంగురుల్ నుదుట ప్రేమసుధామధురైకభావముల్
పోగులు వోయగా నిదురవోవు హృదయామయి! నాయెడందలో
ఆగక పొంగు స్వాప్నికరహస్యము తెల్పెదవో నీదుగుండెలో
దాగుడుమూతలాడ సరదాపడుచున్నవి కన్ను లెత్తువా!
తూగిలిగాఁ గూడునవె నీ మలయానిలరాగడోలలో
నూగుచునుండె నాతలపు లూరక; నీకబరీభరమ్ములో
దాగినకేతకీసుమనమంచిత సౌరభవీచి పైఁ బయిన్
మూగి స్పృశించి నాహృదయమున్ కదలించుచునుండె ప్రేయసీ!
రాగము నిండుకొన్నది తరంగిణి; బాలమరీచిమాలికా
స్వాగత మిచ్చె పద్మిని హసన్ముఖయై; మఱుదొడ్డిలోని పు
న్నాగము కప్పుపోసె సుమనస్సులు; కోవెలలో విపంచికల్
మ్రోగెను; లెమ్ము పోదము ప్రసాదముతో మనమూర్తిపూజకున్.

### అద్వైత మూర్తి

చూచెద వేలనో ప్రణయసుందరి! కాటుకకళ్ళలోని అ
లోచన లేమిటో హరిణలోచన! నీచిరునవ్వులోని సం

ప్రేయసి ప్రేమలోన కనిపించెడి తీయని స్వర్గ మొక్కటే
ధ్యేయము గాదు హీను లతిదీనులు మ్లానతనుల్ దరిద్రనా
రాయణు లెప్పు డుండిరి, తదశ్రువులం దమరంగ బొమ్మ్కు—నీ
ప్రేయసితోడ నీకట లభించును కోట్లకొలందిస్వర్గముల్.

బుద్ధుడవై సుపుత్రుల ప్రబుద్ధుల జేయుము శాంతసత్యధ
ర్మోద్ధరణార్థమై బ్రతుకు నొగ్గుము మానవసంఘసేవకై
సిద్ధికి తోడ్పడ, వత్సలత చిందెడి ప్రేమధారాస్రవంతులన్
శుద్ధ మొనర్పు ముజ్జ్వలయశోధర, జర్జరితప్రపంచమున్!

లె మ్మిక మేలుకొమ్మ! కదలింపుము క్రాంతిరథమ్ము శాంతిమా
ర్గమ్మున, కాంతిపుంజము లఖండములై నవజీవనప్రభా
తమ్ములు నింప, సర్వసమతా సుమకోమలమానవాంతరం
గమ్ముల ప్రేమమూర్తి యన గట్టుము మంగళతోరణమ్ములన్.

గుటగుటలాడ ప్రాణములు గొంతుకలో పసికన్ను గొల్కుచున్
బొటబొట రాలు బాష్పకణపుంజము బోయన చెప్ప నల్లదే
కటికటపాయి కొంపుమరకత్తె గనుంగొని గొర్రెపిల్ల; సం
దిట గదియించవే! దిగులు దీర్పవె, ముద్దుల జగింపవే!

ఈమహి స్వర్గఖండ మొనరింపుము ఘోరహాలాహలమ్ము ది
వ్యామృత మాచరింపుము జయోస్తు కుమార! శిరస్సుపై నహిం
సామకుటద్యుతుల్ దశదిశల్ వెలిగింప ప్రపంచ మెల్ల నీ
ప్రేమరసైకవృష్టి గురిపింపుమురా! కరుణాకళాధరా!

శ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి [illegible]

# ప్రబోధము

[కురుక్షేత్ర మహాసంగ్రామంలో నిర్వణ్ణుడైపోయిన
భారతవీరుడు అర్జునునితో శ్రీకృష్ణుడు]

అల వారణావతి ఘోరవహ్న్యుజ్జ్వలిత లాక్షాగార యాక్షారుణ
జ్వలన జ్వాలిక లీ విశేషమునకున్ చల్లారలేదే మహో
జ్జ్వల గాండీవము సజ్యమై శరములన్ కర్షింపనేలేదె యీ
కలి నీ కోర్కుడ దాపురించినది? సంస్తంభించె సర్వాంగముల్.

అంగేశుం గని భీతి నందితివొ? ద్రోణాచార్య వీక్షించి యీ
కంగారైతివొ? ధార్తరాష్ట్రశతమే కంపమ్ము గల్గించెనో!
గంగానందను గాంచి సంచలనమున్ గన్నావొ! సంగ్రామమే
సింగారమ్ముగు రాచపుట్టువున కిస్సీ! యింత క్లైబ్యమా!

రారా దివ్యము రాజ్యమేలగ నీ ఆహారస్ఫారదోస్సారమే
పారన్ రాజుల వాజాలన్ గెలిచి నా డాసేతు శీతాచల
హర్మ్యరాజ్యమ్మును పాండురాజు పాలింపన్, నేడిటుల్ కొల్వనిం
గారమ్మై కురువంగ బుట్టిరి దొరల్ గాంధారి గర్భమ్మునన్!

త్రాటం గట్టిరి, నీట నెట్టిరి, విషాక్తమ్మన్నమున్ బెట్టి రే
చేటున్ వాటింతురిక కష్టపడి కౌంతేయాత్రి కంపించి, ర
చ్చోటం గొంపకు నిప్పుపెట్టి, రడవుల్ చుట్టించి, రాపాధ్య కా
పాటుల్ గూర్చిరి, భాగమీయ మనిరబ్బా! యెంత భ్రాంతమో!

అది యొక్క వీరభారతకులాంగన కంటికవోష్ణబాష్పబిం
దువులు ధరిత్రిపై పడియు దుర్భర దుస్సహ దుర్దినమ్ము ఆ
య్యావి పదిరుందిలో నొక మహాసతి పైట చెరంగు పట్టి ధ
ర్మ్మతి దిగలాగి రక్కసిప్రభుత్వము లాగిన దుష్టహస్తముల్.

అది పాంచాలి పటాంచలాపహరణమ్ము కాదు, తత్కౌరవాం
త్య దినప్రేరిత కటాంచలాపహరణమేయా నాటిక ద్యూత పా
ల్గొని కేళిగ్రహణమ్మటే వికటనృత్యన్మృత్యుకాంతా భయ
పద కేళిగ్రహణమ్ముగాక, ధవళవ్య మ్మెంత దుర్లంఘ్యమో.
శుద్ధాంతమ్మును రచ్చకీడ్చిన నికృష్టుల్ నష్టులై పోవుటే
సిద్ధాంతమ్ము ధనంజయా! విజయలక్ష్మీ కాంతి సంక్రాంతమై
యుద్ధాంతమ్మున వీరశూరతము నిర్వ్యాపృత్తమౌ చాలు నీ
రాద్ధాంతమ్ములు కార్యసిద్ధికయి కారా! కాని సాధింపరా!

— విజయశ్రీ కావ్యమునుండి. —

## శ్రీ కృత్తివాస తీర్థులు



కృత్తివాస తీర్థ స్వామి! కర్త నడిపోరి నోయి!
అందరాని నీ కోసమె అశ్రులు చాల్చితి నాథా!
మిణుగురు దీపము చేగొని మిణుకు మిణుకు తారల గని
తిరిగితి నీకై కలలో, తూలిపోతి ప్రాణనాథ!
మది ప్రిదిలి పోయినది వ్యథల ప్రతుకు కొందులకు
నిను పొందగలేక నిలువలే దీ నాపి!



పులకించె జగ మెల్ల విరిసినవి దిశ లెల్ల
రసమయ మైత్రి మనసు రాణించి వికసించె.
మధువు లొలికించె నీ వలపు గురిపించె నీ
మమతాకారము యూని హృదయమును కొల్చె నీ.



ఏ దారి పోయెనే? ఏ దెసల పోయెనే?
శ్రీకృష్ణ మేఘమ్ము చిద్విలాసమ్ముగా
శీఘ్ర హృదయానంద సీకరణి కాదే!
తాపమ్ము తీరదే తప్త జీవన చాత
కాంక్షితము రాదే!
నీలాల వక్షమ్ము నేను కన్పడదయ్యె!
ఆశలే రూపులై ఆ కాంక్షతోనుండి
నింగి చూచునె నాదు నీలాల చూపులకు!
నీలిమబ్బులు కొంచి వానకాకని యెంచి
ఆశలే పురివిప్ప ఆడెనే ఎదలెల్ల!

— రోహిణీలా శాస్త్రి —



వసంతయామిని! రావే రావే
వసంత మాధురి రావే! రావే!
కోకిల కాకలి కోమల మధురిమ
ఎద భరించదే ఏమి చేతునే!
తళ తళ మెరసెడి దరహాసములే
కత్తియంచులై కోయును నాయెద!
ఆమని మత్తున ఆధి బాధలను
వలపు భారమును సహింపలేనే!

అప్పుడు:

కలవరించాయి కోటి కిన్నెగీతాలు
తళుకుమన్నాయి చుక్కలు ఒక్కసారిగా
అత్మాంతరాలలో ఆకసపు రెక్కలే
అర్చికొని మ్రోగినది అగ్నివలె గానమ్ము.
సర్వేంద్రియాలకును స్వరకల్పనము చేసి
ఒకసుప్రశాంతిలో ఒదిగిపోతిని నేను.
గాలిలో వైజయంతీలాలసాలతో
నాలోని అణువణువు నాట్య మాడింది.
ఆమహావేగమ్ము అట్టిస్థాణుత్వమ్ము
అలవాటు లేక నే నలసి మూర్ఛిలినాను.
తీరవలసినవాంఛ పోరవలసినపోరు
లేక తన్మయతలో లీన మయినాను.
కోప ముత్సాహముగ ఈ సాక్షమంత్రిగా
గరువ మొక గురువుగా పరిణామ మొందినవి.

కాని:

కాల మెరుగనికోటికంఠద్వారాలతో
అవ్యక్త స్త్రీమూర్తి అవతరించినది—
తల్లిగా రాజ్ఞిగా రతి జీవశక్తిగా
దశదిశావధులను దాటి వ్యాపించింది.
కరడుగట్టినకష్టకాలానుభవముతో
పదునునవ్వులు రెండు ఏక మయినాయి
స్పందించు ఆగుండెస్పర్శ నాదోదయంలో
నిలువనిగగ్గోలు విలయించి లేచింది,

"ఓ వలపు వెల్లువల ఓలలాడేకన్నె
ఒక కౌగిలింతకే ఒడలు మరిచేవ!
తుళిక మోహాంబర స్వర్గాన్ని మించిన
ఆనందమే నీకు కావరాలేదా?
"నా ఒడలు కౌగిలింతల నలిగిపోయింది
ప్రేమతో నాగుండె ప్రిదిలిపోయింది
ఆరక్తరేఖలే చారికలు కట్టినవి
ఆనాటిగాయాలు మాననేనాటికిని."
"సృష్టికాధార మౌ జీవశక్తిని నేను
వలపు నాకానిసే ప్రకృతి నారాజ్యమే
కోరి నీయంత బంగారు సంకెళ్ళ నీ
చేతులకు వేసుకొని స్త్రీని కాలేనేమొ!
"ఓ వలపు వెల్లువల ఓలలాడేకన్నె!
ఒక కౌగిలింతకే ఒడలు మరిచేవ!"

## నా పాట

నేను పాడేపాట నేర్చుకొన్నది కాదు
యుగాయుగాలకు ముందె ఉన్నదది నాలోన
పాట పాడుట రాని భగవంతుడే నన్ను
సృష్టించుకున్నాడు చిన్నివేణువులాగ.
దివ్యాలోలేని నిశ్చేతనత్వమ్మునకు
నేను వాక్కును నేను గాన మాధురిని.
నిప్పు రూపులో లేని నిప్పులా అనాదు
దేవు డొకమూర్తిలో దేవులాడేవాడు

మేఘగర్భములోని మెరయు విద్యుత్తులా
తనశక్తి తనలోనె దగ్ధమయ్యేది
ఎదద మంటలలోన మాటలు వడి తిరిగేటి
తలపులను నానోట పలికించుకున్నాడు,
ఆకారమే లేని అశక్తిలో ఉన్న
అందాన్ని నాలోన అలవరచినాడు.
కదలికలు నాలోన కదుల్చుకున్నా డతడు
నాలోన తననిద్ర మేలుకొని చూచాడు
నాలోని తనశక్తి నాలోకనము చేసి
దేవు డని తను తాను తెలిసికొన్నాడు.

## శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

### అస్త సామ్రాజ్యము

ప్రాజ్యము లైనసంపదలు పర్వులు కట్టినచోటు, లోకసం పూజ్యము లైనధర్మరణము ల్చెలరేగినగడ్డ, సాహితీ రాజ్యము నేలుకొన్నకవిరాజులు పుట్టినభూమి యస్తసామ్రాజ్యము, దానిపై కనుల రాల్తు నఖండబాష్పపూరముల్.

ఆనాటివీరసంతానబాహాగర్వ
మిట్టల మయిన దూహించుకొన్న —
ఆనాటిధర్మసంస్థాపనాచార్యుల
ప్రౌఢచేతశ్శక్తి వనవుకొన్న —
ఆనాటిమహిత దుర్గాష్టమీ బంధురో
త్సవకౌతుకంబుల దలచుకొన్న —

కళలు గడివోయి శుష్కకంకాళము నయి
కొల్లవోయిన పట్టిపాడిల్లు వోలి
మన్నులో దూలిపడి కూరుకొన్నయట్టి
యాంధ్రపట్టణమునికి జోహారు లిత్తు.

ఓయి, జీవచ్ఛవాంధ్రుడా! యుష్ణబాష్ప
మలినతరధారల్లో కొంత రాలుకనిమ్ము,
జీర్ణమైనట్టి తాతలచితులయందు
బూదిలోనుండి నవతరుల్ పొటమరించు.

దైవదృష్టిలో మనబాష్పధార కున్న
వెల మహత్తరసామ్రాజ్యములకు లేదు.
ఆంధ్రివిస్మృతవైభవ మనుభవించి
కయికొనుడు బాష్పకణదిగ్ధకంఠములార!

## వేదనా శతకమునుండి

నీ కనుగోనలందు వెలివీడలు పోసెడు నట్టి లోకర
త్నాకరకాంతి రేఖల వికస్వరమైనది నాయెడందలో
రేకులు విచ్చి - నీవు విసరించిన నవ్వులు కొత్తతావులై
పార్థివ వర్త్మ, యీవసితలంపుల జిక్కని నోముపంటలై.

నే నొక పూలమాల నయి, నీదరణాంబుజసీమ పండి, యా
మ్లానములైన వాసనలు రాలిచిపోవలె నంచు గోరుకొ
న్నాను ప్రియా, దురంతతపసాంతరితంబగు జీవితంబులో
గానని కోర్కెలై, కనులు కాయలు కాయగ గాచియుంటి నన్.

ఒక చేతను బాణమంట ఒక చేతను ధనుస్సంట
మొంక ముంతా చిగురుపువ్వులు మోగునంట, మోగునంట
తానట ఒకవేషమంట నేనట ఒకచాతకమట
తనదూ నా కొప్పటికీ తప్పదంట తప్పదంట
ఏమందుకు పల్కరింతు నా మానస మణిహారము?
ఏమే చిలుకా, పలుకవు చెప్పవటే చెప్పవటే!

## శ్రీ శంఖవరం రాఘవాచార్యులు

### "సంపత్"

### సుధా బాల!

ఓసుధాబాల! ఓసుధాబాల! ఓసుధాబాల!
ఓహూహూ నాబాల, ఓసుధాబాల!
రా, పూలపల్లకీ నిలిపి స్వర్గాన,
స్వప్నమార్గాన.
ఘులుఘల్లు మని గజ్జె పలుక
నీహృదయ మొలుక
నావలపుగిలక, నావలపుగిలక.
కర్పూరపాండురకపోల అధరప్రవాళ మధురప్రమీల
హృదయాంతరస్వప్నశీల ఓసుధాబాల!
రా, పూలపల్లకీ నిలిపి స్వర్గాన!
స్వప్నమార్గాన
జడలోన ముడిచేను చపలినెలవంక
ఎవరికే శంక?
ఏకాంతని[illegible]

సాహసము తెచ్చి
చూడనే వచ్చి చూడనే వచ్చి.
నా హృద్వరజలజవరాల ఆణిముత్యాల లోనిరతనాల
చిత్తసాగరమథనలోల ఓసుధాబాల!
కదలి రావే లోనిమాయ కరగింప
నా హృదయాకంపం.

## గోపాల భిక్ష

సందెకవళం తల్లి - సందెకబళం తల్లి
సందె గోపాల మమ్మా! ... పల్లవి.

సందెగోపాల మమ్మా! సందెగోపాల మమ్మా
సందె కవళం తల్లి, సందె కబళం తల్లి
సందె గోపాల మమ్మా, పేదలకు
సందె గోపాల మమ్మా! ... అను పల్లవి.

సందె గోపాల మమ్మా-సందె గోపాల మమ్మా
అనదలకు, ఆకలికి, కలిగింది, మిగిలింది
సందె గోపాల మమ్మా, చేయెత్తి
సందె గోపాల మమ్మా!

ముక్కోటి దేవతలకై - కర్పూరహారతులకై,
కట్టిపెట్టిన ముడుపు - అక్కొన్న మాకడుపు
అన్నపూర్ణాదేవివై అడుగొను
సందె గోపాల మమ్మా!

అనదలము అన్నదాత! - అంజలిడి లోకమాత!
కరుణించి కాపాడి - కడుపు, చల్లగ జేసి

నడె సదా కోటిపుణ్యం దీనులకు
నందె గోపాల మమ్మా!

అల లెత్తి పిలుచునమ్మా - తల యెత్తి చూడవమ్మా!
యుగయుగపు కన్నీరు ఎగ నున్న మున్నీరు
పొంగి రానీయకమ్మా, అనదలకు
నందె గోపాల మమ్మా!

మూరర్త్రి తైల మదిగో - మాకళ్ళజ్యోతి అదిగో!
ఆయింట వెలిగినది - ఈ యింట మెలగినది
నిత్యనందాదీపమై నాలత్మ్మ,
నందె గోపాల మమ్మా!

గ్రామదేవత వంటిలో - చావుబ్రతుకుల రెంటిలో
వడి చీలి చెడినాము - చెడి వ్రీలి పడినాము
తిరుగలికి పోసి విసరే గింజలము
నందె గోపాల మమ్మా!
ఇది విలయ నిద్ర కాదా - ఈ మృత్యుముద్ర లేదా?
బరువైన దిక బ్రతుకు - కరవైన దోర మెతుకు
పడలేము బాధ అకటా అకటకట
నందె గోపాల మమ్మా!

చీలికలు చీలికలుగా - పేలికలు పేలికలుగా
తల మాడి, మత మాసి, తల మసిడి, నుడి యూసిడి
నుడిగుండములకు చిక్కి - నుగ్గి చిక్కి తిమి
నందె గోపాల మమ్మా!

దారిద్ర్యరాహువృష్టి - పటుజటిల వజ్రముష్టి
ఎద పిసికి పిండినది - జీవమును మొండివది

కుతకుతల ప్రాణ మెదలో ఉడికినది
నందగోపాల మమ్మా!

ఆకొన్న పేదకోపం- ఎత్తినా విశ్వరూపం
ఈభువనములు మూడు, ఈ [illegible] లేదు
ఆపోశనము పట్టునో అనలమై
నందగోపాల మమ్మా!

బరవసము చేవి ఎదలో- సమరసపు జోపి వడిలో
“భుజ మెత్తి ధ్వజ మెత్తి అందరిలో తల యెత్తి
రా రండి రండి రండో యని పిలుపు
నందగోపాల మమ్మా!

విడు విడుము సైంహికేయా నడు నహుష కార్తికేయా!
ఖనిత భండారమున- గరళ డిండీరమును
మధురసాయనము చేసి త్రాగింతు
నందగోపాల మమ్మా!

## రాధ పిలుపు

కొంచెముకొంచెమై పెదవికోసల మోనులు వోవునవ్వు లం
డం చివకాముదీప్రభలు నిల్చిన యాకడకంటి చూపు సా
రించి మనోరహారపటలీపరిభూషిత రాధి కాంభూ
కంచిత దేహవల్లి నుపగూహనలో నొకమారు నింపరా!
నీమురళీరవమ్ము విని నీకడకున్ జనుదెంచి చూతు నా
స్వామి! యదేమి నాగరము సన్నడిగెన్, చమరించె దేహమున్
సామివినిర్గతాశ్రువులు జాలయి వచ్చెను, ఫుల్లగల్లముల్
ప్రేమమధురమ్ముగా పులకరించిన దివ్యదుమాలతీగలన్.

స్వామి! పునఃపునారచిత చంద్రకచారుపురఃప్రసారముల్
శ్యామననున్ హరించె బర్హిణ కలాపికలాప కైశిక
శ్రీమహనీయతల్ సతుల లేయెడదల్ హరియించుటల్ వినా
ఏమి ఘటించు నీకు- కృపరించుట నీపని యయ్యెనే ప్రభూ!

ఓయదువంశమాలి! కనవోయి ఇదే మిది ఏరసాలమున్
ఏయరవింద కోకలుప ఏవవమల్లిక ఏయశోకమున్
కోయుదు నీయెడంద, నలికోమలి నాటకు నాకు రాధకున్
తీయనిమంటలై యునుచు తీయును రా జగదేకసుందరా!

పలవులు మూర్చ్ఛరించుర సవన్న వహ్నిచ్ఛవకమ్ము నీకునై
నిలిపితి ప్రాపి పొమ్మ్ము నవనీతదయాగుణశాలి! అవలన్
వలచిన నుండునో మరి రవంతయు నుండక యెంపిపోవునో
తొలిచినకూర్మి కన్నుగవ నూనిన నే మగునో జగత్ప్రభూ!

నీలమణిచ్ఛవిచ్ఛటలు నిండిన నీహృదయమ్ము రాయి కా
జాలదు నీరపాకృతిక జాలద ఈనిఖిలప్రపంచమున్
చాలని హాయలంతియుపచారము లన్ మరి యేమి చెప్ప కా
నీ లలితమ్ము నాయెద వరించదు నిన్నొక వేల్పు సామిగా.

నీ వొకవేస్తకాడవు, నే నొక నిచ్చెలి నంచు నెయ్యముల్
తీవలు సాగిపోయినవి తీయని నాతలపోతలన్ ప్రభూ!
సేవకు దత్తనాప్రణయజీవితమున్ సకలమ్ము నీకు ము
ద్దౌవలయమ్ముగా, మురళిగా, చెలిగా, వినియోగపెట్టగన్.

## ఉ ద య గీ తి

ఉదయగిరి నీలసానూజ్జ్వలోపల పాళి
ఆదిత్యపాత్రరారాధనోత్సవ రచిత
కంకేళికుసుమ సంకాశనీరాజన మొ
పూజాపరిభూనవా పామువుమల కైసేసె.

శుభవసంతవిభాత సుమకరకృతాంజలుల
విశ్వవిభుచరణసన్నిధి నిలిచె సుమవనము;
హరిత తంత [illegible]ంచితాయతాస్యప్రభల
నలముకొనె నవజీవనానందమధురిమము.

విశ్వవిశ్వంభరాంభోజ కర్ణికవోలె
తరణి తపనారుణోజ్జ్వలమూర్తి కనిపించె;
నవప్రభాతోత్సవ మ్మెదురుకొని మనలేక
అఁగరిపడి రే యింత చెదరి తెలతెలవోవు.

పవమానమంజుల ప్రాభాతసౌరభము
చలదుషశ్శైత్యలూషి చరణలాక్షారసము
ముసురుకొని నారొండదమురువు పోసినసోన
మధురించి రసధునీమధ లూర్చినది లోన.

ఈయుషశ్శైత్యమ్ము లెద పిసాళించినవి
సోయగము పదనైనతీయనినయముల వలపు;
ఈప్రశాంతమ్ములో, ఈప్రభాతమ్ములో
బ్రతుకె మధురమ్మైన రాగిణి మ్రోగెం.
రసపిపాసీ! కదలి రా వేల నీయూల
అదె నవోదయగీతి, అదె మధూత్సవరీతి,
అదె వసంతాభ్యుదయ హాసితరాగ జ్యోతి,
లేదు మసనపుకీలి, లేదు నరకజ్వాల.

యుగయుగానంత భానూదయోత్సవయాత్ర!
హిమపదాంకితకుసుమ కోమలారుణపాత్ర!
అందుకో జీవనానందబంధురయాత్ర!
అందుకో వాసంత మందారమధుపాత్ర!

# శ్రీ జనమంచి రామకృష్ణ

## ప్రణయినీ!

విరహవేదనలందు వాడిన
తరళ జీవుని హృదయ ముకుళము
నీ - ప్రణయ కిరణామృతములో పల
సురభిత మౌనా ప్రణయినీ!

ప్రణయ దీపోజ్జ్వల కిరణములె
చొరగనేరని హృదయ కుహరము
నీ - ముఖేందు శ్రీమయూఖో
ద్దీప్త మిక నౌ ప్రణయినీ!

నిద్దుర గప్పిన నిప్పుపోలిక
వ్యసన మావృత మైన కనులకు
నీ - మూగసైగల వదను తెలియగ
పలుకరింపవొ ప్రణయినీ!

మృదుకరమ్ముల వీణె తాలిచి
తనువు మరచేరాగ మెత్తుదు
నీ - చిరుతగాజుల లయస్వనమున
తంత్రి మీటవొ ప్రణయినీ!

ప్రణయ మధుకర భిక్షునై నీ
ప్రాంగణమ్మున దోసి లొగ్గితి
ఆదరంబున అర్ఘ్య మీయవొ!
కనికరింపక ప్రణయినీ!

కలపుటల లుప్పొంగునంతనె
హృదయముకుళము కళలు దేరెను
నీ - మధురబింబము కాన నయ్యెను
ధన్యజీవిని ప్రణయినీ !
అమరలోకపుచాయ లన్నియు
నేత్ర యుగమున నిమిడియుండగ
నీ - చాయచాటున లీన మగుటకు
చనువు నీయవొ ! ప్రణయినీ !

## నిరుడు : నేడు

నిరు డీ రోజులలో
నారమణీయమణి ప్రణయరేఖ
నే డీ రోజులలో
నారమణీమణి ఓష్ఠరేఖ.
నిరు డదో నిర్లిప్త స్వప్న స్మృతులు
నే డవ్నో యొండ్ల ఫలస్మృతులు.
నిరు డీజీవిత ప్రాంగణ మొక
పర్వత భయావిర్భూతం
నేడో నారమణీమణి చరణమ్ముల
మణి నూపుర నినదం.
నిరు డెంతో పరిరంభ ప్రియాసక్లేశం
నేడో నారమణీమణి పరిష్వంగ సమావేశం
నిరు డీరోజులలో
రావిహీన కుంజ విన్యాయావనము
నేడో ప్రియదరహాస ప్రాకారము!

శ్రీ జనమంచి రామకృష్ణ

## వలపు పొడుపు

పుడమిపై పుట్టితిని పురువునై పూవా!
తగ మొగంగిన ప్రేమ భర మాయె పూవా!
కనుల కే వ [illegible] కి కీటకి నేమొ;
ఈ పాడు జన్మకే ఏం జాలిని గనవు?
తరి తీపి తేనియలు త్రాగు తేటిని కాను
తెలు గొరవి రొగిరేటి మెరుగు పురుగును కాను!
కలిక విరియింపనె నళి నౌదు జుమ్మనను
తళుకు బెళుకులు చూపి తనియించనూ లేను.
అగ్గలము కా నాస మొగ్గ తొడిగిన దాది
కామమే పైకొనగ కాచుకొని కూర్చొను.
మకరందమును గ్రోల మది నాశయే లేదు
నీసరగునే మనుటకై మ్రోగు నాయెడద !
పురువునై నా వలపు పొడు పేలనో నాకు
పూవు లంటే బ్రతుకె పులక లేలనో నాకు!
నీ యూర్పు చిలుక తెమ్మెర సోకు తావులనె
నీ రేకు ఛాయలనె నివసించ నీవోయి !

శ్రీ వావిలాల సోమయాజులు

## జీవయాత్ర

ఎవరికని చెప్పుకొను నే నీనిధి
పవలు మోసినబరువుల బడినబాధ;
సకియ, చెలరేగు రేవిక —సకల మిటులె
తీరటులు మాగ గడచు నాజీవయాత్ర.

ఎడద పరువెత్తె చెలియట్లై రేయిటిబాట,
ఇచట నను నిల్పి, పిల్పుల కేంకి గొంతు
జీరవోయిన వెనుకను చేరరాదు
చేరినదో, లేదో, నాకేక ఆరిపోక.

ఎదట కనుపించు నారెండ కొంత దారి
ఊరుల పొలిమేర బాటల నెరిగి యెరిగి
అరిగినది గాని బేలమై అలసి సొలసి
తిరుగు కను చూపు మేరలో దెసల నరసి.

మునుపు సెలయేటి పాటల మోసులెత్తు
నూత నాయత శాఖి కానోకహముల
నీడలే మేడలుగ మాకు నిండు రేలు
ఆటపాటల కలలుగా నరిగి పోయె.

ఆమె ఆషాఢ జలధరాయతన సీమ
'కొండలు మరువగ నటియించి రెయొరగి నిదుర
మేలుకొను మెరపు టన్నుల మిన్నగాని
దీను డగు వీని రెయొడి జేరు తెరవ గాదు.

స్వాగతోన్ముక్త గీతానర్తవంతికలుగ
నపుడు నను పిల్చినట్టి యాయలల రొదలు
మాదు పేరిమామృతస్యంది మార్జితములు
సైకతముల నేని కనగ చనగనీవు.

## సుమ ప్రియ

ఇది యొక కన్నెపూవు హృదయము! మధూదయవేళ నెంతొ
సున్నదనము దళిర్చగా మదన మున్విచ్చిన నీయగ లేదు మున్ను నీ

ఏమకరంద ధార భువనేందిర పాద మరంద ధారలన్
ఏమకరందధార కవితేందిర నేత్ర మరందధారలన్
నీమముతోడ క్రోలుటకు నేర్పవొ ప్రేమరసార్ద్ర చిత్తమై
ఆమహితానుభావ మధురాసవధారకు నిత్తు నంజలిన్.

## ఉజ్జీవము

అవిగో! శాత్రవ కాలమేఘములు ప్రోవై క్రమ్మగా వచ్చె నీ
డవి నద్రిక్కులం దిక్కుల మా కిక భద్రిదాక్షత్ర జాలమ్మె — నీ
పువ్వువిల్ పూనను లెమ్ము, కానగదవే పుష్పాస్త్ర! శీతాద్రి సం
భవపై నీశువ నమ్ము నిల్పుము తపోభంగింబుచే నెచ్చెలీ!

అనుచున్ దేవసభా తరాళ, న నాకాధీశుడే వేడ్కయై
నను ప్రార్థించిన పొంగి నాపొగరుమి న్నందెన్ గదా! క్రొవ్వి ఆ
డిన మాటల్ తలకెత్తె నీబరువు — పోటీ వంగ తే డెవ్వ డే
మనివన్ నా కొంర నేడు గర్వ మిటు మాయానాగురన్ చేర్చెనే!

కల దని యెంత చెప్పి తరి—! తలపోసినిసే యొకింత నీ
తలపులె సత్య మయ్యె జడదాతుల గెల్చెదరిరి గెల్వగా
కలనను నంబు నమ్మి ప్రభువై కరుదెంచితి — బుద్ధి వచ్చె — ఓ
చెలి! ఇక ప్రాణ మున్న నడిచేయను నీపలుకుల్ గణింపగన్.

ఎడనెడ దుర్నిమిత్తములు నేడ్తెర కుండి కురిసెంచి ఓచెలీ!
తడబడు గుండెతో నెదురుదారులు చూచెను రెప్పలార్పకే
యొడికము తప్పి నిల్చె — తడవో కలకాలము — మాను మింక నా
యెడ గలయాస యీనమ కు మేని బయాల్పడు నే ప్రియుం దికన్?

అడుగుం గద్దు వచ్చి తడియారని కన్నులతో కపోలముల్
వదవద వల్లనై సొగసు వీడగ వీడుటకొవ్వకోని నీ
మొదదను దిద్ది 'ఉన్న యటులే' చనుదెందు ధరింపలేను మీ
కడ నిలువంగలేని క్షణకాలము నాకు యుగమ్ము లో ప్రియా!

తీరక రాదు పీడకల యొక్కటి వచ్చెను రేయి — చెప్పగా
నేరను ఘోర మైనది! వినీలతమాల నికుంజ వాటిలో
చేరినవేళ నావలపు చేష్టలు తీరకయున్న దూర మై
నారము పోవగా వలదు నాథ, యటం చెటు లడ్డినావొకో!

సునుబాణమ్ములతో జగమ్ములను విస్ఫూర్తిన్ తిగన్ గెల్చి నే
నమరేంద్రాదిసనరక్ష సేయుదు గదా! అస్మత్స్వల ప్రాభికిన్
నమమే లోకములోన ఉన్నదం యిచ్చన్ గర్వైనైతోరి — నా
ప్రియమదం బంతయు భగ్న మైన దికి తీర్చన్ శక్యమే కార్యమున్!

నను గని నవ్వుచున్నది నన బోల యుత్పన నవ్వు సేమ నా
మనమున ధైర్య మొక్కరుణమాత్రము నిల్వక జారిపోయె ని
ననవిలు చేత నిల్పక భిమయాకుల మైనదొ యేమొ! ఇట్టి నే
నంతర సాధ్య నీకు పరమాత్మ ప్రాణసమ్ప్రీతి మాంచనే!

ఆలోకింపక యున్న నద్దితలు ప్రాణానంత నాసంత లీ
లాలాలిత్యము సుస్మరించితివి — ఉల్లాస యుతో శాసనం
బీలీలన్ భవదీయ దివ్య విభవోద్వృత్తిన్ నిరూపించె నో
యూ! లోన మొక్కక యుంచుకొన కన లేనే లేనుపో నీయెడన్.

ఎంత మహోగ్ర మీతపము! ఎట్టి మహార్థము కాంక్ష చేసిరో
అంత మ దెన్నడో ఎరుగు నావరమేశుడె; అష్టసిద్ధు ల
త్యంతము తన్ను చేరను గదా! ఇది ఎందులకో మహాత్మ! ర
వ్వంత విలాసమూ నిజ నిరామయ ధారణకున్ పరీక్ష యా!

జీవన పుష్పసౌరభము చిత్రగతిన్ మటుమాయ మయ్యె — నే
మో విపరీత మై విధి విమోహ దరిద్రునిగా నొనర్చె బా

ధా విపినాంధకారమున దాఁగలు మూసి దవాగ్ని పెట్టె దే
వా! పగ తీరి యింక నిరుపాధి మరెన్నిటికో దయామయా!

కమ్మని తావి గాలి తరగల్ తల కెత్తిన మోయలేని భా
రమ్మున మందమంద మధురమ్ముగ సాగుచు వచ్చె మార్గ మ
ధ్యమ్మున సర్వమున్ పులక లొందగ జేసెడి — సృష్టిలోని మ
ర్మమ్ముల విప్పి చెప్పు చనురాగ రసాంబుధి వెల్లిగొల్పుచున్.

ఏయెడ నుండిరో యిదె నవేందు సుధామయ రోమలీవనిన్
ప్రాయపు వన్నెలన్ గలయ బ్రాకెడు — నీతొలిసంజవేళ — నో
హో యిదె వచ్చుచున్నది మహోన్నత భక్తిరస ప్రపూత హ
ర్షాయతలోచనాంబురుహ ఆశ్రితనూజ మనోహరాకృతిన్.

ఈ మహనీయ గాత్రి మధురేక్షణ పంక్తులలో నటించు వి
శ్వాసముల పాదపద్మ మృదుచాలనలో హసియించు చాలులో
కామిని పాణిముల్ దివిజకాంతల కోమలకుంతల ప్రభా
స్తోమము నిల్చియున్నది విశుద్ధమనం బిక పల్లవించెడిన్.

మానిత హస్తయుగ్మ మధుమాస మహోదయ పత్రపుష్పమా
లానవవాసనాలవారి నాట్యము జేయ మహేశు కంఠ సీ
మన్, నిజనాట్యభంగిమ సుమాసతి నిల్పి శుచిస్మితాంబుజ
శ్రీ నవకమ్ములన్ గనిన చిత్తజు డంతట నెక్కువెట్టెడిన్.

శ్రీ పిల్లలమర్రి హనుమంత రావు

## సమాధానం

ఉత్తుత్తమాటలకె ఓ భామా!
తలకిలికి పడతార యాడైనా!

# శ్రీ పోలూరి ఆంజనేయ ప్రసాద్

## ఆస్థ

తావకీన హృదంతర మ్మది
దర్పణము మత్ప్రణయ రేఖకు
మామకీన మనస్సరోజము
ధామము భవదంఘ్రిగ భ్రమరికి,
తావకీన శుభాంగ రక్తిమ
దాత్రి క్తెల్లత మద్విహాయసమున
మామకీనము గగనము, సుమ
నో వనోజ్జ్వల త్వన్మయూరికి,
తావకీన ప్రసన్న దృక్తతి
తారకలు మద్గగన వీథికి,
మామకీన ప్రహృష్టహర్షము
తామితము నీహృదయవాటికి
కో విహార విహంగలక్ష్మి!
ఒక్క నిట్టూర్పిచ్చి పోవే!
ఈ యాత్ముని గుండెలోపల
నీ కులాయము కట్టుకోవే!

## ఒక మాట!

[వినుకొండసీమలో మదమంచిపాడు అనేచోట వెలసిన
ఆంజనేయ విగ్రహాన్ని చూచినప్పుడు]

ఏలో! బాలాతపమ్ము ని బ్బిగిరి రాగిరి
చుంబనోత్కర్ష పెల్లు దెచ్చుకొని పొంగి
పొరలినది యించుగుండె కాపుర మిచట
నిలచి చేసైగ చేసెదవంటే! అదేమి!

కొందరు చెప్పుకొందు రిదుగో మరి నీవు నిశీథి వచ్చి ర
మ్మందువటే, త్వదాశ్రితసుమావళి కొన్నిటి ప్రోవు జేసియు
యుంచను మున్నరా తెలుపు డంచు దినప్రదనాభిలాషులన్
అందరి కీరసజ్ఞసుమహత్వము లేదా! అపూర్వహేతువో!

అదటి శరన్నవోదితవిహాయసగాంగ ఝరీసుధాచ్ఛటా
ప్రచురమహాంగ్మహార్ద్రినద వాదిశీతలసమ్మనోజ్ఞహా
రనిమదపాంగరాగరసరుద్ధవ, తారకనేత్రగోళకా!
సుచరిత మవ్వయీపురుషమూర్తిను చెప్పగ నన్ను పిల్చెడిన్.

స్వామీ, మామదపంచిపాటిపాల మాస్వాదించుకాజ్ఞాన్నటి
తామాధుర్యము గడ్డకట్టె ననుకో, కాకున్న మాటీర్యలో
చేమంతుల్ పసిగడ్డిపూలె యనకో! స్మృత్యర్థమే మంత్రపు
ష్పామోద మ్మది, లేక ఇచ్చిన గదా, 'వ్యాపారి' నైయుండుటల్.

ఏహాలాగ్రమ్ముకి క్లైద పొంగి వచ్చి నీ
దివ్యరూపమ్ము నెత్తిన ధరించె
ఏమందపవన మర్ధించిరో ప్రత్యూషః
ప్రణయి మానసగీత పాడి నిలిచె
ఏచళుక్యవరాంధ్ర నృపజయాంక మ్మిట
శశిలోన మంది శాసనము యయ్యో
ఏననా పాథవాహిని నింపు కన్నీట
తావకాంఘ్రియుగమ్ము తడిపి పోయె
ఎందుకో యింద లీగడ్డ కేగుదెంత్రు!
అవునుపో మాప్రబుద్ధబుద్ధాను రక్తి
మొలిచి, చెట్టయి, ప్రసూనయి మొగ్గవిచ్చు
చింత చిగురింత కోసి తెచ్చికొనుటకని!

# భాగవత ప్రశంస

అవి దక్కించుకొనెన్ గజేంద్రకరుణా వ్యాపార పారీణతా
ప్రవిముక్తామలశోకగామి, హరిశుంభద్వ్యక్తి సుధ్యం బతా
సువిలాసమ్ములు, దైత్యబాలక విపత్త్రాతృ పాత్ర్యక్రియా
వసతా ధ్యానము లాంధ్రభాగవత కన్యా పాద మంజీరముల్.

లలిత సరస్వతీమకుట లాంఛన చంద్రకలాభిరేఖ, భూ
స్థలి దిగి వచ్చి సర్వజన సంస్తుతమై తనరారినట్లు, కో
మల సరసార్థగుంఫిత సమాసశరన్నవ చంద్రచంద్రికా
వలి దలుకొత్తు భాగవతభారతి ఆంధ్రరసార్ద్రమై చనెన్.

ఒక బృందావన వేణుగీతము జగమ్మూగించు సుర్యోల — తా
నొక హృత్పద్మ వినిస్రుతార్ధమధు కావ్యాలాపన మ్మూరకే
సకలమ్మున్ మన మావరించినది, విశ్వమ్ముల నిక్కైన, మా
మక హస్తద్వయ మెట్టులూచు నిక సంస్కారమ్ము దూరమ్ముగన్.

అది శ్రీవత్సము కాదు కాదు దయ పెల్లై స్వామిహృద్వీథియం
దుదయంబైన మహానురాగలహరీ వ్యుత్పన్న బాధోలవం
బది పైకుబ్బినదోటు మచ్చవలె, నీయం దగత వాత్సల్యమై
నది కావచ్చు రసాత్మ లెవ్వరను సామ్యంబేకదా నిత్యమై.

ఈ మందానిల మెంత శైత్యదము! కాదేనిన్ యదూత్తంసు వం
శీ మాధ్వీకరసోద్ధసైక సుషిరాశ్లిష్టస్వనాకృష్టమై
కామించెన్ నిగమాంతబోధనకళా కౌశల్యభృంగోత్కలిల
శ్రీమద్భాగవతాచ్ఛగాన పృథువీచీడోలికా సఖ్యముల్.

లలనామోద రసప్రసంగ చణ వాల్లభ్యంబు కంఠంబు, వా
డలవార్చెన్ రఘువంశ మేఘము, సమాకృష్టస్ఫూర్తి మంత్రమ్ము, గం
ధిల హారిద్ర మృగీమదాగురుహిమానీ చందనాంగీణముల్
కంకంత స్వనతావకీన కృతి కాంతాశ్లేష మెట్లోర్చునో!

అద్వైతామల పుష్పగుచ్ఛభరితమై వ్యాకీర్ణసాంఖ్యాది యో
గ ద్వారాధిక శాఖమై, యుపనిషద్గ్రంథాలి సంపూర్ణమై
సద్విద్యా పర ప్రకార శుకసంస్తవ్యసమ్యుక్తమై పొల్చు, కృ
ష్ణద్వైపాయన పారిజాత మెటు లాంధ్రక్షోణి నాటించితో!

పోనీ తమ్ముడ! ఇట్టి పుణ్యకవితా భూమిస్థలిన్ దున్ని యా
న్నేనిన్ సస్యము లైహికాతురులకున్, శృంగార గాథాప్రథా
మానవుల్ కొలిపించినావు వ్యాకరణోద్యోగంబు పండించి వా
రైతుల్, తెల్గులు దేవతాత్మకులుగా నానందమున్ గొందురున్.

జలజాతాల నా హృదయ చంపకమానము లింత నీరసమై
పిలిచి త్వదీయ సౌగంధ పదవీ పథతాప్త శ్రోతా ఖనిష్కక, తుం
దిల మధుపాత్రికల్ పరిగణించెదవో; అటు గాక నిన్ను బ్రహ్మ
కలన పిపాస భాగవత కావ్యము లింకను వ్రాసికొందువో!

## శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి

## బృహదీశ్వరాలయము

వామపార్శ్వమునందు వెన్నెలల
వాసనలు చిలుకుచును ప్రోయునది
వన్నె గలధుత్తూర కుసుమమా,
నటరాజ సచ్చిదానంద దీపమా?
వేదస్వరూప మహాశిఖరమున
విఖ్యాత చంద్రికల నిలుపునది
వెలుగిడెడు వెన్నెలల ప్రాణమా,
నటరాజ విజ్ఞానదీపమా!

నర్తనలవీధిలో విస్ఫారి
నాదములసంతోష మందునది
నాట్యప్రియుని యభయదానమా,
నటరాజ ధర్మోపదేశమా?
నృత్యోత్సుకతతోడ పద మిడగ
నియమజ్ఞతలతోడ మెలగునది
నిరుపాధి మైయున్న గుల్ఫమా?
నటరాజ వైరాగ్యనియమమా?
ఆజటాజూటాలలోనుంచి
అందాలతో నాట్య మాడునది
ఆవృత్తు డని పిల్చ స్వీయయా,
నటరాజరాగార్ద్రశేఖయా!

## రాగిణి

నీ ముఖాంబుజ కోశమందలి
ప్రేమరజమును క్రోల వలె నని
పొంచియున్నా విన్ని దినములు
పూర్ణ నిర్ఝరి వాలిపోవగ రాగిణీ!
కాంచినాడను దివ్యవీధుల
సంచరించెడు ధవళమేఘుని
చాయలందున నీముఖంబున
సాంద్రరాగము లంకురింపగ రాగిణీ!

దక్షిణానిలమార్గపంక్తుల
యక్షిణీసఖి మరునివాక్కుల
దివ్యపాలిక వెలుగు చూపగ
[illegible] రాగిణీ!

మరల మరల పిలుచునటే!
తరళమధురగీతు లవో!
రాలినఆకాశతంత్రులు
తూలి కలిసి మ్రోయగా! మ్రోయునటే!!

నీరవరాగ జలధిలో, నిబిడనిరాకాంధిలో
తేలి తేలి ఉదయించు వెలుంగులు
తీయని అలలతోడగా
మ్రోయునె మధుమురళి!
హృదయములో మధుమాయా!

## మేఘదూతనుంచి

అమృతమధురజీవనదా! జలదా!
అలకాపురి చనవోయీ! నా
చెలికి ప్రణయసందేశము
అలకాపురి చనవోయీ! అమృతమధుర!

ప్రియదూతవు, ప్రాణదాతవు,
మధురహృదయ సంయోగవిధాతవు!
రామగిరివనుల ప్రేమతాపవిగ,
సీమ మంటి నవి చెలి కరగింపుమా!! అమృతమధుర!!

నర్మదహ్రదిపై ధర్మదీప్తులా
చంద్రికలల విహరింపుమా!
సాంధ్యరాగముల సంధ్యాహాసవుల
చల్లదనము గ్రహియింపుమా! అమృతమధుర!!

కొండ కొండ నీ కెండిమొరవులో
దండ దండ మల్లికలు!
కొలను కొలను పద్మినీ నవలవులో
కెలన కెలన వాంచికలు! అమృతమధుర!!

ఉజ్జ్వల కంపాశఖ! చనవోయీ!
ఉజ్జయిని గనవోయీ!
మహాకాళదేవాళి సినాథుల
మాధుర్యము గొనవోయీ!
సుందర రమణీకుంతల ధూపను
గంధము చవిగొన వోయీ!
ఉజ్జ్వలశంపానఖ!
గంగావిమలతరంగభంగగతి
గళగంభీర మృదంగ మొలయనీ!
హిమశైలముపై కిన్నెర కన్నెల
వాగవర్తనముల వంశీరవముల
గంగాధరు హృదయంగమ గాథల
గళగంభీర మృదంగ మొలయనీ! అమృతమధుర!!

పూలతరుల, తీవలపై, గీ
తాలు పాడు మధుపావళులు!
తండతండముల, తామర కొలనుల
తారాడు తరుణమరాళములు!
నిండు గళముతో పురివిడ, పాడుచు
ఆడెడు మత్తమయూరములు!
నిత్య వసంతము, నిత్య శారదము!
అమరధామ మలకానగరి!! అమృతమధుర!

# శ్రీ చెరుకుపల్లి జమదగ్ని శర్మ

## మ థ న ము

ఇంత యాశాపూరిత హృదయు జేసి
మాట వినుమంత పడలేని మాని జేసి
దర్పమునకన్న మెండు రోషమును బోసి
నెత్తిపై నిట్లు మరిమరి మొత్తెదేల ?

ఎన్నిమారులు చెప్పినా నేను నీకు
నా మనస్తత్వ మిట్టిదో నాయనా ! ర
వంత యేని కదల్ప కల్పాంతసాగ
రము విధంబున జగముపద్రవ మటంచు !

వినవు, వినిపించుకోవు, నీ వెర్రి నీది !
మాటిమాటికి నవమాన మందరముల
నా మనస్సున్నదోయి దంత నట బుట్టి
హాలహాల మది యేమి నీ కంత నచియె ?

ఇంత సునిశితహృదయు గావించి గాని
నీ మహత్త్వము చూపవా యేమి దేవ !
నిత్యమును నీదు ప్రాణను నృత్యమాడు
పన్నగుని నన్ను నెత్తిపై బాద నేల ?

ఈ పరీక్షలు నామీద నేల దేవ !
స్వల్ప మతి నేను, నీవో సర్వజ్ఞుడవును,
నాకు నీకును మధ్య నంతరము మెండు
నీ సమానునితో పోయి జేసికొనుము !

హాలహల ముద్భవించిన యచట నమృత
మును దొరకు సందు నీ యుత్తముఁడను చేసె
దోఁపి యది యేమి తలంచెదవో యనంత!
నా మనస్తత్త్వమును బట్టి నమ్మవలె!

ఇందుకే నీవు నన్ను బాధించఁగేని
యీ విశాల హృదబ్జ మర్పింతు దేవ!
అమృతనందద కేళి పోరాడ సామి!
శాంతి నొసఁగుము నా కది చాలు! చాలు.

## నా మూర్తి

దర్పణాంతర ప్రతిబింబ దర్శనమున
నన్ను నే జూచుకొంటిని, కన్ను పొడిచి
క్రుంగిపోఁ ద్రోయునట్టి జుగుప్స కలుగు;
నీ యనాకారరూపు నా కేల కలిగె!

సహృదయు హృదయ దర్పణస్థము మదీయ
మూర్తి సౌందర్య మన్య లభ్యంబు గాక
నన్ను మించెడివాఁడు లే డన్న గొప్ప
స్థాన మిచ్చెను కావ్యవిశ్వంబునందు.

సరసహృదయ మనోనురంజనకు దగిన
యట్టి హృది యింత రూపవిహీన మైన
దేహమం దేల చొచ్చె? మదీయరూప
మెంతమాత్రము బాగున్న నీ జగంబు
సర్వ మేలనె నాదు రాజ్యంబు గాగ!

ఈ కవిత్వము, సహృదయలోకమే గ్ర
హించజాలు నట్టిదట! నశ్వరించె
తేజ మామూదమందు వర్తిం విధాన,
ఖరకరుండు శైవాల పంకజమురీతిఁ.

ఈవికృత మైన రూపు నన్నేమి సేయు?
సుందరం బయి సత్యమై శుభద మైన
సత్కళావాస కావ్యవిశ్వంబునందు
మన్మనస్తేజమే భాసమానమయ్యె!
నా హృదయవాసనలె దిగంతములనిండె!

## శిలా హృదయము

స్వామీ! సామయజుశ్శిఖాజ్వలిత తేజస్స్ఫూర్తిమన్మూర్తి! భా
మామాధ్వీరసపూర్ణచిత్తజలజా! నీరాననాంశుప్రభా
భాసామాద్దీపితసర్వలోక! శ్రీజగన్నాథా! రఘూత్తంసమా!
రామా! రమ్యా! దయాపయోదనవలీలా మోహనాకారమై!
ప్రతిలోలికోడికూత పేరంపపు గోతియై రాయివడ్డ నా
బ్రతుకున పంచప్రాణములు పట్టి పళ్ళిం మము విస్మృతాంశము
స్మృతి నిడి గాడ వీడి భ్రమియించిన నాదగు జీవయాత్రకున్
ప్రతిదినగండమై చనెడి పద్ధతి తీరగ లేదురా ప్రభూ!
అలతొలికోడికూత వినినంతట సతమసమ్ము తూర్పుచా
యల పోగివోవలేదు. హృదయమ్మున నిండుగ గ్రమ్మె; స్థానసం
ధ్యలకు మెయి మసృడే గడప దాటిన నాథుడు దాటినట్లు తే
మలగినసవ్వడుల్ హృదయమర్మరముల్ ద్విగుణీకరించెబో!
తెలతెలవారు వేళ కను ద్రిప్పి యుగిందుక మోము ద్రిప్పి, నా
తలపును ద్రిప్పి యున్నదును తాను చరింపగ నూత్నమానసభో
జ్జ్వలరమ్యసృష్టిలో వెలుగు బాటలలో నడయాడి నన్ను నా
నిలిపెను నేత్రకోణముల నిండిన రక్తిమ శోభ లీనగన్

అది యేమొ కాని పొరపాటుగా దనువు పులకాంకితమ్మైనంతనే
యెద లుద్దీపిత సర్వజీవములునై యేకాగ్రతన్ పొంగినన్
కదలన్ స్నేహమయోదయమ్మయస్ఫూర్తియు రాగా జూచి శ్యామాంఘ్రి) సం
పదలై తెన్నులు చూచు గౌతముని భామన్ జూతు భూధూమిలోన్

# శ్రీ బాల గంగాధర తిలక్

## వర్ష!

ఆననసీమలన్ నగవు లారని కాంతి కలంగ శారదా
రాణి హృదంతరాళనవరత్నముల తీర్పుగ రంగవల్లి తే
జోనిభృతమ్ము లౌకనుల నోలలు పాడ కొంగొత్తనిశ లో
హాసి నటించు నూపురరవో మదిరాప్రమదోత్సవాంఘ్రీ!
చందనగంధరాటవుల చల్లనినిద్దుర దోగి లోయలం
దందు నటించు మేఘవనితల్ విదళించు మెరుంగుపైటలం
గందిన అందము ల్పొంచి, కాంతల గంధపుపూత చెక్కులన్
చిందిన తళ్కుల న్నలచు నీవల రమ్యవిలాంశులోజ్జ్వలా!
రవళుల రవ్వలై మెరసి రాలెడు సన్నని వానచిన్కులే
యవనిక కట్టు దోమతెర యై పవళింపగ, మెత్తమెత్తనా
పవనము శాద్వలాంకురపు పానుపుపై పవళింప, మూరెడు
పవడపుదార మల్లుకొను భావములై కదలించు స్వప్నముల్!
వీచులు నీడ లైనయవనీ వనసీమల జారుజ్యోత్స్నలే
పాటలు జాడలై పల్లవసైగల దూరశ్రుతులై ధ్వనింపగా,
జోడులు జోడులై కలసి సుందరపింఛము విప్పి యాడె నా
వాడల వాడలన్ బహుళవర్ణమువర్ణనబర్హిబృందముల్!

ఏ నాకకోకిలమ్మ నయి ఈ నవమధుమాసమనోజ్ఞశోభ లెం
తో నవకమ్ము లీను నయనోత్సవదాయక వేళ లందు నా
తేనియ గొంతు నెత్తి ఒకతీయనిగీతిక నాలపింప మ
న్మానస మేమొ మాటికి సుమాళవమంపున పుల్కరించెడున్.

మోహనమూర్తి మాధవుఁడు మో మిటు త్రిప్పెనొ లేదొ - అప్పుడే
దోహద మందినట్లు పరితోషమునన్ వన మెల్ల పూచె; ఈ
ఆహ్లాదతరంగ డోలికల సంభ్రమ మందె జగంబు; సృష్టి కాం
తాహృదయంబు వెల్గె నవనాగరకోన్మిషిత ప్రభావమై.

ఎలచివురాకుజంపులను నింపగు కెంపుల పళ్ళెరంబులన్
జిలిబిలి కమ్మకప్పురము చేర్చి వసంతశుభాగమంబునన్
చిలుకల ముద్దుపల్కుల పునీతశుభంకర భాషితంబుతో
లలితలతాంగులు విలాసపుటారతు లెత్తి రాదటన్.

ఈవనవాటిలోన కుసుమించిన గొజ్జగిపూలు, కమ్మని
త్తావులు చిమ్ము సంపెఁగలు, దాడిమముల్, సురపొన్న పూలు, శో
భావహ పాటలాళులు, ప్రియాళువులున్, వకుళా, లశోకముల్,
వావిలిపూలు కన్నులకు పండువు లయ్యె మధూదయమ్మునన్.

ఈనవచైత్రలక్ష్మి నిదురింపక పూర్వమె నేను మల్లికా
సూన మనోజ్ఞగుచ్ఛమయి, సొంపులు గుల్కు తదీయవేణికా
స్థానమునన్ వసించి కవితామధుసౌరభముల్ వెలార్చు చెం
తో నవకమ్ము మీర రసికోత్తములం దనియింపఁ జూచెదన్!

# శ్రీ కొమాండూరు కృష్ణమాచార్యులు

## పురుషోత్తము దేవుడు

తత్ప్రభాతంబున దరలంగ జొచ్చె
పురుషోత్తముని సేన పుడమి కంపింప;
మంథాచలక్షుబ్ధ మహితారవంబు
వైవడి నభము గ్రక్కదల గ్రమ్మె
పటహనిస్స్వానాది భైరవధ్వాన,
మంజునాదల సమూహంబులో యనగ
గజతండములు నిజఘంటా నినాద
మాలామదేభ కర్ణాంతరక్షోభ
మావహింపగ, పదఘట్టన భారమున
శేషభోగీంద్రుండు శిరములు వంప;
ఆయసముసలముల్ హస్తంబులందు
లయసమవర్తి దండములట్లు మెరయ
ఆరోహకుల యంకుశాస్ఫాలనముల
నిజతుండములు నెత్తి నింగి కంపింప,
ఘీంకృతుల్ సలుపుచు గెంతుల నడువ;

నడుమ వింధ్యాచలోన్నత మైనదాని
కనక ఘంటాంచిత కంఠంబు దాని
హాటక వలయ మహాభీలదంత
కాంతుల చంద్రికల్ గాసెడుదాని
పాదలగ్న సువర్ణ వర్ణముల్ మెరయ

తరుణ విన్యాసంబు సల్పెడు దాని
పాటల బింకు సంభావితం బైన
వెడద ఫాలముతోడ విలసిల్లుదాని
హైమరాజిత కిరీటాంచిత స్ఫూర్తి
ధాతుమండిత మైన ధరణీధరంబు
కైవడి విలసిల్లు గంధసింధురము
నధివసించి నృపాలుఁ డా యాంగ్లభూజాని
హిమపాండు రాతపత్త్రంబు మండలము
శిరమున వెలుగంగ శీతాంశుముఖులు
కంకణఝంకృతుల్ గ్రాల, చామరము
లల్లనల్లన వీవ నగుదెంచుచుండె

## విరహోత్కంఠిత

కలకల గూయుచున్ ద్విజనికాయము అంబరవీథి బారగ
గల పవనాంకధూసరిత కుంతలులై ముకోల బూని మం
దల వెనువెంట గ్రేపుల నదల్చుచు గోపకు లేగి రక్కటా!
జలధర నీలవర్ణుఁ డగు జారశిఖామణి రాఁ డదే మొకో!
చరమాదిత్య మరీచికోజ్జ్వలములై శైలాగ్రముల్ రంజిలెన్
సరసీజోదర బద్ధ షట్పద లసజ్ఝంకార గీతామృత
స్ఫురణన్ దుర్భర[illegible]ర్ణతాప మొదవెన్ పుల్లాబ్జ పత్త్రేక్షణుం
డరుదేరం డదవా యె మన్మథధనుర్జ్యాఘోష మెట్లోర్చెదన్?
కమల భవాండ భాండమున గాటుకకొండయువోలె గాఢసం
తమసము లాక్రమించె యదునాథముఖాబ్జ మరంద పాన వి
భ్రమమున యామినిం గడపు భాగ్యమె యబ్బినచో ముకుందువ
క్షమున సవిద్యుదంబుదము చందము దోప నలంకరింపనే!

మారశిలీముఖోగ్ర శిఖ మన్మథు నిప్పుడు ద్రోయుచుండె నా
ధీరకుమార, నీ వపుడె ధీషణగావ మహాగ్నికీలలన్
గూరిమి ద్రోచియున్న నెటు గుందుదుమో? కరుణావిహీన, యి
ట్లారడి వెట్ట నేమిఫల మబ్బెను నీకు వచింపు మేర్పడన్!

నీముఖశీకరం బపుడు నిర్జన సేవ్యసుధారసంబుగా
నామనమందు నెంచి శ్రవణంబుల గోరితి గాని వల్లవీ
కాముక, నేడు రౌద్రగళగహ్వరహాలహలంబు భంగి నన్
యామినులన్ దహించుట మనంబున నే నెఱుగంగ నైతిరా!

మనము వశంబు గా దకట మాధవ! యింకను రా వదేల? యీ
వనిత కఠోరమార శర వహ్నికి దాళగ జాల జెంత నీ
ఘన భుజ పంజరం బొసగి కావుము నీరదనీలదేవ! నా
తనువున ప్రాణముండ దిక తథ్యము శీఘ్ర మనుగ్రహింపవే!

బందుగు లంద రీపరమబాధ నెఱుంగక ద్రవ్వోయి, రా
నందకుమారకుం డిపుడు నన్ను గృపారసవృష్టి జూచునో!
ఇందుల నేగుదెందము నొకో? యిష్ట సఖాంతము కాదొ కంగ గో
విందుని జాడ గన్పడదు! వీచెడు శీతలవాతపోతముల్.

కంకణ ఝుంకృతిధ్వనులు గ్రాల దధి స్మథియించు వల్లవీ
పంకరుహాయతాక్షు లదె పాటలు పాడెద రిప్డు వల్లవీ
కింకరు దివ్యవేణు మృదుగీత రసామృతధార జొక్కి యా
పంకజపత్రనేత్రు సుమబాణుని బంటుగ నేలుచున్నదో!

విలసత్కోమల నీలమేఘరుచితో పీతాంబరాచ్ఛాదితో
జ్జ్వల దివ్యాంగముతో విశాలదృఢ వక్షః పీఠభాగంబుతో
బలభిద్వారణ తుండదండ నిభమౌ బాహాద్వయస్ఫూర్తితో
లలనామన్మథు డేగుదెంచు నని యేలా వ్యర్థసంభావనల్!

నక్షత్రములదండ నాథుమెడ నలంకృ
నలుగు రాతని జూచి నవ్వుకుంటూను
పక్క పక్కల కరిగి పంకించుకొందురు
చక్కగున్నావా డనీ సాటి చెప్పుతారు.

నక్షత్రములదండ నెవరి దంటేను
నా దోయి నా దనీ నలుగు రంటారు
ఇచ్చునా అడిగితే ఎల్లవారలకు
ఆమగకన్నను చెలీ అతడు నా కిచ్చు!

## అన్న

మన నిచ్చి మాయన్న మాటాను నవ్వును
మల్లి పుష్పాలలావి మన నెల్ల నంను
ఆకాశమై తాను అటనుండి చూడు
భూమిపై నతని నే నిటనుండి చూతు.

అన్న నన్ జూచుచు నక్కడే యుండు
నే నన్న జూచుచు నిక్కడే యుందు.
సోదరా సోదరా యని మేము పిలుచు
పిలుపుకే యిరులకు పిపాగు పై తోచు.

మెరపు లా మాయన్న చురుకు చూపులను
మే ఘల్ల కంపి ప నే నందికొందు
పరితాప భారంబు తన కంపగాను
తనదుఃఖభారమ్ము తా పంపుతాడు

అటవికురాల ననుచు అతిమూఢురాల ననుచు
నీ వెంతు వేమొ ప్రభూ! నీవె నాదిక్కు మాకు!
నీకతిథిసత్కారము నే జేసి భువి తరింప
నిమిషంబు యుగముగా నో లె నే వేచియుంటి రామ!

## నిశి

కోపభారవివశయైన కోమలాంగి మోమురీతి
సాయం సంధ్యారుణరుచి సాంద్రం బాయెన్.
ఆపైని కట్టినట్టి అసితచేల మనువిధాన
నల్లని చీకటులు ప్రాకె నలుగడలందున్.
తొయ్యలి కేర్పుగ వచ్చిన నైశ్యప్రియుడు డేమొ యనగ
అర్ధచంద్రు డుదయ మయ్యె ఆకసమందున్.
పొరుగువారి జగడంబులు పొంచిచూచు లోకు లనగ
మినమినలాడుచు మిణుకులు మింటను మెరసెన్.
ఆరాజున కిరువంకల వీచోపులు చేయు భటుల
పగిదిని పర్యారగాలులు పలుమరు వీచెన్.
కావలి రాభటుడు పట్టు కందు కాగడా విధాన
వేగుచుక్క గగనవీధి వెలుగులు నించెన్.
రాజగృహము ముంగిట బాకాల నూదు భటుని భంగి
కుక్కుటములు కొక్కొరొకో కో యని కూసెన్.
నిశి నల్లనిచీర విడిచి వెలివలువను దాల్చెలీ,
తెలి కాంతులకోడ జగతి తెల తెలవారెన్.

శ్రీమతి బసవరాజు రాజ్యలక్ష్మమ్మ

## నౌకాగమనము

నీలి జలముల గంభీరనద పొందవ
పొంగు భంగావళుల భీతి పొడచూపుచున్న
బయలు కడలిని న్యైట్టెటో పడవలోన:
నావికా, నాదు నావను నడపుమయ్య!

ఎదురుగాలులు గుక్కాని చెదరకుండ
అలల తాకున నుయ్యాల లాడకుండ
నావికా, శాంతముగ నావ నడపుమయ్య!

ఎచట దుఃఖమ్ము లేక అహీనమైన
స్వర్గసౌఖ్యంబు లెచ్చోట సంఘటిల్లు
నాయొడకు నాదు నావను నడపుమయ్య,
చేరి అనుకూల వాయువుల్ దారి చూప!

శ్రీ బసవరాజు రాజ్యలక్ష్మమ్మ

## పారవశ్యము

మాపిగటను పెరుగుచున్న
వేపనీడ ఎండవేళ
చల్లదనము హాయి నొసగు
చల్లని వెన్నెల రాత్రుల
చేరి యచట నాథు, డేక
తార పాట, నే పాడుచు
తేలియాడ హాయిలోన
తెలియక రాతిరి గడచెను!

# పరిచితకంఠము

ఆకసమున నవిగో చుక్క
లల్లుకొనెడు చందమామ
వృక్షమ్ముల సందునుండి
తొంగి తొంగి చూచుచుండె.

కొండలోయ దిగువభాగ
నుండి జీవజలమ్ము లవిగో
నురగ క్రక్కు నలలతోడ
గుసగుసలాడుచు బోవుచు
పండువెన్నెలన్ మెయి పర
వశ మొందగ కోకిలంపు
పాటకు చెవి యొగ్గి పూల
వాసనకున్ మదిని పొంగి
కూరుచుంటి సుఖముగ నీ
కొండరాతిపలకమీద.
ఏమి టెద్ది సఖ యని నను
ఎవరో పిలిచినట్లు తోచె.

అమృతమధురనాదముతో
నాత్మ కట్టు కట్టి లాగు
నీకంఠము మున్నెపుడో
విన్నయట్టు లున్న దహో!

యమునా తటినీతటమందున నీ
కాపరుడు మాతో కూడా తిరిగెను
కమనీయ మ్మగు గానామృతమును
మము నెల్లర తన్మయ పొందించెను.

మావల్లనా.........గోపెమ్మా

నవనీతా దిడి కాంచనపాత్రను
నవిరళ చేలాంచలమున గప్పక
నవదుస్మితవదనముతో రాధిక
భవదర్చను గన వచ్చిన దమ్మా

మావల్లనా...........గోపెమ్మా

ఇదిగో వచ్చెద నని నా కేదో
పథమున నేగి యదృశ్యత బొందెను
చెదరక తను గోరిచే కన కాంచా
హృదయము లో దాగున్నారేమో!

మావల్లన...... .....గోపెమ్మా

## శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మ

## వనమాలి

విరహి హృదయ దురంతమీ వసంత
వేళ వనమాలి తరుణీజాలి గూడి
నృత్యహేలాభి రతి విహరించు చుండె
హాయిగా బ్రత్యహమ్మున నచట రాధ!

# శ్రీమతి వట్టికొండ విశాలాక్షి

## ప్రణయ భిక్ష

పరకీయ నయ్యు నే భావించ నీమూర్తి
అవలోకనము సేతురా — కృష్ణ —
అపశయను చరియింతురా !
సఖియతో నేవేళ సరససల్లాపముల
నీచరితలే వినుతురా — కృష్ణ —
నిన్నె మనసున కొలుతురా !
భవదనుధ్యానమున పారవశ్యము నొంది
ఉన్మత్తనై పోదురా — కృష్ణ
ఊరకే నవ్వెదను రా !
మురళి కరమున బూని ముద్దు కెమ్మోవిపై
మధురముగ నూది, టులనే — కృష్ణ —
మది తలంచుచు నుందు రా !
ఆభావమే నన్ను ఆలమికొని యంతనే
ప్రణయ సౌరభ మెగయురా — కృష్ణ —
భ్రమయె నన్నిటు చేయు రా !
నీ మనోహరమూర్తి నిరతి కన్ల కనుపింప
నిదుర యన్నది యెరుగరా — కృష్ణ —
నీకోస మిట [illegible]తు రా !
ఆలింగనము వలదు, ఆననామృతము వలదు,
మనసు లీన మొనర్పగా — కృష్ణ —
మధుర గానమె చాలు రా !

ప్రేమించితిని గాని కామించగా లేను
ప్రణయ భిక్ష నొసంగరా - కృష్ణ -
ప్రదముగాన గైకొందురా !

## వెలుగు నీడలు

ఉదయ భాస్కర కిరణ సంయోగ వశత
మొలక నవ్వుల కమలమ్ము వలపు గురియు,
కలువ కన్నీరు ధారలై కాల్వ గట్టి
వేడి నిట్టూర్పులే వసివాడి పోవు !
శారదేందు మయూఖ సంస్పర్శనమున
కలువ కౌముదగరిమ వికాస మొందవు;
కమల మోడ్పుచు కన్నీరు కరుణ మొలుక
శిరము వాంచును దుర్భరచింత మునిగి

## భృంగమా!

పరిమళం బింతేని పరవశము గాకుండ
రమణీయ మైన ఆరామ వాటిక లోన
కాపరిగ నీ వుంటివా - భృంగమా -
కావరిగ నీ వుంటివా !
కలువరేకుల లోని కమ్మతావులు నిమ్ము
మధురాసవాస్వాద మత్త చిత్తమ్ముతో
ఝుంకార మొనరింతువా - భృంగమా -
ఝుంకార మొనరింతువా !

భవదీయమృదుగాన పారవశ్యము లోన
మై మరచువేళ నామనసు కితరము లేవి
జ్ఞప్తి కైనను రావుగా - భృంగమా -
జ్ఞప్తి కైనను రావుగా!
సద్భావసౌధాళి శాంతచేతస్సులౌ
కల్పనాప్రతిభమై కైత లల్లెదు కవుల
కాహ్లాద మొనగూర్తువా - భృంగమా -
ఆహ్లాద మొనగూర్తువా!
అనుపమాన దయారసార్ద్రహృదయవై యైన
ఆహారపాంబును నీవు ఆనందదాయివై
అచటనే వసియింపుమా - భృంగమా
అచటనే వసియింపుమా!

## శ్రీమతి పుట్టపర్తి కనకమ్మ

## కస్తూరీ బా

కాంత మైనట్టి గంభీరసరణియందు
బడుచు ఘూర్ణిల్లఁజేసినపిడుగువోలె
మామకీన చిత్తమ్ము నీమరణవార్త
కలచినది తల్లి, హైందవకల్పవల్లి!
వేదకాలము నాటి సాధ్వీమణులకు
బింబమై నిల్చియున్నట్టి విశ్వదీప
మారిపోయిన నిలయెల్ల నారిపోయి
నట్టులున్నది తీవ్రవ్యథాకులమ్ము.

తనువుల పతివ్రతలుగ దేశమునకు
పుణ్యఫలములు ఒసగ మానిప్రాణతపను...
వచ్చినవి గోవు తెల్ల రాక్షసుల చేత
రాలుచున్నారు కులపతివ్రతలు నేడు !

శాస్త్రవేత్తలు గుమిగూడి సద్మమందు
తామరు చేయుచున్నారు మంత్రములు కాని
నాకనులదోయి కాంచుచున్నది దురంత
భావిభారతదేశదుస్స్వప్నములను.

తనువునం దున్న ప్రతిరక్తకణమునూప
పావనము భర్తృదీక్ష బలిగ వెట్టి
చన్నధర్మశాద్వలచరి, సౌరభేయి
హైందవసువాసినీ, ప్రణామార్పణమ్ము.

ఉపనిషత్కన్యకలు చుట్టు నూడిగములు
సేయగా శిరి యప్సరః స్త్రీజనమ్ము
పాదములు పట్టి అదితియై భవ్యముక్తి
సామ్రాజ్యముల నొసంగను దీర్పవమ్మ తల్లి !

## రాత్రి రథము

(హంపీలో విఠలాలయమునందు)

నడువవే రథమా !
అడుగడుగులో తెల్గుటందమ్ము చిరునవ్వ
చిరునవ్వుపొరలపై జిలుగువెన్నెల పూంచు
నడువవే రథమా !

నీపాట కోకిలల గొంతులై
నీఆట నెలరాజు నడకలై ... ఓ చెల్లి ...

నా చిట్టిచెల్లీ, నా బుజ్జితల్లీ,
నీహృదయ మొకవీణ నాహృదయ మొకవేణు
విరుపురము ప్రేమతో పరచింతు మొకపాట
ఓ చెల్లి ప్రేమబాలా,
పూచినవి నా ప్రేమపూవులు।

## రావమ్మ తల్లి!

రావమ్మ, నాతల్లి! రావమ్మ దేవి!
నీ పింతతో నన్ను నిలువునా పులకించుము.
నీపాటలే పాడి నీచరితమే ఆడి
నిన్నుకొలుచుటె నాకు నిండారుజ్యోత్స్న
రావమ్మ......

నడవలేనే తల్లి, విడవలేనే నిన్ను!
ఆదఃబ్రతుకులో నాకు, అందాలనడకలో!
రావమ్మ......

అంధకారములోన ఆర్తురాలను నేను
మందారపూవులా అందియాకే చేయి
రావమ్మ......

కోటి కాంతులకును, కోటి వెన్నెల వెలుగు
సాటి లేనీతల్లి, నోటికైనా రావె.
రావమ్మ......

కల్యాణశీలవే, తుల్యు లెవరె నీకు!
కల్హారసంస్థవే కావవే సుందరీ!
రా వమ్మ......

నీకరుణ పావరము నీకాంతె నాశాంతి
నీశక్తి యందునే నాజీవిత మ్మంత
రా వమ్మ......

## వసంతము

వసంతకాలము వచ్చింది
పసందుపూవులు పూచినవి,
మల్లెలు జాజులు కొల్లలు కొల్లలు ... వసంత...

కోకిల కో అని కూసింది
తుమ్మెద ఝుమ్మని పాడింది
పక్షులు కలకల మన్నాయీ
లేళ్ళు చెంగునా ఆడినవి ... వసంత...

తోటలు పచ్చగ విరిసినవి
మత్తుగ పగళ్ళు జరిగినవి
రాతిరి వెన్నెల నవ్వింది
పాటల లోకము నిండినది ... వసంత...

రంగుల చీరెల పనదేపి
చక్కని బొమ్మలు చేసింది
పేరంటానికి పిలిచింది
పుష్పాది గంధము రాసింది

పన్నీ రంతా చల్లింది
తేనెలు వాయన మిచ్చింది
పేరంటానికి పిలిచింది
వసంత కాలము వచ్చింది...

సమాప్తము

"సంసార విషవృక్షస్య
ద్వే ఫలే హ్యమృతోపమే:
కావ్యామృతరసాస్వాద:
సాంగత్యం సాధుభి స్సహ"